పసుపు ప్రవ్వకం
మార్కెటింగ్











మామిడి ప్యాకింగ్

మన

# రైతువాణి

మాసపత్రిక

ఏప్రిల్ 2005, వెల: రు.6/-

వ్యవసాయ రంగాన్ని వీడని కరువులు

రాజోలిబండ డైవర్షన్‌కు మరో డైవర్షనా?

విత్తనోత్పత్తిదారుల ఆందోళన

# లక్ష్యం ఘనం - ఆచరణ అల్పం

రైతు సంక్షేమం, వ్యవసాయ సంక్షోభ నివారణే లక్ష్యమని కేంద్ర-రాష్ట్ర ప్రభుత్వాలు ఘనంగా ప్రకటించుకున్నాయి. సంక్షోభానికి కారణమైన విధానాలను త్రోసిపుచ్చి, సంక్షేమానికి అనుకూలమైన విధానాలు ఆచరిస్తామని పదే, పదే చెప్పారు. అందుకు అవకాశం కల్పిస్తూ బడ్జెటు సమావేశాలు వచ్చాయి. ఫిబ్రవరి, మార్చి నెలలు కేంద్ర-రాష్ట్ర బడ్జెట్ల ఆమోదానికి సమావేశాలు కూడా సాగాయి. కేంద్రంలోను, రాష్ట్రంలో కాంగ్రెసు ప్రభుత్వం పాలక పార్టీగా ఉన్నది. ఈ బడ్జెటు సమావేశాలవైపు రైతులు, వ్యవసాయంపై ఆధారపడిన గ్రామీణ ప్రజలు ఉత్సుకతతో ఎదురు చూశారు. కాని వారి ఆశలు అడియాసలే అయ్యాయి. వ్యవసాయం రాష్ట్ర జాబితాలోనిది. రాష్ట్ర ప్రభుత్వం కేటాయింపే ఈ రంగానికి శ్రీరామరక్ష. నీటి పారుదల రంగానికి కేటాయింపు బాగా పెంచుతున్నామన్నారు. తీరా పరిశీలిస్తే మొత్తం రాష్ట్ర బడ్జెట్‌లో 2004-05 లో 12.13 శాతం కేటాయించగా 2005-06 లో 15.53 శాతంగా పెంచారు. ఇది హర్షించదగ్గ పరిణామమే.కాని వ్యవసాయ శాఖకు 2004-05 లో 3.19 శాతం కేటాయింపులు చేయగా 2005-06 లో 2.85 శాతానికి కుదించారు. పై అంకెలు ప్రణాళిక, ప్రణాళికేతర పరంగా కేటాయించినవి. ప్రణాళికా బడ్జెట్ పరంగా చూస్తే వ్యవసాయానికి 2004-05 లో 6.37 శాతం కేటాయించగా, 2005-06 లో 5.05 కు తగ్గించారు. ప్రణాళికా మొత్తం బడ్జెట్‌లో కేటాయింపు శాతం తగ్గడం జరిగింది. బడ్జెట్ కేటాయింపులు తగ్గించి సంక్షేమం ఎలా అమలు చేస్తారు? పైగా ఈ బడ్జెట్ సమావేశాలలోనే శాసన సభలో సహకార సంఘాల కుదింపు, మార్కెట్ల ప్రైవేటీకరణ లాంటి చట్టాలకు రూపమిచ్చింది. పై రెండు శాఖలు వ్యవసాయ రంగ అభివృద్ధికి అత్యంత కీలకమైనవి. విత్తన చట్టాన్ని రాష్ట్రకేబినెట్ ఆమోదించి శాసనం చేయకుండానే కేంద్రానికి పంపింది.




వ్యవసాయరంగంలో కేంద్ర ప్రభుత్వం ప్రధానంగా ఎరువులు, వ్యవసాయ విశ్వ విద్యాలయాలకు, నూనె గింజల అభివృద్ధికి నిధులు కేటాయిస్తుంది. అలాగే కనీస మద్ధతు ధరల అమలుకు కేంద్ర ప్రభుత్వ కొనుగోలు సంస్థలకు నిధులు సమకూర్చుతుంది. 2005-06 కేంద్ర బడ్జెట్ నిధులు పెంచినట్లు కనబడినా స్థిర ధరల శాతం ప్రకారం ఎరువులపై కేటాయింపులు తగ్గించింది. కొత్త విత్తనాల అవిష్కరణలకు, వ్యవసాయ విద్యకు తగినంత కేటాయింపులు చేయలేదు. పైగా ఈ రంగంలో బహుళజాతి సంస్థల ప్రవేశానికి తలుపులు తెరిచింది. అన్ని రాష్ట్రాలలోని మార్కెట్లను ప్రైవేటీకరించాలని గత ఎన్‌డిఎ ప్రభుత్వం పంపిన " నమూనా చట్టాన్ని" అన్ని రాష్ట్రాలు ఆమోదించాలని ఒత్తిడి తెస్తున్నది. వ్యవసాయ రంగానికి ఆ సవరణలు ఏ పాటి ప్రయోజనం కల్గిస్తాయో వేచి చూడాల్సిందే! కనీస మద్ధతు ధరల విధానానికి స్వస్తి చెప్పే విధంగా మార్కెట్టు విధానాన్ని రూపొందించింది.

గ్రామీణ రుణం పెంచాలంటూనే గ్రామీణ ప్రాంతాలలోని బ్యాంకులు దివాళా తీసిన పేరుతో ఎత్తివేస్తున్నది. సహకార వ్యవస్థ కుదింపుకు రాష్ట్రాలకు సలహాలిస్తున్నది. ప్రైవేటు రంగానికి అవకాశం కల్పించే విద్యుత్ చట్టం -2003 తెచ్చింది. విత్తనాలకు, క్రిమిసంహారక మందుల తయారీని బహుళజాతి సంస్థలకు అవకాశాలు కల్పించింది. ఇప్పటికే రాష్ట్రంలో ఏటా నాణ్యతలేని విత్తనాలతో లక్షలాది ఎకరాల పంటలు దెబ్బ తింటున్నాయి. విత్తన చట్టం - 2004 ను ప్రైవేటు వ్యాపారులకు అనుకూలంగా రూపొందించింది.

పై విధానాలు వ్యవసాయ సంక్షోభాన్ని పెంచుతాయే తప్ప తగ్గించవన్నది వ్యవసాయ పరిజ్ఞానం తెలిసిన వారందరు గుర్తిస్తారు. లక్ష్యాలు ఘనంగా చెప్పి, ఆచరణలను అల్పంగా చూపడమంటే ఇదేనేమో! లక్ష్యాలకు తగిన విధంగా విధాన రూపకల్పన, నిధుల కేటాయింపు చేయలేరా! చేసే అవకాశాలు పుష్కలంగా ఉన్నాయి. కాని గత ప్రభుత్వాలు అనుసరించిన విధానాలే నేటి ప్రభుత్వాలు అమలు చేస్తున్నాయి

ప్రపంచబ్యాంకు ఒత్తిడి ప్రభుత్వాలపై స్పష్టంగా కనపడుతున్నది. కేంద్ర మంత్రి కమలనాధన్ గారు " పేటెంట్ చట్టం చేయకపోతే అంతర్జాతీయ సమాజంలో తలవంపులు వస్తాయని" అన్నారంటే ప్రపంచ బ్యాంకు, డబ్ల్యు.టి.ఓ. సంస్థల ఒత్తిడి ఏమేరకుందో అర్ధమవుతున్నది. దేశ ప్రయోజనాలు, వ్యవసాయ రంగ ప్రయోజనాలు ఫణంగా పెట్టి బహుళజాతి సంస్థలకు లాభాలు కట్టబెడ్తారా? ఈ విధానాలు ప్రభుత్వాలు ప్రకటించిన వ్యవసాయ సంక్షేమ లక్ష్యాలు నేరవేరుస్తాయా? రైతులు, ప్రజలు చైతన్యవంతులై అప్రమత్తంగా ఉండి పోరాటాలలోకి వస్తేతప్ప ఈ వ్యవసాయ వ్యతిరేక విధానాల నుండి పాలకులు తిరోగమించరనేది చరిత్ర చెబుతున్న సత్యం. అంతేగాని సంక్షేమ లక్ష్యాలు ప్రకటించడంతోటే సంతృప్తి పడ్డే రైతుల గతి అధోగతేనన్నది గుర్తించాలి. ☆

# రైతువాణి

ఏప్రిల్ 05

సంపుటి : 16 సంచిక : 4

వెల : 6 రూపాయలు

పేజీలు : 52

సంవత్సర చందా : రు. 60

## సంపాదకవర్గం


బి. తులసీదాస్ (సంపాదకులు)

జె.బాబూరావు (సహ సంపాదకులు)

ఎస్.మల్లారెడ్డి

డా. అరిబండి ప్రసాదరావు


## చిరునామా


ఎడిటర్, **మన రైతువాణి**

1-1-9/10/1, జవహర్‌నగర్

ఆర్.టి.సి. క్రాస్ రోడ్స్, హైదరాబాద్-20

ఫోన్ : 27646580, 27605413

ఇ-మెయిల్ :

hyd2_rytuvani@sancharnet.in


గమనిక : చెక్కులు, డి.డి.లు **మన రైతువాణి** పేరుతో మాత్రమే పంపాలి

## ఈ మాసం కార్టూన్



## విషయ సూచిక

# భూసార పరీక్షలో మట్టినమూనాలను ఎలా సేకరించాలి?



 డా. ఎస్ మురళీధర్

మనుషులు, జంతువులు మాదిరిగానే మొక్కలకు కూడా ఆహారం అవసరం. మొక్కల పెరుగుదలకు 16 రకాల పోషక పదార్థాలు కావాలి. ఏ పోషక పదార్థము కూడా మరో పోషక పదార్థ లోపాన్ని సరిచెయ్యలేదు.

**భూసార పరీక్ష ఆవశ్యకత**

ఎరువులు వాడితే బాగా పంటలు పండుతాయని రైతులకు తెలుసు. వాటి వాడకానికి కూడా రైతులు అలవాటు పడ్డారు. అయితే ఎరువులను అవసరమైన దానికన్నా కొందరు ఎక్కువగాను, మరికొందరు తక్కువగాను వాడుతున్నారు. మోతాదుకు మించి ఎరువులు ఎక్కువ వాడితే పెట్టుబడి ఎక్కువై ఆదాయం తగ్గుతుంది. ఖర్చు పెరుగుతుంది. అందువల్ల ఏ ఎరువు ఎంత వేయాలి అనేది భూసార పరీక్ష చేసినట్లయితే ఖచ్చితంగా తెలుస్తుంది.

ఎరువుల మీద పెట్టిన పెట్టుబడి సద్వినియోగం కావడానికి అవసరమైన ఎరువుల వాడకం తగ్గించడానికి భూసార పరీక్ష ఒక మంచి సాధనం. ప్రతి ఎకరంలోను, రెండు మిలియన్ పౌండ్ల మట్టి నుండి కేవలం కొన్ని గ్రాముల మట్టి మాత్రమే రసాయన విశ్లేషణకు ఉపయోగించబడుతుంది. కానీ మట్టి యొక్క గుణాలు చేను మొత్తంలో ఒకే విధంగా వుండక, ఎన్నో తేడాలు వుంటాయి. అందువలన సరైన మట్టి నమూనా సేకరించకపోతే భూసార పరీక్షా కేంద్రాల ద్వారా సూచించబడే ఎరువుల మోతాదులు సరైన పాళ్లలో వుండక, రాబడి లేకుండా ఎరువుల మీద దుబారా ఖర్చు పెట్టవలసి వస్తుంది. అందుకే వేసే ఎరువుల సద్వినియోగానికి సరైన మట్టి నమూనా సేకరణ అత్యవసరం. మట్టి నమూనా సరిగా లేకపోతే భూసార పరీక్ష నిష్ప్రయోజనం.

**నమూనాలు ఎపుడు తీయాలి?**

నమూనాలు సేకరించాల్సిన పొలం విస్తీర్ణాన్ని బట్టి భాగాలుగా విడగొట్టాలి. నేల రంగు మార్పును బట్టి, రకాన్ని బట్టి, మెరకపల్లాలను బట్టి నమూనాలు తీయాల్సి వుంటుంది. మార్పులు లేకుండా పొలమంతా ఒకే విధంగా వున్నట్లయితే రెండు హెక్టార్లకు ఒక నమూనా తీసుకుంటే సరిపోతుంది.

చేలో పైరు లేకుండా వుండే వేసవి కాలంలో నమూనాలు తీయడం మంచిది. నమూనాలు చేను దున్నిన తర్వాత, ఎరువు వేయక ముందు తీయాలి. మాగాణి భూములలో నీరు పెట్టక ముందే తీయాలి. చవిటి నేలల్లో లవణాలు ఎక్కువగా వుండే సమయంలో అంటే నేల బాగా ఆరి, ఎండిపోయిన తరువాత తీసుకోవాలి.

ఒక మట్టి నమూనా తీయదలచుకున్న పొలంలో ( ప్రతి భాగం నుండి) 8 నుండి 10 చోట్ల మట్టిని సేకరించాలి.

**ఎక్కడనుండి తీయాలి?**

ఎంత నేలనుండి ఒక నమూనా తీయాలి అనేది క్రింది అంశాల మీద ఆధారపడి వుంటుంది.

1. పొలం యొక్క పరిమాణం
2. మట్టి యొక్క రంగు,రకం
3. ప్రాంతీయ నైసర్గిక తేడాలు
4. మురుగు పారుదల
5. వ్యవసాయపు అలవాట్లు

6. పంటల సరళి

ఐదు ఎకరాలకు మించకుండా వుండి అందులో ఏ ప్రాంతంలో నైనా పైన ఉదహరించిన విషయాల్లో తేడా లేకుండా వుంటే ఒక ప్రాతినిధ్యం వహించే మట్టి నమూనా తీయడానికి పరిమాణంగా తీసుకోవచ్చు.

**మట్టి నమూనా తీసే విధానం**

నమూనా తీయదలచిన చోట నేలపై వుండే ఆకు అలములు తీసి వేయాలి. పారతో నేలపై నుండి నాగటి చాలు లోతున ఒకే విధమైన నమూనాను తీయాలి. వి(V) ఆకారంలో 15 నుండి 24 సెంటీమీటర్ల లోతున పారలేదా తాపీతో గాని తవ్వాలి. ఆ గుంతలో నుండి 2.5 సెంటీమీటర్ల మందాన పై నుండి అడుగు దాకా సమానంగా ఒక వైపు నుండి మట్టి తీసి శుభ్రమైన బక్కెట్‌లో వేయాలి. అదే విధంగా 10 లేదా 12 చోట్ల నుండి మట్టి తీసి అదే బక్కెట్‌లో వేయాలి.


సేకరించే పద్ధతి

**నమూనాను తయారు చేయడం**

నమూనా కోసం తీసిన మట్టి తడిగా వున్నపుడు దానిని నీడలో ఆరబెట్టి, తరువాత పెద్దలను నలగగొట్టి మట్టిని బాగా కలపాలి. పొలంలో సేకరించిన మట్టిని ఒక శుభ్రమైన గోనె సంచిమీద గాని, గుడ్డమీద గాని వేయాలి. మొత్తం మట్టిని బాగా కలిపి 1,2,3,4 అను భాగాలుగా చేసి, 2 మరియు 3 భాగాలను తీసుకొని మరల బాగా కలపాలి. ఇలా 2,3 భాగాలలో తీసుకున్న మట్టిని 5,6,7,8 అను నాలుగా భాగాలుగా చేసి ఈ సారి 5,8 భాగాలను తీసుకోవాలి. ఇదే పద్ధతిని ఇంకొకసారి చేసి చివరకు సుమారు అరకిలో మట్టిని నమూనాగా తీసుకోవాలి.

మట్టి నమూనాలను సేకరించడం

**నమూనాలను సంచులలో కట్టుట**

నమూనాలు శుభ్రమైన చిన్న గుడ్డ సంచులలో గానీ, ప్లాస్టిక్ సంచులలో గానీ వుంచాలి. పాత ఎరువు సంచులు ఎపుడు వాడరాదు. సంచులలో బైట, లోపల కూడా గుర్తుగా వివరాలు వుంచాలి. ఆ కాగితంలోనే వివరాలు నింపుటకు పెన్సిల్ వాడాలి. తరువాత నమూనాను సమీప భూసార పరీక్షా కేంద్రానికి స్వయంగా గానీ, పోస్టు ద్వారా గానీ నమూనాతో సహా ఈ క్రింది సమాచారాన్ని పంపాలి.

1. రైతుపేరు, చిరునామా
2. పొలం విస్తీర్ణం, సర్వే నంబరు
3. నమూనా తీసిన తేదీ
4. మెట్ట లేదా మాగాణి
5. నేల ( ఇసుక/గరప/ రేగడి/ చవుడు)
6. నీటి వసతి ఏది? ( బావి, చెరువు, ప్రాజెక్టు, కాలువ) 7. వర్షాధారమా / నీటిపారుదలా
8. నేల చదునుగా లేదా ఏటవాలుగా లేదా ఎగుడుదిగుడుగా వున్నదా?
9. గత రెండు సంవత్సరాలు వేసిన పైర్ల వివరాలు, పంట, రకం, దిగుబడి.
10. గత రెండు సంవత్సరాలలో ప్రతి పైరుకు వేసిన ఎరువుల వివరాలు
11. ఏమైనా వున్న ప్రత్యేక సమస్యలు
12. ఎరువు సూచన కావాల్సిన పంట
13. ఎంత దిగుబడి కావాలనుకుంటున్నారు?


వివిధ చోట్ల సేకరించిన మట్టిని కలిపి కవర్‌లో వేస్తున్న అధికారి

**జాగ్రత్తలు**

☆ సేకరణకు ఉపయోగించే పరికరాలు పరిశుభ్రంగా వుంచాలి.

☆ నమూనా తీయదలచిన పొలంలో సారం మరీ ఎక్కువగాను, మరీ తక్కువగాను వున్న చోట్ల మట్టిని తీయరాదు.

☆ మంచిపొలంలో మట్టిని, చౌడు పొలంలో తీసిన మట్టితో కలుపరాదు.

☆ చెట్ల క్రింద, గట్ల ప్రక్కన, కంచెల దగ్గర, కంపోస్టు, పశువుల ఎరువు నిలువ వుంచిన చోట్ల నుండి నమూనాలు తీయకూడదు.

☆ నీరు నిలిచి బురదగా వున్న నేలల నుండి మట్టి నమూనాలు తీయకూడదు. బురద నేలలో సేకరించాల్సి వస్తే మట్టిని నీడలో ఆరబెట్టాలి. ఎండలో ఆరబెట్ట కూడదు.

☆ పేడ మొదలగు ఎరువులు వేసిన చోట నమూనా సేకరించరాదు. రసాయన ఎరువులు వేసిన నెల రోజుల వరకు నమూనాలు తీయకూడదు.

## ఈ మాసం వ్యవసాయ పనులు

**శతభిషా కార్తె, పూర్వాభాద్ర కార్తె**

**వరి :** రెండవ పంటకు ఎరువులు వేసుకోవాలి. సస్యరక్షణ చర్యలు చేపట్టాలి.

**మినుము :** వరి మాగాణుల్లో వేసిన మినుము కోతలు కోసుకోవాలి. మాగాణిలో విత్తిన పెసర, మినుము పంటకు వస్తాయి.

**వేరుశనగ :** వేసవి పంటకు సస్యరక్షణ చర్యలు చేపట్టాలి. తెలంగాణా జిల్లాల్లో విత్తిన పంటకు ఎరువులు వేసుకోవాలి.

**ఆముదం :** తెలంగాణా జిల్లాల్లో విత్తిన పంటకు అంతరకృషి చేయాలి. సస్యరక్షణ చర్యలు చేపట్టాలి.

**మిరప :** మిరప కాయలు ఏరుకోవాలి. మార్కెట్‌కు పంపుకోవడానికి సిద్ధం అవ్వాలి.

**పసుపు :** జూలైలో నాటిన పసుపు త్రవ్వాలి.

**చెరకు :** జనవరిలో నాటిన పైరుకు ఎరువులు వేసుకోవాలి. సస్యరక్షణ చర్యలు తీసుకోవాలి.

**పొగాకు :** ఆకు కోయాలి. క్యూరింగ్ చేయాలి.

**ఆకుకూరలు :** పాల, తోట, చుక్క కూరలు విత్తుకోవాలి.

**పండ్లు :** ద్రాక్షగుత్తులు కోసుకోవాలి. మామిడి కూడా కోతకు వచ్చే దశ వస్తుంది.

# మామిడి కాయతీత, నిల్వ, రవాణాలో తీసుకోవలసిన జాగ్రత్తలు

మామిడి పూత కాలం నుండి కాయలు పక్వానికి వచ్చి కోతకు వచ్చేంత వరకు తీసుకునే జాగ్రత్తలు ఒక వంతు అయితే ఆ తరువాత కాయలు కోయడం, మండీలకు తరలించడం, దూరప్రాంతాలకు రవాణా చేయడం మరో వంతు. ఈ పనిలో చాలా జాగ్రత్తలు తీసుకోవాలి. అశ్రద్ధ వహిస్తే చాలా నష్టం వస్తుంది.

మామిడి కాయలు రైతు తోటనుండి వినియోగదారునికి చేరే లోపల అనేక చేతులు మారడం వల్ల దాదాపు 40 శాతం కాయలు చెడిపోతాయి. చాలా ప్రాంతాలలో కాయలు కోసే బదులు కొమ్మలను విదిలించి రాల్చడం జరుగుతోంది. రాలకుండా వుండిపోయిన కాయలను పొడవాటి వెదురుకర్రతో బాది రాలుస్తున్నారు. ఇంకొన్ని చోట్ల చెట్లపైకి ఎక్కి కోసి క్రిందకు వడేస్తారు. దీంతో కాయలకు దెబ్బలు తగులుతాయి. అలాగే కాయలను ప్యాకింగ్ సరిగా చేయనపుడు కూడా కమిలిపోయి పాడయి పోతున్నాయి.

పక్వానికి వచ్చిన కాయలను ఉదయం పూట చల్లగా ఉన్నపుడు కోయాలి. ఎగుమతికి నిర్దేశించిన కాయలైతే 70-80 శాతం పక్వదశలో ఉన్నపుడు కోయాల్సి ఉంటుంది. వర్షం పడిన వెంటనే కాయలు కోయకూడదు. సాధ్యమైనంత వరకు చేతులతో లేదా ప్రత్యేకమైనటువంటి పరికరాలతో కాయలను కోసి, కాయలపై ఎటువంటి రాపిడి మచ్చ లేకుండా జాగ్రత్తపడాలి. చెట్లపై బాగా ఎత్తులో నున్న కాయలను కోసేటపుడు, వాటిని ఏదేని సంచిలో నింపి నెమ్మదిగా చెట్లపై నుండి క్రిందికి దింపాలి. కానీ, నేరుగా పై నుండి క్రిందకు వేయరాదు. విసరరాదు.

**మేలైన పద్ధతులు**

మామిడి కాయలను మార్కెట్‌కు పంపినా, ఫ్యాక్టరీలకు పంపినా విదేశాలకు ఎగుమతి చేసినా కోత కోసేటపుడు చాలా జాగ్రత్తలు తీసుకోవాలి. కాయలకు మంచి ధర రావాలంటే మామిడి కాయల కోతలో తప్పనిసరిగా శ్రద్ధ వహించాలి.

మామిడి కాయలను ఖచ్చితంగా చిక్కాల ద్వారా కోయాలి. చిన్న చెట్లయితే చేతితో కూడా కోసుకోవచ్చు. మండీలకు పంపే కాయలు మన దగ్గర వున్న చిక్కాలతో కోసి దెబ్బ తగలకుండా క్రిందికి దించుకోవాలి. ఎత్తయిన చెట్లపై వున్న వున్న కాయలను ఒక మనిషి చెట్లపైకి ఎక్కి, చిక్కంతో కోసి ఆ కాయలను ఒక్కొక్కటిగా క్రిందికి జారవిడిస్తే క్రింద మరొకరు గోతం పట్టా చేతిలో వుంచుకొని కాయ క్రింద పడేటపుడు గోతం అడ్డం పెట్టడంతో కాయ గోతం మీద పడి మెల్లగా, మెత్తగా నేల మీద పడుతుంది. లేదా గోతం సంచులలో వరిగడ్డిని నింపి చెట్టు క్రిందభాగంలో బెడ్డు మాదిరిగా చేసినట్లయితే క్రిందికి రాలిన కాయలకు దెబ్బలు తగలకుండా వుంటుంది.


(చిక్కంతో కాయల కోత)

కాయలను తొలుత కనీసం 6 సెం.మీ. పొడవున్న తొడిమలతో కోసి, గ్రేడింగ్ చేయాలి. వచ్చికాయలు, తెగులు సోకిన కాయలు - ఆకృతి సరిలేని కాయలు ఏరి వేరు చేయాలి. ఎంపిక చేసిన కాయలను ప్లాస్టిక్ ట్రేలలో నింపుకుని, చల్లని వేళల్లో ప్యాకింగ్ కేంద్రాలకు రవాణా చేయాలి. ట్రేలలో కాయలను పేర్చినపుడు, మూడు వరుసలు మించకుండా చూడాలి. వరుసల మధ్య మెత్తటి కాగితాలను (పేపరు (ష్రెడ్స్) లేదా ఆరోగ్యవంతమైన తాజా ఆకులను కానీ వేసినట్లయితే, రవాణాలో కాయలు దెబ్బతినవు.

డీసాపింగ్ (కాయనుండి సొన తీయడం) చేసే ముందు తొడిమలను 1/2-1 సెం.మీ. పొడవుంచి, కత్తిరించాలి. వెదురుతో చేయబడిన జల్లెడ మంచాలపై కాయలను తలక్రిందులుగా పేర్చి 2-3 గంటల సేపుంచినట్లయితే 'డీసాపింగ్' పూర్తవుతుంది. మామిడి సొన కాయల మీద పడితే మచ్చలు ఏర్పడి నాణ్యత దెబ్బతింటుంది. తరువాత కాయలను దశల వారీగా శుభ్రపరచాలి.

తొలుత కాయలను 100 పి.పి.యం. క్లోరిన్ ద్రావణంలో ముంచి, తీసినట్లయితే కాయపై ఉన్న దుమ్ము, ధూళి, వ్యాధి కారక శిలీంద్రాల వంటివి తొలగించబడతాయి. తరువాత 2.5 గ్రా. బెనోమిల్ మరియు 10 గ్రా. డిటర్జెంట్ పొడరు (సర్ఫ్ వంటిది) 10 లీటర్ల నీటిలో కలిపి తయారు చేసిన ద్రావణంలో 3-5 నిముషాల పాటు కాయలను ముంచి తీయాలి. రబ్బరు గ్లోవ్స్ తొడుక్కుని, మెత్తని బట్టతో (మస్లిన్ క్లాత్) కాయలను మృదువుగా రుద్దినట్లయితే కాయలపై నున్న సొన, ధూళి వంటివి తొలగించబడి, కాయలు శుభ్రపడతాయి. పది లీటర్ల ద్రావణాన్ని ఒక క్వింటాలు కాయలు కడగడానికువయోగించవచ్చును.

అవసరాన్ని బట్టి కాయలను మరోసారి 1000 పి.పి.యం., క్లోరిన్ ద్రావణంలో 5 ని॥ల పాటు ముంచితీయాలి. తరువాత 60 గ్రా. బెనోమిల్ పొడిని (ముందు 145 మి.లీ. ఎసిటోన్‌లో కరిగించాలి) 10 లీటర్ల నీటిలో కలిపి తయారు చేసిన ద్రావణంలో కాయలను 5 ని॥ ఉంచాలి. నీటికి ట్వీన్-18, టీపాల్ వంటి వెట్టింగ్ ఏజెంట్స్ (0.1%) కలిపి నట్లయితే మరింత ఫలితముంటుంది. ఈ దశలో కాయలను రుద్దడం వంటివి చేయకూడదు. ఫాస్ఫారిక్ ఆమ్లం ఉపయోగించి ఈ ద్రావణం యొక్క ఉదజని సూచిక 4.5 ఉండేటట్లుగా చూసుకోవాలి. తరువాత కాయలను నీడలో ఆరబెట్టి, మెత్తటి బట్టతో మృదువుగా తుడవాలి. ఈ దశలో మరొక సారి గ్రేడింగ్ చేయాలి. ఏ దశలోనూ కాయలను శుభ్రపరచడాని

కుపయోగించే నీటి ఉష్ణోగ్రత $27^0$ సెంటీ గ్రేడును మించి ఉండకూడదు. ఉష్ణోగ్రత



గ్రేడింగ్ చేయడం

సూచికలు సాధారణంగా ప్యాకింగ్ కేంద్రాలలో ఉంటాయి.

మైనపు ద్రావణంలో ముంచిన గుడ్డను పల్చటి మైనపు పొర ఏర్పడేటట్లుగా కాయలపై అద్దాలి. తరువాత పొడిబట్టతో కాయులపై నున్న అదనపు మైనాన్ని తుడిచేయాలి. ఆహారంగా ఉండదగిన ఈ మైనాన్ని అమెరికా లేదా యూరోపియన్ దేశాల నుండి దిగుమతి చేసుకోవాలి.

తరువాత కాయలను 4 కిలోల కార్టన్స్ (సిఎఫ్‌బి బాక్స్)లో పేర్చాలి. ఈ కార్టన్స్ వివిధ సైజుల్లో దొరుకుతాయి. ఎగుమతికి నిర్దేశించిన రకాన్ని బట్టి బాక్సును ఎంపిక చేసుకోవాలి. ఉదాహరణకు బంగినపల్లికి 390×260×115 మి.మీ. కార్టన్స్, అల్ఫాన్సో రకానికైతే 320×230×90 మి. మీ. కార్టన్స్‌ను వాడుతారు. ఈ కార్టన్స్ నాలుగు వైపుల రంధ్రాలను కల్గి ఉండాలి. కాయలను ప్యాకింగ్ బాక్సుల్లో పేర్చేటపుడు తొడిమ క్రిందికి ఉండునట్లుగా, చూసుకొని, కాయలను కొద్దిగా ఏటవాలుగా అమర్చాలి.

ప్యాకింగ్ చేసి, లేబిలింగ్ చేసిన తరువాత కార్టన్స్‌ను ప్రీ కూలింగ్ గదుల్లో $13^0$ సెంటీ గ్రేడు ఉష్ణోగ్రత వద్ద ఉంచాలి. కంటైనర్ పై ఉండే లేబుల్‌పై కాయలు ఏ రకానికి చెందినవి, ప్యాకింగ్ జరిగిన తేదీ, ఎగుమతి చేస్తున్న వారి వివరాలు, ఎగుమతి చేయవలసిన దేశం వంటి వివరాలన్నీ పొందుపర్చాలి.

కంటైనర్‌లను ఓడల్లోకి లేదా విమానాల్లోకి ఎక్కించేపుడు ఉష్ణోగ్రత $15^0$ సెంటీగ్రేడు మించి ఉండరాదు. ఓడలో $12.5^0$ సి ఉష్ణోగ్రత ఉండాలి. ఓడలు / విమానాల్లో విధిగా కంట్రోల్డ్ స్టోరేజి సౌకర్యం ఉండాలి.

అంత్రక్నోస్ (పక్షి కన్ను తెగులు) వంటి తెగుళ్ళు ఉధృతంగా ఉన్న ప్రాంతాల నుండి కాయలను సేకరించినట్లయితే, కాయులను వేడి నీటితో శుద్ధి చేయాల్సి ఉంటుంది. కాయులను 40-45 డిగ్రీల వద్ద నున్న వేడినీళ్లలో 3-5 నిముషాల పాటు వుంచి తీయాలి. అవసరమనుకుంటే వేడినీళ్లలో ఏదేని శిలీంద్రనాశక మందులను (బెనోమిల్) కలపవచ్చును. పండ్ల నాశించే ఈగల నివారణలకు కాయలను ఆవిరితో శుద్ధి చేస్తారు. ఈ రకంగా శుద్ధి చేయబడిన కాయలను ఇతర దేశాలు కోరుకుంటున్నాయి.

అంతర్జాతీయ మార్కెట్‌లో బ్రిటన్, అమెరికా, కెనడా, జర్మనీ, హాలెండ్, ఫ్రాన్స్, చైనా, జపాన్ వంటి దేశాల్లో మామిడికి మంచి గిరాకీ వుంది. వివిధ దేశాలు రకరకాల రంగుల్లో వుండే పండ్లను ఇష్టపడుతున్నాయి. ఎగుమతిని విమానాల్లో చేయదలచినట్లయితే, కాయలను ముందే పండనివ్వాలి. కాయలు మగ్గడానికి 20-25 డిగ్రీల సెంటీగ్రేడ్ ఉష్ణోగ్రత అవసరం. కాయలన్నీ ఒకే విధంగా రంగు రావడానికి ఇథలీన్ గ్యాస్( 10-100 పిపియం, 24 గంటల సేపు) ను ఉపయోగించవచ్చు. అదే ఓడల్లో రవాణా చేసినట్లయితే, కనీసం 3-5 రోజులు పడుతుంది. కాబట్టి, కాయలను కోల్డ్‌స్టోరేజ్‌లో వుంచాలి. 13 డిగ్రీల సెంటీగ్రేడ్ ఉష్ణోగ్రత 90శాతం వద్ద కాయులను నిల్వ వుంచినట్లయితే, కాయులు నిదానంగా పండుతాయి. స్టోరేజి యూనిట్‌లో వేడి ఎట్టి పరిస్థితుల్లోను 9-10 డిగ్రీల సెంటీగ్రేడ్ కంటె తగ్గకూడదు. మరీ తక్కువ ఉష్ణోగ్రత వద్ద అతిశీతలీకరణం వల్ల కాయల్లో కణజాలం దెబ్బతింటుంది.

ఎగుమతి ప్రమాణాలు

☆ ఎంపిక చేసిన రకాన్ని బట్టి కాయలు నిర్దేశించబడిన పరిమాణంలో వుండాలి. ఉదాహరణకు బంగినపల్లి 350 గ్రాములు, అల్ఫాన్సో 250 గ్రాములు, దశేరి/ చౌనా వంటి రకాలు 300గ్రాములు బరువు కల్గి వుండాలి.

☆ కాయలు పక్వానికి వచ్చి, కండగలిగి, గట్టిగా వుండడమే కాకుండా తాజాగా కూడా వుండాలి.

☆ కాయలపై ఎటువంటి మచ్చలు కానీ, సొన కారిన చారికలు కానీ వుండకూడదు. అలాగే కోత, రవాణా సమయాల్లో ఎటువంటి రాపిడి ఏర్పడకుండా జాగ్రత్త పడాలి.

☆ కాయలపై అధికమైన తేమ వుండకూడదు.

☆ కాయలను ఎటువంటి చీడపీడలు ఆశించి వుండకూడదు.

☆ కాయలు / పండ్లు ఎంపిక చేసిన రకానికి నిర్దేశింపబడినటువంటి రంగు, రుచి, మంచి వాసన కలిగి వుండాలి.

☆ పండ్లలో 10 శాతం చక్కెర వుండాలి.

నాణ్యతను బట్టి ఎగుమతికి నిర్దేశించిన కాయలను ఎక్స్‌ట్రాక్లాస్, క్లాస్-1, క్లాస్-2 అనే మూడు కేటగిరీలుగా విభజిస్తారు.

**ఎగుమతికి అనువైన ఉత్పత్తులు**

తాజా మామిడి పండ్లతో పాటు వివిధ రకాలైన మామిడి ఉత్పత్తులకు కూడా



గ్రేడింగ్ తర్వాత అట్టపెట్టలలో ప్యాకింగ్

ఎగుమతి అవకాశాలు వున్నాయి. మామిడి గుజ్జు వీటిలో ప్రధానమైనది. దీంతో జామ్స్, స్క్వాష్, రసాలు మరియు తాండ్ర వంటివి తయారు చేయవచ్చు. పచ్చి కాయలను పచ్చిళ్ల తయారీకి ఒరుగులు, మామిడి పొడి తయారీకి వాడతారు.

**ఎగుమతి ఇబ్బందులు**

మామిడి పండ్లను విదేశాలకు ఎగుమతి చేయడంలో ఆర్థిక, సాంకేతిక మరియు మార్కెటింగ్ పరమైన ఇబ్బందులు ఎన్నో వున్నాయి. ప్యాకింగ్, రవాణా, మార్కెటింగ్‌లకు ఎక్కువ పెట్టుబడి అవసరం. పండ్లు త్వరగా చెడిపోయే అవకాశమున్నందున బ్యాంకులు, ఆర్థిక సహాయాన్ని అందించే సంస్థలు రుణాలు మంజూరు చేయడానికి వెనకడుగు వేస్తున్నాయి.

**సాంకేతిక ఇబ్బందులు**

ఎగుమతుల దృష్ట్యా తోటలు సాగు చేయబడటం లేదు. ప్రస్తుతమున్న తోటల

**(తరువాయి వ పేజీలో)**

# మామిడి కాయలను కోసే పనిముట్లు




పొడవుగల వల వుంటుంది. మామిడి కొమ్మయందు చివరి భాగమున వుండే మామిడి కాయలను కోయుటకు ఇది ఉపయోగ పడుతుంది. మామిడి కాయలు మామూలుగా కొక్కితో కోయడం వలన అవి కింద పడి దెబ్బలు తగలడం వలన వాటి యొక్క నాణ్యత దెబ్బతింటుంది. ఈ పరికరముతో కోయడం వలన మామిడి కాయలకు దెబ్బ తగలకుండా వలలో పడతాయి. దీని ధర 150 రూపాయలు వుంటుంది.

**ట్రాక్టర్ లిఫ్ట్‌తో కాయలను కోయడం**

ఈ యంత్రాన్ని తమిళనాడు వ్యవసాయ విశ్వవిద్యాలయం, కోయంబత్తూరు వారు రూపొందించారు. ఇందులో ఒక లిఫ్ట్(పైకి వెళ్లడానికి) వుంటుంది. ఈ లిఫ్ట్ ట్రాక్టరుకు వుండే 3-పాయింట్ లింకేజి మరియు హైడ్రాలిక్ సిస్టంతో నడుస్తుంది. దీనిని ఉపయోగించి దాదాపు 7-8 మీటర్లు ఎత్తులో వుండే కాయలను కోయవచ్చును. ఈ విడి భాగం ధర దాదాపు 20 వేల రూపాయలు వుంటుంది. లిఫ్ట్ సహాయంతో కాయలను కోయడం వలన వాటికి దెబ్బ తగలకుండా వుండటమే కాకుండా ఎక్కువ కాయలను తక్కువ సమయంలో కోయవచ్చును

**డపోలి హార్వెస్టర్**

ఇందులో ఒక పొడవాటి కట్టెకి కొక్కిని (చిలుకదోటి) బిగిస్తారు. కొక్కి క్రింద భాగమున ఒక అడుగు వ్యాసం 1.5 అడుగు

**చిక్కం**

మనం ఉపయోగిస్తున్న చిక్కంతో తొడిమతో కోయడానికి వీలుండదు. అందువలన తప్పనిసరిగా తొడిమ తెగినపుడు జీడిసొన కాయపై కారి మాగినపుడు నల్లటి మచ్చ ఏర్పడుతుంది. దీన్ని అధిగమించడానికి మహారాష్ట్రలోని దాపోలి లోని కృషి విద్యాపీఠం వారు డాపోలి చిక్కం ద్వారా ఈ సమస్యలను అధిగమించవచ్చని తెలిపారు. ఈ చిక్కానికి కొసన రంపపు పళ్లతో వున్న చిన్న చక్రం అమర్చి వుంటుంది. దీంతో కాయకు ఎటువంటి దెబ్బ తగలకుండా కోయడానికి ఈ చక్రం ఉపయోగపడుతుంది.

ఇండియన్ అగ్రికల్చర్ రీసెర్చి ఇనిస్టిట్యూట్(ఐఎఆర్ఐ) న్యూఢిల్లీ వారు రూపొందించిన పూసా చిక్కంతో ఎత్తులో వున్న కాయలను దెబ్బ తగలకుండా కోయడానికి



వీలు కలుగుతుంది. ఎత్తుకు తగినట్లు దోటిని అడ్జస్టు చేసుకోవచ్చు. దీనిలో చిక్కం బరువుగా వుండంతో ఎక్కువ ఆదరణ పొందలేదు. ☆

# వేసవిలో కోళ్లకు రక్షణ

ప్రతీ ఏడాది వచ్చే సాధారణ సమయం కన్నా ముందుగానే ఈ ఏడాది వేసవి అడుగుపెడుతోంది. ఫిబ్రవరి నెలలోనే ఎండలు తీవ్రరూపం దాల్చాయి. ఉష్ణోగ్రతలు పెరిగినప్పుడు కోళ్ళలో మరణాలు సంభవించే అవకాశం ఉంది. ఉష్ణోగ్రతలు క్రమంగా పెరిగినప్పుడు ఏర్పడే ఇబ్బందుల కన్నా ఒక్కసారిగా మూడు నుంచి అయిదు డిగ్రీల స్థాయిలో పెరిగినపుడు కోళ్ళు తీవ్రమైన ఒత్తిడికి లోనవుతాయి. స్వేదగంధులు లేని కారణంగా కోళ్ళు తేలిగ్గా వడదెబ్బకు లోనవుతాయి. వడదెబ్బ నివారణకు కొన్ని సూచనలు పాటించాలి.

1. కోళ్ళకు పగటి పూట దాణా ఇవ్వకూడదు. కనీసం ఉదయం పది గంటల నుంచి సాయంత్రం నాలుగు గంటల వరకు దాణా గిన్నెలు ఖాళీగా ఉంచాలి. ఉదయం మూడు గంటలకే దాణా ఇవ్వాలి.
2. మధ్యాహ్నం పన్నెండు గంటల తర్వాత చల్లని నీళ్ళు అందుబాటులో ఉంచాలి. నీళ్ళ గిన్నె లేనట్లయితే రెండు గంటలకొకసారి నీరు మార్చుతూ ఉండాలి. నిపుల్స్ పద్ధతి అయినట్లయితే తరచు ఫ్లష్ చేయాలి. నీటిని వేడెక్కనీయకూడదు.
3. ఉష్ణోగ్రత తీవ్రతను బట్టి ఫాగర్లను వాడుకోవాలి.
4. టన్ను దాణాలో క్రమం తప్పకుండా 2-3 కిలోలు సోడియం బై కార్బనేట్ కలిపి వాడుకోవడం వల్ల మంచి ఫలితం ఉంటుంది.
5. దాణాలో ఫైబర్ 5%మించి ఇవ్వకూడదు.
6. కోళ్ళలో లూజ్ డ్రాపింగ్ సమస్య తలెత్తకుండా చూసుకోవాలి.
7. నీటిలో సానిటైజర్‌ను వాడుకోవాలి. ఫాగర్లలో వాడే నీటిని కూడా సానిటైజర్ కలిపి వాడుకోవడం మంచిది.
8. దాణాలో విటమిన్ సిని కూడా వేసవిలో ఇవ్వడం మంచిది.
9. కోళ్ళలో కాల్షియం లోపం లేకుండా చూసుకోవాలి. అటువంటి కోళ్ళలో ఇబ్బందికర శ్వాస వల్ల వడదెబ్బ తీవ్రంగా ఉండవచ్చు.
10. కోళ్ళకు పూర్తిస్థాయి గాలి తగిలేటట్లు చూసుకోవాలి.
11. కొన్ని సార్లుషెడ్ల కింద పేరుకుపోయిన లిట్టరు గాలి ప్రసరణకు అడ్డంకి కావచ్చు. దీనివలన మధ్య లైన్లలోని కోళ్లు వడదెబ్బకు గురి అయ్యే అవకాశం ఉంది.
12. కోళ్ళు వడదెబ్బకు గురవుతున్నాయనుకుంటున్నప్పుడు మధ్యాహ్నం నీటిలో కాని, దాణాలో కాని ఎలక్ట్రోలైట్‌లు ఇవ్వాలి.
13. వడదెబ్బకు గురైన కోళ్ళను తీసి తలకిందులుగా పట్టుకుని నీటిలో ముంచి తీయడం ద్వారా కాపాడుకోవచ్చు. ☆

# మంచినీటి చేపలు - నీటి నాణ్యతా లోపాలు


నీటినాణ్యతా లోపం వల్ల మొప్పల క్షీణత

రాష్ట్రంలో ఇటీవల కాలంలో మంచినీటి చేపల ఉత్పత్తి గణనీయంగా పెరిగింది. ఈ చేపల పెంపకం లాభదాయకంగా వుండాలంటే చేపలకు వచ్చే వ్యాధులను సకాలంలో గుర్తించి, చికిత్స చేయించడం, చెరువులలో నీటి నాణ్యతా లోపాలను సరిచేసినట్లయితే మంచి దిగుబడులు పొందవచ్చును. ప్రస్తుతం నీటి నాణ్యతా లోపాలను గురించి తెలుసుకుందాం.

**అమ్మోనియా హాని**

చెరువు నీటిలో రెండు రకాల అమ్మోనియా వుంటుంది. ఆయనీకరణం చెందిన అమ్మోనియా($NH_4^+$) మరియు ఆయనీకరణం చెందని అమ్మోనియా ($NH_3$) చేపలకు రెండవ రకం అమ్మోనియా($NH_3$) ఎక్కువ హానికరం. అమ్మోనియా సాంద్రత ఎక్కువగా వున్నపుడు మొప్పలపై అమ్మోనియా వత్తిడి పెరిగిపోయి మొప్ప కణజాలంలో మార్పులు ఏర్పడతాయి. ఇదే పరిస్థితి ఎక్కువ కాలం కొనసాగితే మొప్ప కణజాలం ధ్వంసమయి మొప్పలు క్షీణిస్తాయి. ఈ కండిషన్‌ను ' గిల్ నెక్రొసిస్ ' అంటారు. శరీరంలోని ఉపరితలం ప్రదేశాలలో రక్తప్రసరణ పెరిగి చేప ఎర్రబారుతుంది. చర్మం ఎక్కువ నీరు పీల్చుకొని ఉబ్బుతుంది. నీటి పి.ఎచ్ విలువ, ఉష్ణోగ్రత ఎక్కువగా వున్నపుడు, ఆక్సిజన్ లోటు ఏర్పడినపుడు కూడా అమ్మోనియా హాని తీవ్రత పెరుగుతుంది. అమ్మోనియా హాని సమస్య తీవ్రంగా వున్న చెరువులలో ఉదయం పూట కాకుండా, ఎండపెరిగే కొలదీ చేపంతా నీటి ఉపరితలం వద్దకు వచ్చి నోటితో గాలి పీల్చుతుంది. ఏదైనా చప్పుడు అయినపుడు ( పైగా పక్షులు ఎగరడం, పడవచప్పుడు మొదలగునవి) చేపంతా ఒక్కసారిగా ఉలికి పడుతుంది. సాయంత్రం అయ్యే సరికి చేపంతా నీటిలోనికి వెళ్లి చెరువు ప్రశాంతంగా వుంటుంది. చేపలు మేత తింటుంటాయి. కానీ పెరుగుదల తగ్గిపోతుంది. చేపల రక్తం, మూత్రపిండం, ప్లీహంల కణజాలంలో ప్రతికూల మార్పులు ఏర్పడి వాటి పనితీరు దిగజారుతుంది. మేతలో మాంసకృత్తులు(ప్రోటీన్) శాతం పెరిగే కొలదీ చేప శరీరంలో అమ్మోనియా ఎక్కువ ఉత్పత్తి అవుతుంది.


అమ్మోనియా హాని వల్ల పెదవులు వాచిన చేప

కాబట్టి అమ్మోనియ హాని తీవ్రత కూడా పెరుగుతుంది. చేపలు ఆరోగ్యవంతంగా పెరగడానికి నీటిలో అయినీకరణం చెందని అమ్మోనియా ($NH_3$) 0.05 పిపియం కంటె తక్కువ సాంద్రతలో వుండాలి.

**నైట్రేట్ హాని**

చెరువు నీటిలో నైట్రేట్ అధిక సాంద్రతలో పేరుకుంటే చేపలకు హానికరం. మొప్పల లోని క్లోరైడ్ కణాలు పీల్చడం ద్వారా నైట్రేట్ చేపరక్తంలోకి ప్రవేశిస్తుంది. రక్తంలోని హీమోగ్లోబిన్‌తో నైట్రేట్ చర్యనొంది మిథమోగ్లోబిన్‌గా మార్పు చేస్తుంది. మిథమోగ్లోబిన్ సాంద్రత పెరిగినపుడు రక్తం, మొప్పలు గోధుమరంగుకు లేదా చాక్లెట్-గోధుమ రంగుకు మారతాయి. అందుకే దీనిని ' బ్రౌన్‌బ్లడ్ డిసీజ్ ' అంటారు. సాధారణంగా మిథమోగ్లోబిన్ సాంద్రత, హీమోగ్లోబిన్ సాంద్రతలో 50 శాతానికి లోపే వుంటే చేప బ్రతికే వుంటుంది. కానీ ఇది దాదాపు 70-80 శాతానికి పెరిగినపుడు చేప నీరసపడి, కదలికలు మందగిస్తాయి. మిథమోగ్లోబిన్ సాంద్రత ఇంకా పెరిగినపుడు చేప సమతాస్థితి కోల్పోతుంది. బయటి ప్రేరణలకు స్పందన వుండదు. ఈ స్థితిలో చెరువు నీటిని తాజా నీటితో మార్పిడి చేసినా చేప క్రమేణా కోలుకునే అవకాశం వుంది. నీటిలో క్లోరైడ్ ఈ అయానుల సాంద్రత పెరిగే కొలదీ నైట్రైట్ హాని తగ్గుతుంది. చేపలు ఆరోగ్యవంతంగా పెరగడానికి నీటిలో నైట్రేట్ సాంద్రత ఒక పిపియం కంటె తక్కువ వుండాలి.

చికిత్స : అమ్మోనియా హాని తీవ్రత తగ్గించడానికి చికిత్స ఏమీ లేదు. యాజమాన్య పద్ధతులను మార్పు చేయడం ద్వారానే ఈ సమస్య పరిష్కరించడం లేదా నివారించడం చేయాలి.

నైట్రైట్ హానికి లోనయిన చేపలకు చికిత్స చేయడానికి నీటిలో క్లోరైడ్ అయానుల సాంద్రత పెంచాలి. ఇందుకోసం సాధారణ ఉప్పు ఎకరం నీటి విస్తీర్ణం, మీటరు లోతున్న చెరువులో 100 నుండి 150 కిలోల ద్రావణం వేసి చల్లాలి.

నివారణ :

☆ తాజానీటితో మార్పిడి చేస్తే అమ్మోనియా మరియు నైట్రేట్ సాంద్రత తగ్గిపోతుంది. ఫైటోప్లాంక్టాన్ సాంద్రత, పిహెచ్ కూడా తగ్గుతాయి. నీటిలో కరిగిన ప్రాణవాయువు సాంద్రత పెరుగుతుంది.

☆ మేతలో నూనెగింజల చెక్క పరిమాణం తగ్గించాలి. నాణ్యమైన మేత వాడాలి. అయితే

(తరువాయి వ పేజీలో)


నీటి నాణ్యతా లోపం వల్ల నలుపెక్కిన కళ్ల చేప

# రాష్ట్ర వ్యవసాయ రంగాన్ని వీడని కరువులు

 సారంపల్లి మల్లారెడ్డి, రాష్ట్ర కార్యదర్శి
ఆంధ్రప్రదేశ్ రైతు సంఘం

2004-05 సంవత్సరం రాష్ట్ర ప్రభుత్వం 795 మండలాలు కరువు మండలాలుగా ప్రకటించింది. దాదాపు 1100 కోట్ల పంటల దిగుబడి నష్టం వాటిల్లినట్లు ప్రభుత్వం సాధారణ అంచనా వేసింది. 11.25 లక్షల హెక్టార్లలో పంటలు దెబ్బ తిని, 14.37 లక్షల టన్నుల పంట దిగుబడి తగ్గినట్టు ప్రభుత్వం ప్రకటించింది. వాస్తవానికి ఈ అంచనా ఇంతకన్నా అనేక రెట్లు ఉంటుంది. సూక్ష్మ సర్వే చేసి రంగాల వారీ అంచనా వేసినచో వాస్తవ నష్టాన్ని గుర్తించవచ్చు. కాని ప్రభుత్వం తాత్కాలికంగా నష్టాన్ని ప్రకటించి, చేతులు దులుపుకుంటున్నది. గత ఆరు సంవత్సరాలుగా వరుస కరువులతో రాష్ట్ర వ్యవసాయ రంగం అతలాకుతలమవుతున్నది. అయినప్పటికి శాశ్వత పరిష్కారం వైపు ప్రభుత్వ విధానాలు కొనసాగడంలేదు.

కరువులు ప్రకటించడంలో రాజకీయత సంతరించు కుంటున్నది. ఆయా జిల్లాలలోని పాలక వర్గాలకు చెందిన వారు తమ ప్రాంతాలను కరువు ప్రాంతాలుగా గుర్తించడానికి ప్రభుత్వంపై వత్తిడి తెచ్చి, అందుకు అనుగుణంగా ప్రకటనలు చేయించు కుంటున్నారు. కాని ప్రకటనానంతరం చేయాల్సిన సహాయక చర్యలు, చేపట్టాల్సిన చర్యలు మాత్రం ఉపేక్షకు గురవుతున్నాయి. కరువు ప్రకటనకున్న నిబంధనలు అశాస్త్రీయంగా ఉన్నట్లు అనేక సందర్భాలలో నిపుణులు తమ అభిప్రాయాలను వెలిబుచ్చారు. అయినా ప్రభుత్వం శాస్త్రీయ విశ్లేషణవైపు దృష్టి సారించలేదు.

కరువు కాలం పోయేదెన్నడో!?..



**కరువు నిబంధనలు**

కరువును విశ్లేషించి నూతన నిబంధనలను రూపొందించడానికి 14-12-1993 న సీనియర్ ఐ.ఎ.ఎస్. అధికారి ఎ.వి. ఎస్. రెడ్డి కమిషన్‌ను ప్రభుత్వం నియమించింది. ఈ కమిషన్ 1997లో ఇచ్చిన నివేదికను శాసన సభ అమోదించింది. దాని ప్రకారం కరువు నిబంధనలలో మార్పులు జరిగాయి.

1) వర్షపు రోజులు సంవత్సరంలో 50 నుండి 75 ఉండగా, దానిని 45 నుండి 50 రోజులకు తగ్గింది.

2) రాష్ట్రాన్ని రెండు వర్షాధార ప్రాంతాలుగా గుర్తించారు.

(అ) 750 మిల్లీ మీటర్ల లోపు వర్షం పడే ప్రాంతాలు

(ఆ) 750 మిల్లీ మీటర్ల పైన వర్షం పడే ప్రాంతాలు

3) 2.5 మిల్లీ మీటర్ల వర్షాన్ని " ఒక వర్షపు రోజు" గా లెక్కించే గత నిబంధనకు 750 మిల్లీ మీటర్ల లోపు వర్షపు ప్రాంతానికి మాత్రమే వర్తింప చేసి, 750 మిల్లీ మీటర్లపైన వర్షం పడే ప్రాంతానికి 5 మిల్లీ మీటర్ల వర్షంను " ఒక వర్షపు రోజుగా " మార్చారు.

4. వర్షపు రోజుల మధ్య దూరాన్ని లెక్కగట్టి 21 రోజులు వర్షం పడకపోతే " డ్రైస్పెల్" గాను 21 నుండి 28 రోజుల వరకు వర్షాభావం ఏర్పడితే 'గుర్తించదగిన కరువు' (మైల్డ్ కరువు), 29 నుండి 42 రోజుల వరకు వర్షాలులేకపోతే 'మోడరేట్ కరువు' గాను, 42 వ రోజు నుండి తీవ్ర కరువుగాను గుర్తించాలని నిబంధన చేశారు.

5. కరువు గుర్తింపుకు పై నిబంధనతోపాటుగా 20 శాతం లోటు వర్షంగాని, 50 శాతం పంట దిగుబడి కాని తగ్గాలి.

**అశాస్త్రీయ నిబంధనలు**

పై నిబంధనలు పూర్తిగా అశాస్త్రీయమైనవి. నేటి పరిస్థితులలో 15 రోజులు వర్షం లేక పంటలు ఎండిపోయిన తర్వాత ఒకటి, రెండు రోజులు బోరున వర్షం కురిస్తే నిబంధనల ప్రకారం వర్షపాతం 20 శాతం లోటు రికార్డు అదిగమిస్తే కరువుగా గుర్తించరు. ఒకే మండలంలో వర్షపు రోజుల మధ్య దూరంలో వ్యత్యాసాలుంటున్నాయి. వర్షపు రోజుల సంఖ్య బాగా తగ్గిపోతున్నది. పాతకాలంనాటి వర్షపు కొలత పరికరాలు, తక్కువ చోట్లనో, మండల కేంద్రాలలోనో అమర్చారు. కొలత పరికరాల వద్ద వర్షం పడితే అది లెక్కలోకి తీసుకుంటారు. కరువు ప్రాంతంగా ప్రకటించిన మండలాలలో అత్యధిక దిగుబడితో పంటలు పండడం, ప్రకటించని ప్రాంతాలు వర్షాభావంవలన ఎండిపోతున్న ఘటనలు అనేకం ప్రత్యక్షంగా ఉన్నాయి. కరువు ప్రాంతాల ప్రకటనలు రాజకీయమైనాయి.

ఆగస్టులోనే కరువు ప్రాంత ప్రకటనలు చేయడంవలన ఆ తర్వాత వచ్చిన వర్షాలకు విస్తృతంగా పంటలు వచ్చిన సందర్భాలున్నాయి " క్రాప్‌కటింగ్" నమోనా విధానం కూడా అశాస్త్రీయమైనదే. ఒక మండలంలో 10 గ్రామాలలో క్రాప్‌కటింగ్ ( పంట కోసి శాంపిల్‌గా దిగుబడి అంచనా గట్టడం) చేసి సగటు చేయాలి. రాండంగా తీసుకున్న సర్వే నెంబర్లలో శాంపిల్స్ సేకరించినా స్పష్టమైన గణాంకాలు రావడంలేదు.

**కరువు ప్రకటనకున్న నిబంధనలు అశాస్త్రీయంగా ఉన్నట్లు అనేక సందర్భాలలో నిపుణులు తమ అభిప్రాయాలను వెలుబుచ్చారు. అయినా ప్రభుత్వం శాస్త్రీయ విశ్లేషణవైపు దృష్టి సారించలేదు.**

గత సంవత్సరాలలో కలిగిన నష్టం ( ప్రభుత్వ అంచనా) ఈ విధంగా ఉంది.

| సంవత్సరం | కరువు మండలాలు | నష్టం అంచనా (రు. కోట్లు) |
|---|---|---|
| - | - | |
| 1999-00 | 688 | 2566 |
| 2000-01 | 142 | 2260 |
| 2001-02 | 922 | 2246 |
| 2002-03 | 104 | 5226 |
| 2003-04 | 451 | 2524 |
| 2004-05 | 795 | 1044 |

(14.37 లక్షల టన్నుల పంట దిగుబడి నష్టం) 11.25 లక్షల హెక్టార్ల పంట నష్టం జరిగింది)

వాస్తవ నష్టం అంచనా దీనికి అనేక రెట్లుంటుంది. సూక్ష్మ సర్వే చేసి రంగాల వారీగా అంచనా వేయాలి.

కేంద్ర సహాయం 75 శాతం కాగా, రాష్ట్ర సహాయం 25 శాతం భరించాలి. ప్రకృతి వైపరీత్యాల క్రింద ప్రభుత్వాల సహాయం (రు. కోట్లలో).

| సంవత్సరం | మొత్తం |
|---|---|
| 2000-01 | 193.60 |
| 2001-02 | 207.96 |
| 2002-03 | 218.36 |
| 2003-04 | 229.28 |
| 2004-05 | 240.74 |

(కేంద్రం 80.56కోట్లు ఇవ్వగా రాష్ట్రం 60.19 కోట్లు వ్యయం చేసినట్లు చెప్పింది.)

**కరువు ప్రభావం :**

పశుగ్రాసం కొరతతో పశువులను అతి తక్కువ ధరలకు వేలాదిగా అమ్ముకుంటున్నారు. పాల నుండి వచ్చే ఆదాయం వాటి మేతకే సరిపోని స్థితి ఉంది. రాష్ట్రంలో 350 లక్షల పశువులున్నాయి. ఇందులో 2 లక్షలు బర్రెలు, ఆవులున్నాయి. ఇప్పటికే కరువు విస్తరించినచోట పశువులు బాగా తగ్గాయి. కరువుల వలన ఉత్పత్తి, రంగంపై తీవ్రం ప్రభావం పడుతున్నది. ఉత్పత్తి, ఉత్పాదకతలో పెరుగుదలనిల్చిపోవడమేకాక, గణనీయంగా తగ్గిపోయింది. వర్షాభావం వలన వ్యవసాయ ఉత్పత్తులలో తగ్గుదల ఏర్పడింది. నేడు వ్యవసాయ ఉత్పత్తులన్ని పారిశ్రామిక ముడి సరుకులు కావటాన, వ్యవసాయ ఉత్పత్తుల తగ్గుదలతో పారిశ్రామిక ఉత్పత్తి తగ్గిపోవడం, పరిశ్రమలకు సంవత్సరం పొడుగునా కావాల్సిన ముడి సరుకులు లేక పరిశ్రమలు సంవత్సరంలో చాలా కాలం మూత పడతాయి. దీంతో పారిశ్రామిక కార్మికులు నిరుద్యోగులవుతారు. పరిశ్రమల మూతతో ప్రభుత్వ రంగం (సేవారంగం) ఉత్పత్తి కూడా దెబ్బతింటున్నది. గొలుసుకట్టు మాదిరిగా అన్ని రంగాలలో ఉత్పత్తి, ఉత్పాదకత తగ్గిపోతుంది.

2004 ఖరీఫ్‌లో కోస్తా జిల్లాలలో సాధారణ వర్షపాతానికి ఖరీఫ్‌లో - 11 శాతం, రాయలసీమ జిల్లాలలో -13 శాతం మరియు తెలంగాణా జిల్లాలలో - 31 శాతం వర్షపాతం (మైనస్) నమోదైంది. మొత్తం రాష్ట్రంలో -21 శాతం వర్షపాతం నమోదైంది. ఈ పరిస్థితిని పరిగణనలోకి తీసుకుంటూ రాష్ట్ర ప్రభుత్వం 4.9.2004 న 755 మండలాలను కరువు మండలాలుగా ప్రకటించింది. ఆ తర్వాత మరో 45 మండలాలు ప్రకటించింది. కరువు మండలాలలో గురైన జనాభా 509 లక్షలు. ఇందులో 85 లక్షలు వ్యవసాయ కూలీలు, 16 లక్షలు చిన్నకారు, 38 లక్షలు సన్నకారు రైతులుగా గుర్తించారు. వీరికి ప్రకృతివైపరీత్యాల నిధులనుండి ఈ దిగువ మొత్తాలు విడుదల చేసినట్లు ప్రకటించారు. ( 2004-05)

| వ.నం. | రంగం | మొత్తం (రు. కోట్లు) |
|---|---|---|
| 1. | వ్యవసాయ ఇన్‌పుట్ సబ్సిడీ | 20.00 |
| 2. | గ్రామీణా నీటి సరఫరా | 100.00 |
| 3. | పట్టణా నీటి సరఫరా | 10.00 |
| 4. | ఉచిత సహాయం (ఆరు లక్షల ఫింఛన్లకు ఆరు నెలలపాటు 10 కిలోల బియ్యం చొప్పున | 32.40 |
| 5. | మహిళా, బాలల ప్రత్యేక పౌష్టిక ఆహార కార్యక్రమం | 5.00 |
| 6. | ఎస్.జి.ఆర్.వై. (ఎస్.సి) పనులకు నగదు | 33.09 |
| | మొత్తం | 220.49 |

అలాగే 2004 జూలై, ఆగస్టు నెలలో 1.82 లక్షల టన్నుల బియ్యాన్ని విడుదల చేసారు. ఈ సహాయక కార్యక్రమాలతో మొత్తం కరువు ప్రాంతాల ప్రజలను ఆదుకొనుటకు ఉద్దేశించారు. అలాగే రైతాంగానికి ఈ క్రింది సహాయక చర్యలు చేపట్టాలని అంచనా వేసారు.

| | | |
|---|---|---|
| 1. | 75 శాతం సబ్సిడీపై పశుగ్రాసం | 9 కోట్లు |
| 2. | 50 శాతం సబ్సిడీపై దాణా సరఫరా | 5 కోట్లు |
| 3. | 50 శాతం సబ్సిడీ మినరల్ మిక్చర్ సరఫరా | 1 కోటి |
| 4. | పశువుల ఆరోగ్య సంవరక్షణ | 3.20 కోట్లు |
| 5. | పశు సంరక్షణ సబిరాల ఏర్పాటు | 2 కోట్లు |
| | మొత్తం | 20.20 కోట్లు |

ఈ కేటాయింపులు నేటి వరకు విడుదల చేయలేదు. ఇది కాక రాష్ట్ర ప్రభుత్వం గ్రామీణ నీటి సరఫరా రంగానికి 226.62 కోట్లతో ఒక కంటింజెన్సీ ప్రణాళికను ప్రభుత్వం రూపొందించింది. ప్రస్తుతం 833 జనావాసాలలో 682 ట్యాంకర్లతో మంచినీటి సౌకర్యం కల్పిస్తున్నారు. పట్టణ ప్రాంతాల త్రాగునీటికి రు. 54.64 కోట్లు కేటాయించారు.

2004 అక్టోబర్ నుండి 2005 మే ఆఖరు వరకు 25 కోట్ల పని దినాలు కల్పించుటకు 200 రోజులకు ఒక్కొక్కరికి 8 కిలోల చొప్పున 20 లక్షల టన్నుల బియ్యం అవసరమవుతాయని వీటితో పాటు మ్యాచింగ్ గ్రాంట్‌గా రు. 533 కోట్లు కావాలని అంచనా వేసారు. కాని ఈ అంచనా ఇంత వరకు అంచనాగానే ఉండి పోయింది. బడ్జెట్ సమావేశాలలో కరువుపై విస్తృతంగా చర్చ జరిగినప్పటికి సహాయ కార్యక్రమాలు చేపట్టుటకు సంబంధిత ప్రాంతాలలో అధికారులతోపాటు, అనధికారులతోగాని ఇంత వరకు ఎలాంటి కమిటీలు వేయలేదు. అప్పుడే


కరువొచ్చినపుడల్లా పశువులు కబేళాలకు..

రుణ వసూళ్ళు ప్రారంభించారు. బ్యాంకులు నిర్బంధ వసూళ్ళు ప్రారంభించుటతో కరువు ప్రాంతాల రైతులు ఆందోళనకు గురవుతున్నారు. ముఖ్యంగా గోదావరి బేసిన్‌లోని గ్రామాలు ఈ సంవత్సరం తీవ్రంగా కరువుకు గురయ్యాయి. అలాగే మరికొన్ని మెట్ట జిల్లాలలో కూడా కరువు పరిస్థితులు కొనసాగుతున్నాయి. ఈ ప్రాంతాలలోని ప్రజల అవసరాలను గుర్తించి, ప్రభుత్వం సహాయక చర్యలు చేపట్టాలి.

## సహాయక చర్యలు :

సహాయ చర్యలు 2 విధాలుగా జర్పాలి. 1 తక్షణ చర్యలు , 2 శాశ్వత చర్యలు

**తక్షణ సహాయ చర్యలు :** తక్షణ ప్రజలను కరువు నుండి రక్షించాలి. ధైర్యంగా రైతులు, పేదలు, వ్యవసాయ కార్మికులు నిలబడేటట్లు చేయాలి. ఆత్మవిశ్వాసం కల్పించాలి. అందుకు దిగువ చర్యలు చేపట్టాలి.

**1. రుణాలు :** వరుసగా కరువులు సంబంధించిన మండలాలను గుర్తించి, ఆ మండలాలలోని రైతుల రుణాలు రద్దు చేయాలి. తిరిగి పంటకు పంటవారీ రుణాలివ్వాలి. మైనర్ ఇరిగేషన్ పథకాలకు రైతులకు దీర్ఘకాలిక రుణాలివ్వాలి. అన్ని రకాల వ్యవసాయ రుణాలపై వడ్డీ రేట్లు 6 శాతానికి తగ్గించాలి. (హౌసింగ్ రుణాలు 7 శాతానికిస్తున్నారు. ) తక్షణమే అన్ని రకాల బకాయిల వసూళ్ళను నిలుపుదల చేయాలి. ప్రైవేటు రుణదాతలను క్రమబద్ధీకరించి వారిచ్చిన రుణానికి పై విధానాన్ని వర్తింప చేయాలి. మనీలెండర్స్ యాక్టును పటిష్టవంతం చేసి అమలు చేయాలి. ఆత్మహత్యలు చేసుకుని చనిపోయిన వారి కుటుంబాలకు లక్ష చొప్పున ఎక్స్‌గ్రేషియో ఇవ్వాలి.

**2. పంటల పరిహారం ఇవ్వాలి.** ప్రభుత్వం ప్రకటించిన హెక్టారుకు రు. 1000లు పరిహారం వలన విత్తనాలు కూడారావు. కనీసం ఎకరాకు రు. 2000లు పరిహారం ఇవ్వాలి. పంటలు వేయని వారికి, వేసి నష్టపోయిన వారికి సహాయమందించాలి. వడగండ్లవానవలన ఇతర ప్రకృతివైపరీత్యాలవలన జరిగిన నష్టాన్ని పూడ్చడానికి పంటకు పెట్టిన పెట్టుబడి లెక్కలు వేసి పరిహారం ఇవ్వాలి.

**3. బీమా పథకం అమలు :** పంటల బీమా పథకంలోని లోపాలను సరి చేసి వర్తింప చేయాలి. ప్రీమియం తగ్గింపు, సన్న,చిన్న కారుకు ప్రీమియం ప్రభుత్వమే భరించడం, పంటల రాష్ట్ర సగటు దిగుబడిని పరిగణనలోకి తీసుకొని పరిహారం నిర్ణయించడం చేయాలి. బీమా పథకం పరిహారం జాప్యం లేకుండా చెల్లించాలి.


సాగునీరిచ్చేదెపుడో?.. అందాకా ఇలా ఎదురుచూపులే...

**4. పశుగ్రాసం కొరతను** పరిష్కరించటానికి ఏర్పాట్లు చేయాలి. పశుగ్రాసం ఉన్నచోటి నుండి లేని చోటికి సరఫరాలు పెంచాలి. అడవులలోకి మేతకు ఉచిత అవకాశం కల్పించాలి. గ్రామ అఖిల పక్ష కమిటీల ద్వారా నిధులు సబ్సిడీగా ఇచ్చి పశుగ్రాసం సరఫరా చేయాలి.

5. తిండికి నోచనివారిని గుర్తించి వారికి **పౌష్టికాహారం సరఫరా చేయాలి.** బియ్యం ఒక్కటే సరిపోవు. పని చేతగాని వారికి ఉచితంగానే తయారైన ఆహారాన్నందించాలి. బడిపిల్లలకు సెలవుల్లో కూడా మధ్యాహ్న భోజనం పెట్టాలి. వయోవృద్ధులకు, గర్భిణీ స్త్రీలకు, పిల్లలకు క్యాంపు పెట్టి తయారైన ఆహారాన్నివ్వాలి.

**7. పనికి ఆహారం పథకం** అఖిల పక్ష కమిటీ ద్వారా చేపట్టాలి. ఆస్తులు సంపాదించే విధంగా ఇరిగేషన్ పనులకు ప్రాధాన్యత ఇవ్వాలి. పని కొరత కాకుండా రోజువారీ కూలిపై బియ్యం ఇవ్వాలి.ఇరిగేషన్ పనులకు మొదటి ప్రాధాన్యత ఇవ్వాలి.

8. **సబ్సిడీలు** తోటల పెంపకానికి డ్రిప్, స్ప్రింక్లర్లు, మొక్కల కొనుగోలు పేదలకు సబ్సిడీ పూర్తిగా ఇవ్వాలి. తగు వ్యవసాయ అధికారులను సలహాలకు అందుబాటులో ఉంచాలి. వాతావరణ పరిస్థితులకనువైన తోటల పెంపకాన్ని ప్రోత్సహించాలి. ఇప్పటికే తోటలు వేసిన వారి ఫలసాయాన్ని ఎగుమతి చేసి ధరరావడానికి వీలుగా ప్రభుత్వం జోక్యం చేసుకోవాలి. ప్రభుత్వ సంస్థల ద్వారా కొనుగోలు చేసి ప్రాసెస్ చేసి ఎగుమతి చేయాలి.

9. కూరగాయల రైతులకు **విత్తనాలు ఉచితంగా** ఇవ్వాలి. మార్కెట్లను నియంత్రించి సౌకర్యాలు కల్పించాలి. శీతల గిడ్డంకుల ఏర్పాటు ద్వారా కూరగాయ రైతు నష్టపోకుండా ధర కల్పించాలి. సబ్సిడీపై మందులు, ఎరువులు ఇవ్వాలి. ప్రాసెసింగ్ ప్లాంట్లను నెలకోల్పాలి.

10. విద్యుత్ సరఫరాను మెరుగు పర్చాలి.

11. త్రాగునీటికి ప్రత్యేకంగా గ్రామ కమిటీల ద్వారా సరఫరా మెరుగు పర్చాలి. త్రాగడానికి వీలైన రక్షిత మంచినీటి సరఫరాను పెంచాలి. ప్రభుత్వం స్థానిక ప్రజల కమిటీలచే ఈ పని చేయించాలి.

12. **చౌక దుకాణాల** ద్వారా 14 రకాల నిత్యావసర వస్తువులను సబ్సిడీ ధరలపై పేదలకు ఇవ్వాలి. గతంలో ఇచ్చిన మాదిరిగా బట్టలు చౌక డిపోల ద్వారా అమ్మాలి.

13. **వెలుగు పథకం** క్రింద భూములు కొని పేదలకు పంచాలి. ఆ భూములకు ప్రాథమిక వనరుల కల్పనకు నిధులివ్వాలి.

**శాశ్వత కరువు పనులు :**

కరువులు శాశ్వతంగా నివారించే దిశగా పనులు చేపట్టాలి.

(తరువాయి వ పేజీలో)

# పందులలో వ్యాధులు- నివారణ చర్యలు

డా॥ ఎస్.రమేష్, డా॥ వై.రమణారెడ్డి,
డా॥ టి. జనార్ధనరెడ్డి
రాజేంద్రనగర్

అనాదిగా గ్రామ ప్రాంతాలలోని వెనుకబడిన తరగతుల వారు, భూమి లేని పేదవారు పందుల పెంపకం వృత్తి చేపట్టి యున్నారు. కాని ఇప్పుడిప్పుడే నిరుద్యోగులైన విద్యావంతులు పందుల పెంపకంలో ఆసక్తి చూపుతున్నారు. శాస్త్రీయ పద్ధతిలో చేపట్టి, వివిధ వ్యాధుల బారి నుండి పందులను కాపాడితే పందుల పెంపకము లాభదాయమనుటలో సందేహము లేదు. ఈ దిగువన పందులలో వచ్చే వ్యాధులు, వాటి నివారణ గురించి తెల్సుకుందాం.

**ముఖ్యమైన వ్యాధులు- వాటి నివారణ :**

**1. పంది జ్వరము :**

ఈ జ్వరము పందులకు వచ్చే అన్ని వ్యాధులలో చాలా ప్రమాదకరమైన అంటువ్యాధి. ఈ వ్యాధి వల్ల ఒక గుంపులోని పందులన్నీ చనిపోయే ప్రమాదముంది. ఎదుగుతున్న పందులలోను, పిల్లలలోను ఈ వ్యాధి వల్ల ఎక్కువ నష్టం కలుగుతుంది.

వ్యాధి లక్షణాలు :

ఆకలి మందగించి $108^0$ ఎఫ్ వరకు జ్వరం ఉంటుంది. కళ్ళవెంట నీరు కారుతూ పుసికడ్తుంది. శ్వాసపీల్చుట కష్టంగా ఉంటుంది. పంది కక్కుకుంటుంది. చెవిపై, పొట్టపై చర్మం ఎర్రబడుతుంది. తర్వాత అతి విరోచనములు పట్టి తూలిపోతుంది. చర్మం క్రింద రక్తస్రావం కలిగి చర్మం నల్లబడుతుంది. వ్యాధి తీవ్రతను బట్టి పంది 4 రోజుల నుంచి 10 రోజులలో మరణిస్తుంది.

వ్యాధి నివారణ :

ఈ వ్యాధి కలిగిన తర్వాత చికిత్స చేయడం నిష్ప్రయోజనం. వ్యాధి రాకుండా చిన్న వయస్సులోను, సంవత్సరము వయస్సులోను (రెండుసార్లు) వ్యాధి నిరోధక టీకాలు వేయించాలి. టీకాలు వేసిన 4-5 రోజులలోనే వ్యాధి నిరోధకశక్తి కలుగుతుంది.

**2. న్యుమోనియా :**

ఈ వ్యాధి ముఖ్యంగా 6 మాసాలలోపు పందులలో ఎక్కువగా వస్తుంది. ఇది బ్యాక్టీరియా, వైరస్ వలన కలుగుతుంది. తేమగా అశుభ్రంగా ఉండే షెడ్లు ఈ వ్యాధి వ్యాప్తికి దోహదపడ్తాయి.

ఈ వ్యాధి సోకిన పందికి జ్వరం ఉంటుంది. దగ్గుతో శ్వాసకష్టం అవుతుంది. ముక్కు వెంట నీరు కారుతుంది. ఊపిరితిత్తులు వాచిపోతాయి. ఈ వ్యాధి సోకిన వాటిలో కొన్ని కృశించి సరిగా పెరగవు. ప్రారంభదశలోనే చికిత్స చేస్తే ఉపయోగం ఉంటుంది. పరిసరములను, షెడ్డులను, శుభ్రంగా ఉంచుకోవడం ద్వారా కొంత వరకు ఈ వ్యాధి రాకుండా చేయవచ్చును.

**3. విరోచనములు :**

పందులలో పారుడు అనేక వ్యాధులలో కనిపిస్తుంది. ఎక్కువగా జీర్ణకోశములో క్రిముల వలన ఈ వ్యాధి వస్తుంది. 2-3 వారాలలోపు పిల్లలలో తల్లిపాలలో వచ్చు మార్పు వల్ల, దాణాను తల్లితో పాటు కలిసి తినుట ప్రారంభించుటవల్ల, ఏలికపాముల వల్ల కూడా విరేచనములు కల్గుతాయి. ఇందువలన పందులు బలహీనపడి, కృశించి బరువు తగ్గుతాయి.

**చికిత్స, వ్యాధి నివారణ :**

పిల్లలు పుట్టిన రెండవ రోజు "ఆక్రోమైసిన్" నీటిలో కలిపి త్రాగించాలి. మరల పదవరోజున, 20వ రోజున అలాగే చేయాలి. పిల్లల దాణాలో "టెర్రామైసిన్" లేదా "ఆరోపాక్" గాని కల్పాలి. విరేచనములు పుట్టిన పిల్లలకు "అరియోమైసిన్" "నెఫ్టిన్" సల్ఫా మందులు పశువుల డాక్టరు గారి సలహానుసరించి వేయాలి.

పిల్లలలో పాండు రోగము :

నెలలోపు పంది పిల్లలలో ఇనుప ఖనిజలోపము వల్ల ఈ వ్యాధి వస్తుంది. ఈ వ్యాధి సోకిన పిల్లలు రక్తం తగ్గి తెల్లగా, బొద్దుగా ఉంటాయి. రక్త మాంద్యము ఎక్కువ అవుతున్న కొలది విరేచనములు ప్రారంభమవుతాయి. శ్వాస కష్టతరమవుతుంది.

చికిత్స, వ్యాధి నివారణ :

పందుల దాణాలో నూటికి రెండు, మూడు పాళ్ళు మినరల్ మిక్చర్ కలపాలి. తల్లి పొదుగుడుకు ఫెర్రస్ సల్ఫేట్ ద్రావణం ప్రతిరోజు పూయాలి. ఇమ్‌ఫెరాన్ ఇంజక్షన్‌ను పుట్టిన 4 వ రోజున) 14వ రోజున ఇచ్చి దీనిని నివారించవచ్చును.

**పందులలోని పరాన్న జీవులు :**

పందుల ప్రేగులలో అనేక రకాలైన కీటకములుంటాయి. వీటి సంఖ్య చాలా త్వరగా పెరుగుతుంది. సంఖ్య పెరిగిన కొద్ది పందికి ఎక్కువ హాని కల్గుతుంది. వీటిలో ముఖ్యమైనవి. (చిన్న ప్రేగులు), ట్రైఖినెల్లా (కండరములు) లంగ్ వార్మ్స్ (ఊపిరితిత్తులు), కిడ్నీ వార్మ్స్ (మూత్రపిండాలు) మరియు టేప్ వార్మ్స్ (ప్రేగులు). పందులు తిన్న ఆహారము ఈ పరాన్న జీవులు ఉపయోగించుకొనుట వల్ల, పందులు బలహీనపడతాయి. పందులు ప్రేగులు, లివర్, ఊపిరితిత్తులు, మూత్రపిండాలు పాడయి పందుల చనిపోతాయి. టేప్ వార్మ్స్ ఉన్న పంది మాంసము సరిగా ఉడికించకుండా తిన్నందువల్ల మానవునికి ఈ జబ్బు కల్గుతుంది.

చికిత్స : ఏలిక పాముల మందులు, బద్దిపురుగుల మందులు క్రమం తప్పకుండా రెండు నెలల కొకసారి వాడి పరిసరాలు, షెడ్లు శుభ్రంగా ఉంచడం ద్వారా ఈ బెడద నుండి నివారించవచ్చును.

**గజ్జి :**

ఇది అతి త్వరగా వ్యాపించే చర్మ వ్యాధి. ఈ వ్యాధి మైట్స్ వల్ల కల్గుతుంది. దీనివల్ల విపరీతమైన దురద ఉంటుంది. అందువల్ల గోడలకు రుద్దుకోవడము, కొరకడము చేస్తుంది. ఈ వ్యాధి కండ్లు, చెవుల చుట్టూ, పొట్ట క్రింద, చర్మం పలుచగా ఉండే చోట వస్తుంది.

చికిత్స : మలాథియాన్ అను మందు 1 శాతం ద్రావణం నీటితో తయారు చేసి పందులపైన, షెడ్లలోను బాగా స్ప్రే చేసి వ్యాధిని నివారించవచ్చు. చూడి పందులకు రెండు సార్లు స్ప్రే చేస్తే మంచిది. బిహెచ్‌సి మందును తగు పాళ్ళలో నీళ్ళలో కలిపి పిచికారి చేయాలి. అస్కెబియాల్ గాని, స్కబిటెక్స్ గాని శరీరమంతా పెట్టించాలి.

**గాలి కుంటు వ్యాధి :**

ఈ వ్యాధి వైరస్ వల్ల సోకుతుంది. ఈ వైరస్ అనేక రకములు. ఈ వ్యాధి

**(తరువాయి వ పేజీలో)**

# ఆవాలులో పోషక లోపాలు - నివారణ

డా॥ గుత్తా రామారావు
తిరుపతి



ఆవాలు పంటను మన రాష్ట్రంలో రబీ పంటగా సాగు చేస్తున్నారు. ఈ పంటకు తేమ నిల్వ ఉండే నల్ల రేగడి భూములు అనుకూలం నీటి వసతి ఉండే ఎర్ర నేలల్లో కూడా వేయవచ్చును. ఈ పంటకు నత్రజని, భాస్వరం, పొటాషియం, ఇనుము, మాంగనీసు, కాపర్, మాలిబ్డినం, గంధకం చాలా అవసరం. వీటి లోప లక్షణాలు, నివారణ గురించి తెలుసుకుందాం.

**నత్రజని-లోపలక్షణాలు :** ఈ లోప లక్షణాలు ముందుగా ముదురు ఆకులలో కన్పిస్తాయి. ఆకులు పసుపు రంగులోకి మారతాయి. పత్రహరితం లోపించి పసుపుగా మారతాయి. పైరు పెరుగుదల తగ్గి, పొట్టిగా ఉంటుంది. పంట దిగుబడి బాగా తగ్గుతుంది.

నివారణ : దీని లోపనివారణకు ఎకరాకు 20 కిలోల నత్రజనిని ఇచ్చే ఎరువులను భూమిలో వేస్తే ఈ లోపం రాదు.

**భాస్వరం- లోప లక్షణాలు :** భాస్వరం లోపించినప్పుడు లోప లక్షణాలు ముందుగా ముదురు ఆకులలో కన్పిస్తాయి. క్రింది ఆకులు ముదురు ఆకుపచ్చగా మారి,ఆకుల పరిమాణం తగ్గుతుంది. పంట ఆలస్యంగా పక్వానికి వస్తుంది. వేర్లు సరిగా అభివృద్ధి చెందవు.

నివారణ చర్యలు : దీని నివారణకు ఎకరాకు 12 కిలోల భాస్వరం నిచ్చే ఎరువును భూమిలో వేస్త ఈ లోపం రాకుండా చేయవచ్చును.

**పొటాషియం-లోప లక్షణాలు :** దీని లోప లక్షణాలు ముందుగా ముదురు ఆకులలో కన్పిస్తుంది. ఆకుల అంచులు, చివర్లు మాడిపోవడం దీని ప్రధాన లక్షణం. ఆకులు మాడిపోవడం ఆకు కొన నుండి మొదలవు తుంది. విత్తనాల నాణ్యత బాగా తగ్గిపోతుంది. పైరు చీడపీడలకు లోనవుతుంది.

నివారణ : దీని నివారణకు ఎకరాకు 12 కిలోల పొటాషియం నిచ్చే ఎరువును భూమిలో వేస్తే ఈ లోపం రాదు.

**ఇనుము- లోపలక్షణాలు :** ఈ లోపం రావటం వలన లేత ఆకులు పసుపు రంగుకు మారతాయి. పసుపు వర్ణం ఆకుల మొదలు భాగం నుండి చివర్లకు వ్యాపిస్తుంది. లోప తీవ్రత అధికమైతే ఆకులు, పువ్వులు, కాయలు తెలుపు రంగుకు మారతాయి. పూత, కాయల సంఖ్య, పరిమాణం తగ్గుతాయి.

నివారణ : ఈ లోప నివారణకు ఫెర్రస్ సల్ఫేట్ 5 గ్రా. + 0.5 గ్రా. సిట్రిక్ యాసిడ్ ఒక లీటరు నీటిలో కలిపి వారం వ్యవధిలో రెండు సార్లు పిచికారి చేసుకోవాలి.

**మాంగనీసు - లోపలక్షణాలు :** ఆకుల ఈనెలు ఆకుపచ్చగా ఉంటాయి. మొక్కల మధ్య భాగంలోని ఆకుల చివర్లు ముందుగా పసుపు రంగుకు మారి తర్వాత ఈనెల మధ్య భాగమంతా పసుపు రంగుకు మారుతుంది. ఇవి కలసిపోయి పెద్దమచ్చలుగా ఏర్పడతాయి. ఆకుల అంచులు కూడా చనిపోయి క్రిందకి ముడుచుకుపోతాయి. పూలు తగ్గి, రాలిపోయి పంట దిగుబడి తగ్గిపోతుంది.

నివారణ : ఈ లోపం నివారణకు మాంగనీసు సల్ఫేట్ 2-3 గ్రాములు ఒక లీటరు నీటికి కలిపి వారం వ్యవధిలో రెండు సార్లు పిచికారి చేయాలి.

**కాపర్ - లోపలక్షణాలు :** లేత ఆకుల ఈనెల మధ్య భాగం పసుపు రంగుకు మారి మాడిపోయిన ప్రదేశాలతో కన్పిస్తుంది. పూత దశలో మొక్కల పెరుగుదల తగ్గిపోతుంది. పూగుచ్చంలోని మొగ్గలు విచ్చుకొనక ముందే వాడిపోతాయి. కాయలు, కాయలలోని విత్తనాల సంఖ్య తగ్గిపోతుంది.

నివారణ : ఈ లోప నివారణకు కాపర్ సల్ఫేట్ 2 గ్రా ఒక లీటరు నీటికి కలిపి వారం వ్యవధిలో రెండు సార్లు పిచికారి చేయాలి.

**మాలిబ్డినం - లోప లక్షణాలు :** మొక్కలు గిడసబారి, ఆకుల అంచులు మాడి ముడుచుకుపోతాయి.

నివారణ : మాలిబ్డినం 2 గ్రా ఒక లీటరు నీటిలో కలిపి వారం వ్యవధిలో రెండు సార్లు పిచికారి చేసుకోవాలి.



( వ పేజీ తరువాయి)

1. **ఇరిగేషన్** రాష్ట్రంలోని నీటి లభ్యతపై స్పష్టమైన సమాచారం సేకరించాలి. మైనర్, మీడియం ప్రాజెక్టుల నిర్మాణాలు పూర్తి చేయాలి. నిర్మాణంలోనున్న మేజరు ప్రాజెక్టులను కాల నిర్ణయంతో పూర్తి చేయటానికి నిధులు పెంచాలి.

2. **ఉత్పత్తి రంగానికి**, పరిశోధనకు ప్రభుత్వం అదనపు నిధులు విడుదల చేయాలి. కరువులను తట్టుకొనే పంటలను పరిశోధన ద్వారా కనుగొనాలి. తక్కువ నీటితో అక్కడి వాతావరణ పరిస్థితులను తట్టుకునే పంటలకు ప్రాధాన్యత ఇవ్వాలి.

3. **భూమి అభివృద్ధికి** చర్యలు చేపట్టాలి. గతంలో భూమి అభివృద్ధి బ్యాంకులు ఇచ్చినట్లు రైతులకు రుణాలివ్వాలి.

4. **లైనింగ్ పనులు** చెరువుల వెనక, ప్రాజెక్టుల వెనకగల కాల్వలలో నీరు వృధా కాకుండా లైనింగ్ పనులు చేయాలి. డ్రైనేజి పనులు పూర్తి చేయాలి.

5. **నీటి యాజమాన్యాన్ని** శాస్త్రీయంగా అభివృద్ధి చేయాలి. ఏ పంటకు ఎంత నీరు అవసరమో అంచనావేసి అందుకు తగిన సరఫరాను మెరుగు పర్చాలి. తగినంత సిబ్బంది నియమించి, రైతులకు చైతన్యం కల్గించాలి.

6. **వ్యవసాయాధారిత** పరిశ్రమల నేర్పాటు చేయాలి. పండ్లు ,కూరగాయల నిల్వలకు, జ్యూస్ ఫ్యాక్టరీలకు ప్రాధాన్యత నివ్వాలి.

7. **ప్రపంచంలో ఎగుమతి** గల అవకాశాలను గుర్తించి ప్రభుత్వమే బాధ్యతగా ఎగుమతి చేయాలి. స్థానిక మార్కెట్ల అవసరాలు పోయి మిగిలిన సరుకు ఎగుమతి చేయాలి.

8. **వ్యవసాయ సబ్సిడీలు** శాస్త్రీయంగా ఉండునట్లు చూడాలి. రైతులకు పంట ధరలు గిట్టుబాటయ్యే విధంగా ఇన్-ఫుట్ సబ్సిడీ, మార్కెట్టు సబ్సిడీలు ఇవ్వాలి. ప్రభుత్వ మార్కెట్టు జోక్యం పెరగాలి.



# వేరుశనగలో అఫ్లాటాక్సిన్ ఉత్పత్తి అనుకూల పరిస్థితులు - నియంత్రణ


కృషి విజ్ఞాన కేంద్రం
ఆదిలాబాద్


వేరుశనగలో దిగుబడులు తగ్గడానికి కారణాలు చూసినట్లయితే చదరపు మీటరులో మొక్కల సాంద్రత తక్కువగా వుండి, మొలక శాతం తక్కువగా వుంటున్నది.

మొలక శాతం తక్కువగా వుండుటకు కారణాలు

1. రబీ కాయలను ఎండలో ఆరబెట్టడం
2. విత్తనశుద్ధి చేయకపోవడం
3. విత్తనం లోతుగా విత్తడం
4. అఫ్లాటాక్సిన్‌తో రంగుమారిన విత్తనం వాడటం వలన
5. ట్రైకోడెర్మా వాడకుండుట
6. తక్కువ పదునులో విత్తడం వంటి కారణాలను చెప్పుకోవచ్చు.

ఆస్పర్జిల్లస్ ఫ్లేవస్ అనే శిలీంధ్రం వేరుశనగ గింజలలో అఫ్లాటాక్సిన్ అనే విషపదార్థాన్ని ఉత్పత్తి చేస్తుంది. గింజల లోని అఫ్లాటాక్సిన్ నూనెలోకి చేరుతుంది. అటువంటి గింజ తిన్నపుడు చేదుగా వుంటుంది. అఫ్లాటాక్సిన్ కలిగిన గింజలు, నూనె మనం ఆహారంగా తీసుకున్నపుడు పచ్చకామెర్లు, కడుపు ఉబ్బటం, కాలేయం చెడిపోవడం వంటివి జరుగుతాయి. కోళ్లమేతలో అఫ్లాటాక్సిన్ కలిస్తే వాటి కాలేయం దెబ్బతిని గుడ్ల ఉత్పత్తి తగ్గుతుంది. ఈ విషపదార్థం కలిగిన మేతను పాడిపశువులు తింటే, వాటి కాలేయం దెబ్బతిని రోగగ్రస్తమవుతాయి. వాటి పాలు తాగిన మనుషులు రోగాల పాలౌతారు.

ఆస్పర్జిల్లస్ ఫ్లేవస్ వేరుశనగలో మొదలు మళ్లు తెగులు కలుగచేస్తుంది. దీనినే మొలక ఎండు తెగులు, మొలకకుళ్లు, మెడకుళ్లు, ఆస్పర్జిల్లస్ శిఖరం కుళ్లు అని కూడా అంటారు. దీని స్థిరబీజాలు విత్తనం పైపొర మీద, భూమిలో వుంటూ, విత్తనం మరియు నేల ద్వారా వ్యాప్తి చెందుతుంది.

ఆస్పర్జిల్లస్ ఆశించిన విత్తనాన్ని విత్తినట్లయితే విత్తనం మొలక కుళ్లి మొలక సంఖ్య తగ్గుతుంది. కుళ్లిన విత్తనం బయటకు తీసి చూసినట్లయితే విత్తనం మీద నల్లని శిలీంధ్రసిద్ధ బీజాలు ముద్దలుగా మసిపూసినట్లు కనిపిస్తాయి.

నీటి ఎద్దడి పరిస్థితులలో మొక్కలకు రోగనిరోధక శక్తి తగ్గుట వలన భూమిలో వున్న ఈ శిలీంధ్ర మొక్కలకు ఆశిస్తుంది. అంతే కాకుండా వివిధ కారణాల వల్ల గాయాలు ఏర్పడిన సందర్భంలో కూడా భూమిలో వున్న శిలీంధ్రం మొక్కలను ఆశిస్తుంది.

**గాయాలకు గల కారణాలు**

1. వేరుకుళ్లు, కాండం కుళ్లు, మొవ్వుకుళ్లు తెగుళ్లు ఆశించినపుడు మొక్కలలో వివిధ భాగాలలో గాయాలు ఏర్పడతాయి.
2. కలుపు తీయునపుడు చేతివేళ్లు ఊడలకు తగిలి గాయాలు ఏర్పడతాయి.
3. భూమినుండి మొక్కలను వేరుచేయుటకు వాడు పరికరముల . వల్ల గాయాలు ఏర్పడుతాయి.

భూమినుండి కాయలు ముందుగా తీసినా, ఆలస్యంగా తీసినా ఈ శిలీంధ్రం కాయలలోకి ప్రవేశించును. తెగులు ఆశించిన కాయల మీద శిలీంధ్ర బీజాలు చేరి నల్లని మచ్చలు ఏర్పడతాయి.

**అఫ్లాటాక్సిన్ ఉత్పత్తికి అనుకూల పరిస్థితులు**

1. కాయలలో అధికంగా తేమ, కాయ పొట్టుకు గాయాలు, గింజలకు పగుళ్లు ఉన్నపుడు
2. కాయలు వర్షంలో తడిసినపుడు, నిల్వ చేసిన కాయలలో తేమ 9 శాతం మించినపుడు
3. నిల్వ చేసినపుడు వాతావరణంలో 70 శాతం కంటె ఎక్కువ తేమ ఈ శిలీంధ్రం గింజలలో ఉధృతంగా అభివృద్ధి చెందుతుంది.
4. నేలలో వున్నటువంటి వేరుపురుగు, కాయతొలుచు పురుగు, రోకలిబండ, చెదలు, నులిపురుగు క్రిముల వల్ల శిలీంధ్రం ఆశిస్తుంది.
5. కాయలు ఊరేదశలో మరియు కాయలు పక్వం చెందు దశలో, మొక్కలు చనిపోవడం వల్ల కానీ, శిలీంధ్రం వల్ల కలిగే వేరుకుళ్లు, కాండం కుళ్లు తెగుళ్ల వల్ల విత్తనంలో అఫ్లాటాక్సిన్ సంక్రమించడానికి అవకాశం వుంది.
6. వేరుశనగలో మొవ్వుకుళ్లు తెగులు మరియు రోజెట్టి లాంటి వైరస్ వల్ల ఈ శిలీంధ్రం త్వరగా సోకుతుంది.
7. పంట కోత సమయంలో పనిముట్ల వల్ల కాయలు దెబ్బతినడం వల్ల శిలీంధ్రం కాయలోనికి చేరే అవకాశం ఎక్కువ.
8. కాయలు వూరే సమయంలో నీటిఎద్దడి వల్ల
9. నేలలోని తేమ ఎక్కువ, తక్కువగా వున్నపుడు అనగా వర్షం లేకపోవడం లేదా క్రమం లేని వర్షపాతం వల్ల చిట్లుతాయి. దీనివల్ల శిలీంధ్రం కాయలోనికి చేరుతుంది.
10. తేలికపాటి నేలలు అనగా ఇసుక మరియు ఇసుక గరవు ఎర్రనేలలో ఈ శిలీంధ్రం నల్లరేగడి నేలలో కంటె ఎక్కువగా వుంటుంది.
11. కాయలు పూర్తిగా ఎండక ముందే వర్షం వస్తే, వాటిని సరిగ్గా ఎండబెట్టని ఎడల శిలీంధ్రం ఆశిస్తుంది.

**అఫ్లాటాక్సిన్ పరిమితి**

1. కిలో విత్తనాలకు 60 మైక్రోగ్రాములు కన్నా తక్కువ శిలీంధ్రం వున్నపుడు దీనిని హానిలేని పదార్థంగా పరిమితి విధించారు.
2. అదే విధంగా దాణా అయితే ఒక కిలో దాణాకు 1000 మైక్రోగ్రాములు వున్నట్లయితే దానిని సురక్షిత దాణాగా నిర్ణయించారు.

**అరికట్టే విధానాలు**

పంటకోయడానికి ముందు జాగ్రత్తలు:

1. చదరపు మీటరుకు ఖరీఫ్‌లో 33 మొక్కలు, రబీలో 44 మొక్కలకు మించకూడదు. మించితే తేమకు పోటీ ఏర్పడి అఫ్లాటాక్సిన్ ఉత్పత్తి పెరుగుతుంది.
2. పంటను ఆలస్యంగా తీయడం వల్ల శిలీంధ్రం సోకటానికి అవకాశం వుంది. మామూలు కాయల కన్నా లేతకాయలు మరియు ముదరని కాయలలో శిలీంధ్రం ఎక్కువగా వుంటుంది.
3. నీటి ఎద్దడి వల్ల కాయలలో తేమ శాతం తగ్గిపోయి, మొక్కలలో నిరోధక శక్తి తగ్గి ఆస్పర్జిల్లస్ పెరగడానికి అనుకూల పరిస్థితులు ఏర్పడతాయి. కనుక నీటిఎద్దడి రాకుండా అవసరమైనపుడు నీటి సౌకర్యం వున్నపుడు నీరు ఇవ్వాలి.
4. తక్కువ కాలంలో దిగుబడికి వచ్చే విత్తనాలను ఎంచుకోవాలి. దీని వల్ల కోతకు వచ్చే సమయంలో వచ్చే అనావృష్టి నుండి ఇవి తప్పించుకోగలవు.
5. మంచి నాణ్యత గల, పొట్ట బాగా వున్న, గట్టి పెంకువున్న విత్తనాలను వాడాలి.
6. బూజు, ఆకుమచ్చలు వంటి ఆకులను పట్టివున్న శిలీంధ్ర వ్యాధులను నిరోధించడానికి రోగ నివారణ మందులు చల్లాలి.
7. పైరు కోతకు వచ్చిన సరైన సమయంలో

(తరువాయి వ పేజీలో)

# రాజోలిబండ డైవర్షన్ స్కీమ్‌కి మరో డైవర్షన్‌గా పవర్‌ప్లాంట్?


**బి. తులసీదాస్,** రాష్ట్ర అధ్యక్షులు
ఆంధ్రప్రదేశ్ రైతు సంఘం

అంతర్రాష్ట్ర నదీజల వివాదాలకు ఆలవాలమైన కృష్ణా బేసిన్‌లో రాజోలిబండ డైవర్షన్ స్కీం వద్ద నిర్మిస్తున్న మినీహైడల్ ప్లాంట్ వల్ల సరికొత్త వివాదం తెరమీదికొచ్చింది. ఆంధ్రప్రదేశ్ ప్రయోజనాలు, ప్రత్యేకించి ఆర్‌డిఎస్ కాల్వపై ఆధారపడిన మహబూబ్‌నగర్ జిల్లా ప్రయోజనాలు దెబ్బతింటాయన్న ఆందోళన రాష్ట్రంలో పెరిగింది. అసెంబ్లీ లోపల-వెలుపల, పత్రికల పతాకశీర్షికల్లో ఈ వివాదం చోటుచేసుకుంది. అన్ని ప్రధాన రాజకీయ పార్టీల ప్రతినిధులూ ఆర్‌డిఎస్


రాజోలిబండ ఆనకట్ట

వద్దకు పోయి పరిశీలించారు. రైతుసంఘం రాష్ట్ర అధ్యక్షుడు బి తులసీదాస్, కర్నూలు, మహబూబ్‌నగర్ జిల్లాల నాయకులు రామకృష్ణ, ఈశ్వర్ ప్రభృతులు పవర్‌ప్లాంట్ నిర్మాణానికి సంబంధించిన పనుల్ని పరిశీలించారు. ఆ సందర్భంగానే పవర్‌ప్లాంట్ ఇంజనీర్‌తో, కర్నాటకకు చెందిన కొందరు రైతులతోను చర్చించారు. వివాదానికి సంబంధించిన వివిధ కోణాల్ని, ప్రజల్లో తెలెత్తుతున్న సందేహాల్ని వివరించడం ఈ వ్యాసం ముఖ్యోద్దేశ్యం.

**ఆర్‌డిఎస్ - కొన్ని వివరాలు**

తుంగభద్ర నదిపై కర్నాటకలోని రాయచూర్ జిల్లా రాజోలిబండ గ్రామం వద్ద ఆనకట్టను నిర్మించి, నీటిని కాల్వ ద్వారా పొలాలకు మళ్లించడమే ఈ పథకం. 1947-58 మధ్య నిర్మించబడిన ఈ ప్రాజెక్టు ద్వారా కర్నాటకలోని 5879 ఎకరాలు, ఆంధ్రలో 87,500 ఎకరాలు సాగుకావాలి. 143 కి.మీ పొడవు గల కాల్వ ప్రవాహ సామర్థ్యం 850 క్యూసెక్కులు. బచావత్ అవార్డు ప్రకారం కర్నాటక 1.2 టిఎంసిలు, ఆంధ్రప్రదేశ్ 15.9 టిఎంసిల నీటిని వాడుకోవాలి.

**బచావత్ అవార్డు ప్రకారం రాజోలిబండ డైవర్షన్ స్కీమ్ కాల్వ ద్వారా 1.2 టిఎంసిల నీటిని వాడుకునే అధికారం మాత్రమే కర్నాటకు ఉంది. కాని 4500 క్యూసెక్కుల చొ॥న వారు చెప్తున్నట్లు 120 రోజులే వాడినా సుమారు 46 టిఎంసిల నీటిని దారి మళ్లించడానికి అనుమతినిచ్చే అధికారాన్ని కర్నాటక ప్రభుత్వం ఎలా పొందింది? రాజోలిబండ డైవర్షన్‌కి ఇది ఇంకో డైవర్షన్ కాదా?**

అవార్డులు, ఒప్పందాలు ఇలా వుండగా ఆచరణ అందుకు పూర్తి భిన్నంగా వుంది. 1.2 టిఎంసిల నీటిని వినియోగించుకోవడానికి హక్కుగల కర్నాటక కాల్వ మొగలో వుండటాన్ని అనుకూలతగా వాడుకొని ఏటా 4.5 నుండి 5.6 టిఎంసిల నీటిని వినియోగిస్తున్నది. అదే కాల్వ దిగువనున్న మహబూబ్‌నగర్ జిల్లాకు 1988 నుండి 2004 వరకు 6.5 నుండి 6.7 టిఎంసిల నీరు మాత్రమే వచ్చిందని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఇరిగేషన్ శాఖ సమాచారం. 87,500 ఎకరాల ఆయకట్టుకు


ఎగువన జరుగుతున్న విద్యుత్ ప్రాజెక్టు పనులు

గాను పైన పేర్కొన్న కాలంలో 38,000 ఎకరాల లోపు మాత్రమే సాగునీటినివ్వగలిగారు. బచావత్ అవార్డును కర్నాటక అమలు చేయలేదని, ఆ కారణంగా నిరంతర కరువు పీడితమైన మహబూబ్‌నగర్ జిల్లా నష్టపోతున్నదని విదితమవుతున్నది.

" కర్ణుడి చావుకు ఆరు కారణాలన్నట్లు " మహబూబ్‌నగర్‌కు నీటి వాటా రాకపోవడానికి క్రిందివి కొన్ని కారణాలుగా పేర్కొనవచ్చు. ఆర్‌డిఎస్ కాల్వకు రావలసిన మొత్తం 17 టియంసిల నీటిలో (గత ఏడెనిమిదేళ్ల సమాచారం పరిశీలిస్తే) 12-13 టియంసిలకు మించి రావడం లేదు. తుంగభద్ర డ్యాం నుండి దిగువకు రావలసినంత నీరు రాకపోవడం, వచ్చిన దాన్ని మినీపవర్‌ప్లాంట్ల ద్వారా కొన్ని రోజుల పాటు హెచ్చు తగ్గులతో విడుదల చేయడం మనం గమనించవచ్చు. ఆర్‌డిఎస్ ఆనకట్ట ఎగువన ఇసుక మేటలు పేరుకుపోవడం, ప్రధాన కాల్వ వద్ద నిర్వహణ సరిగా లేకపోవడం ( ఫోటోలో చూడవచ్చు) మరో కారణం. ఆర్‌డిఎస్ కాల్వకు నీటి లభ్యత తగ్గడానికి 1072 అడుగుల మట్టంలో వున్న కన్‌స్ట్రక్షన్ స్లూయూస్‌లు కూడా కారణంగా చెప్పవచ్చు.

కాల్వకు రావలసిన నీరు రాకపోవడం ఒక ఎత్తయితే వచ్చే దాంట్లో మహబూబ్‌నగర్ వాటా రాకపోవడం మరో ఎత్తు. 1082 అడుగుల మట్టంలో వున్న కాల్వ ముఖద్వారం వద్ద 850 క్యూసెక్కుల ప్రవాహ వేగంతో సాగే నీటికి కర్నాటకలో 42.6 కి. మీ. దాటి, ఆంధ్ర ఆయకట్టు ( 12 ఎ డిస్ట్రిబ్యూటరీ వద్ద ) కు వచ్చే సరికి 771

క్యూసెక్కులుండాలి. కాని కాల్వల ప్రవాహ సామర్థ్యం తగినంతగా లేక పోవడం, వాటి నిర్వహణ కూడా సరిగా లేకపోవడంతో అది తక్కువగా వస్తోంది. ఇంతకు ముందే చెప్పినట్లు కాల్వ మొగలో ఉండడంవల్ల వచ్చిన నీటిలో తన కేటాయింపుతో నిమిత్తం లేకుండా కర్నాటక అధికంగా వాడుకుంటున్నది.

### తాజా వివాదం

గత కాలపు ఒప్పందాలు, నడుస్తున్న చరిత్ర ఇదికాగా ఆర్‌డిఎస్ వద్ద మినీ జల విద్యుత్ కేంద్రం నిర్మాణంతో తాజా వివాదం తలెత్తింది. హైదరాబాద్‌కు చెందిన 'శ్రీ స్వర్ణ ఎనర్జీ లిమిటెడ్' సంస్థకు 4.5 మెగావాట్ల సామర్థ్యంతో పవర్ ప్లాంటు నిర్మాణానికి కర్నాటక ప్రభుత్వం అనుమతినిచ్చింది. స్వర్ణ ఎనర్జీ యజమాని సుబ్బారెడ్డి రాష్ట్ర ముఖ్యమంత్రి డా॥ రాజశేఖరరెడ్డి తోడల్లుడు కావడంతో రాజకీయ ప్రాధాన్యత పెరిగింది. రైతు సంఘానికి సంబంధించినంత వరకు ప్లాంటు యజమాని ఎవరన్నది కాక దాని నిర్మాణంవల్ల ఆంధ్రప్రదేశ్ ప్రయోజనాలు, ముఖ్యంగా మహబూబ్‌నగర్ జిల్లా (ఆర్‌డిఎస్ ఆయకట్టు) ప్రయోజనాలు ప్రధానంగా భావిస్తూ, వాటిని కాపాడడానికి కృషి చేస్తుంది.


ఆర్ డి ఎస్ ప్రధాన కాల్వ ముఖద్వారం వద్ద దుస్థితి

ఆర్‌డిఎస్ ఆనకట్టకు 35 మీ. (సుమారు 100 అడుగులు) ఎగువన సముద్ర మట్టానికి 330 మీటర్ల(1082.7 అడుగుల) ఎత్తులో ప్రధాన కాల్వ ఏర్పాటు చేసుకొని 4.5 మెగావాట్ల విద్యుత్తును ఉత్పత్తి చేయడానికి అనుమతినిచ్చారు. ఒక మీటరు ఫాల్‌తో టర్బయిన్లను నడపాలి. విద్యుదుత్పాదన అనంతరం నీటిని ఆర్‌డిఎస్ ప్రధాన కాల్వ క్రింది నుండి సొరంగ మార్గం ద్వారా దాటించి, ఆర్‌డిఎస్ ఆనకట్టకు దిగువన తుంగభద్రలోకి వదలాలి. కాల్వ ముఖద్వారం వద్ద సిల్‌వెవల్ 1082.7 అడుగులు కాగా దాని ప్రవాహ సామర్థ్యం 4500 క్యూసెక్కులు. కాల్వ వెడల్పు సుమారు 100 అడుగులు కాగా లోతు 9 అడుగులు. పవర్ ప్లాంటు ఏడాదికి 120 రోజులు పని చేస్తుందని స్వర్ణ ఎనర్జీ ఇంజనీరు తెలిపారు.

తుంగభద్రలో నీటి మట్టం 1090.5 అడుగులు కంటె మించి ఉన్నపుడు మాత్రమే విద్యుదుత్పాదన జరగాలన్నది ఒక షరతు. నీటి నియంత్రణ కర్నాటక ఇరిగేషన్ శాఖ, కర్నాటక పవర్ కార్పొరేషను చేస్తాయన్నది మరో నిబంధనగా పేర్కొన్నారు.

### సందేహాలెన్నో! సమాధానాలేవీ?

ఆర్‌డిఎస్ కాల్వ, పవర్‌ప్లాంటు ప్రధాన కాల్వల సిల్‌లెవల్ దాదాపు ఒక్కటే. అలాంటపుడు తుంగభద్ర ప్రవాహానికి మొదట్లో ఉండే పవర్‌ప్లాంటు కాల్వకు వెళ్లగా మిగిలిన నీరే ఆర్‌డిఎస్ కాల్వకు వస్తుంది కదా!

'ముందొచ్చిన చెవులకన్నా వెనకొచ్చిన కొమ్ములు వాడి' అన్న చందంగా అరవై ఏళ్ల నాడు నిర్మించి, ప్రభుత్వంచే నిర్వహించబడుతున్న, అంతకంటె మించి వేలాది ఎకరాలకు సాగునీరందించే కాల్వ కన్నా ఒక్క పారిశ్రామికవేత్తకు లాభాలు తెచ్చే పవర్ ప్లాంట్‌కు ప్రకృతిపరమైన నీటిని అప్పగిస్తారా?




ఆర్‌డిఎస్ కాల్వ ప్రవాహ సామర్థ్యమైన 850 క్యూసెక్కుల నీరే సరిగా రావడంలేదు. అలాంటిది దానికి ఎగువన 4500 క్యూసెక్కుల నీటిని పవర్ ప్లాంటు లాగేస్తే ఆర్‌డిఎస్ కాల్వ ప్రవాహం మాటేమిటి?

పవర్‌ప్లాంట్ కాల్వకు సిల్‌లెవెల్‌ను 1082.7 వద్ద అనుమతించి, ఆనకట్టలో 1090.5 అడుగుల నీటి మట్టం దాటితేనే విద్యుదుత్పత్తి చేయాలని షరతు విధించడంలో నిజాయితీ ఎంత? దాని అమలు చేయించడం, అదుపు చేయడం ఎవరి చేతుల్లో ఉంటుంది?

ప్రభుత్వం చేతుల్లోనే పూర్తిగా ఉంటున్న బహుళార్థసాధక ప్రాజెక్టులలోనే ఎద్దడి తరుణంలో ఇరిగేషన్, విద్యుత్ శాఖల మధ్య నీటి విడుదల విషయంలో ఘర్షణ పడిన సందర్భాలనేకం. అలాంటిది ప్రైవేటు వారి చేతిలోని పవర్ ప్లాంట్‌కు నీరు అదుపు చేయబడుతుందా? ప్రభుత్వాలనే ప్రభావితం చేయగల యాజమాన్యాలకు అధికార్లు ఒక లెక్కా?

బచావత్ అవార్డు ప్రకారం రాజోలిబండ డైవర్షన్ స్కీమ్ కాల్వ ద్వారా 1.2 టిఎంసిల నీటిని వాడుకునే అధికారం మాత్రమే కర్నాటకకు ఉంది. కాని 4500 క్యూసెక్కుల చొ॥న వారు చెప్తున్నట్లు 120 రోజులే వాడినా సుమారు 46 టిఎంసిల నీటిని దారి మళ్లించడానికి అనుమతినిచ్చే అధికారాన్ని కర్నాటక ప్రభుత్వం ఎలా పొందింది? రాజోలిబండ డైవర్షన్‌కి ఇది ఇంకో డైవర్షన్ కాదా?

2002 జూన్ నాలుగున రెండు మెగావాట్ల ఉత్పత్తి సామర్థ్యంతో కర్నాటక ప్రభుత్వం ఇచ్చిన అనుమతిని 3 మెగావాట్లకు (18.9.02) అటుపిమ్మట (7.4.2003) 4.5 మెగావాట్లకు పెంచుతూపోవడం వెనక ఆంతర్యమేమిటి? " ఇంతింతై, వటుడింతై" అన్నట్లు పెరగడానికి స్వర్ణ ఎనర్జీ ప్రతిభను, ప్రభావిత శక్తిని ఎలా అంచనా వేయాలి?

పవర్‌ప్లాంటు వాడిన నీటిని తుంగభద్రలో కలపడానికి ఔట్‌లెట్ కోసం రాతిని పగలకొడుతున్నారు. ఆనకట్ట కూడా ఈ రాతి సముదాయం లోనే ఉంది. పగలగొట్టడానికి శక్తివంతమైన ప్రేలుడు పదార్థాన్ని వాడి, తొందరగా పూర్తిచేయడానికి లోతుగా రంధ్రాలు చేస్తున్నారు. తద్వారా ఆనకట్టకు నష్టం జరుగుతుందని పలువురు ఆందోళన వ్యక్తం చేస్తున్నారు. దీనిపై ఇరిగేషన్ శాఖ వారు భూభౌతిక, భూగర్భ శాఖ అధికార్లతోనూ, ప్రేలుడు పదార్థాల నిపుణులతో చర్చించి వారి అభిప్రాయం తీసుకోవాలి. తరవాతనే ప్రేలుళ్లను అనుమతించి ఉండాలి. కాని అలాంటి దాఖలాలు ఎక్కడా వెల్లడికాలేదు.

ఇలా ఎన్నో సందేహాలు, మరెన్నో అనుమానాలు వ్యక్తమవుతున్నాయి. వాటికి

(తరువాయి వ పేజీలో)





పాలాది లక్ష్మీనారాయణ
హైదరాబాద్

వ్యవసాయ రంగంలో బంజర్ల బాగుసేత కూడా ప్రాధాన్యత గల అంశమే. బంజర్ల స్థితిగతులను, పట్టించుకోకుండా గాలికి వదిలేస్తే చివరకు మిగిలేది ఎడారులే. బంజర్లను పనికిరాని భూములనుకోవడం బాధ్యత లేనితనమనవచ్చు. కానుగు, వెదురు, చింత, నేరెడు, వాక్కాయ వంటి అనేక వృక్షాలను బంజర్లలో లాభసాటిగా సాగుచేస్తూ, నేల కోతనుండి రక్షించుకోవచ్చును. చెట్ల నరికివేత వల్లే, సాధారణంగా బంజర్లు తయారయ్యాయి.

ఇటీవల బయోడిజిల్‌పై జరిగిన పరిశోధనలు మనలో మంచి ఆలోచనలను రేకెత్తించాయి. కానుగులాంటి వృక్షజాలాన్ని బంజర్లలో పెంచి బయోడీజిల్ కార్యక్రమాన్ని సఫలీకృతం చేయవచ్చు. నేడు అభివృద్ధి చెందుతున్న దేశాలు ఇంధన వనరులను పెంపొందించుకోవడంలో ఒక పెద్ద సవాలుగా ఉన్నది. బయోడీజిల్‌ను కార్య రూపంలోకి తెస్తే, అభివృద్ధి జరుగుతుంది. ఖనిజనూనెలు దేశాభివృద్ధికి తోడ్పడుతున్నా పర్యావరణ కాలుష్యాన్ని వేగవంతం చేస్తున్నాయి. బయోడీజిలు పర్యావరణ కాలుష్యాన్ని పెంచదు. తరుచు పెరుగుతున్న ఖనిజ నూనెల ధరలు జనసామాన్యానికి, పారిశ్రామికవేత్తలకు మోయలేని భారం అవుతున్నాయి. ఈ తరుణంలో కానుగునూనె మరియు జట్రోఫా నూనెను ఇంధనంగా వాడే అంశంపై పరిశోధనలు జరిగి, సత్ఫలితాలు రావడం మనందరికీ ఆనందదాయకం.

కానుగు ఒక మొండి వృక్షం. ఎక్కడ నాటినా, మొక్క ఏనుకునే వరకు జాగ్రత్త పడితేచాలు, మహావృక్షమై, కల్ప తరువులా రైతు బిడ్డల నాదుకుంటుంది. బంజరు భూములు, పొలంగట్లపై విస్తృతంగా ఈ చెట్లు నాటి పెంచినపుడు, భూములన్నీ బంజర్లలో కానుగును పెంచే అంశాన్ని నాబార్డువారు లాభసాటి అంశంగా గుర్తించడం రైతుల అదృష్టమని చెప్పవచ్చు. ఇప్పటికే కానుగు సేద్యం యొక్క లాభాలను గుర్తించిన కొన్ని కంపెనీలు మహబూబ్‌నగర్ లాంటి అనావృష్టి పీడిత జిల్లాల్లో విస్తృతంగా పెట్టుబడులు పెట్టడం హర్షణీయం. మహబూబ్‌నగర్ జిల్లా రైతులు కానుగు లాభసాటి తనాన్ని వేగంగా వినియోగించుకోవాలి. కానుగు సాగుకు, బ్యాంకులు 12 శాతంపై రైతులకు ఋణాలు అందజేయగా, నాబార్డు వారు ఆ బ్యాంకులకు నూటికి నూరు శాతం రీఫైనాన్స్ చేస్తున్నారు. పాతిక శాతం డబ్బును రైతులు మార్జిన్ మనీగా పెట్టవలసి ఉంటుంది.

కానుగు సతత హరిత వృక్షం. డెరిస్ ఇండికా అనే మరోపేరు కూడా ఉంది. మధ్యస్థంగా పెరుగుతుంది. మంచినీడనిచ్చే అలంకరణ వృక్షంగా కూడా పెంచుకోవచ్చు. రోడ్లకిరుప్రక్కల నాటి పెంచినపుడు అందచందాలను వెదజల్లుతుంది. నేలలో నత్రజనిని స్థిరీకరిస్తుంది. కానుగు గింజల్లో 30-40 శాతం నూనె ఉంటుంది. ఆసియా ఖండంలో సముద్ర తీరప్రాంతాల్లో, నదీ తీరాలలో ప్రకృతి సిద్ధంగానే పెరుగుతుంది. రోడ్లకిరు ప్రక్కలా, నీటి పారుదల కాలువల ఒడ్డులలో, రైతుల పొలాల్లో సాగు చేయబడుతున్నది.

కానుగు ఆర్ద్ర మరియు సమశీతోష్ణ వాతావరణాల్లో చక్కగా పెరుగుతుంది. 500-2500 మి.మీ. వర్షపాతం తగినది. $27^0$-$38^0$సి అత్యంత ఉష్ణం, $1^0$-$16^0$సి అత్యల్ప ఉష్ణంలో కూడా పెరుగుతుంది. వృక్షాలు పూర్తిగా పెరిగిన తర్వాత నేలలోనీరు నిలిచినా, మంచుకురిసినా తట్టుకుంటుంది. 1200 మీ ఎత్తుగల ప్రాంతాల్లో కూడా పెంచవచ్చు. ఇసుక నేలలు మొదలు ఒండ్రు నేలల వరకు అనుకూలమే. తేమ లేని ఇసుక నేలల్లో పెరగవు. చవుడును సమర్ధవంతంగా తట్టుకుంటుంది. నదులు మరియు సముద్ర తీరాల్లో సాధారణంగా కనిపించే వృక్షం. వ్రేళ్ళు మంచి నీటిలోకి చొచ్చుకుపోయినా లేదా ఉప్పు నీటిలోకి చొచ్చుకు పోయినా తేడా లేదు. మంచి మురుగునీటి పారుదల వసతులు కలిగిన చోట వేగంగా పెరుగుతుంది.

కానుగు బెరడు నున్నగా ఉండి బూడిద రంగులో నన్నగా ఉంటుంది. తళతళలాడే సంయుక్త పత్రంలో 5-9 పత్రకాలుంటాయి. పుష్ప సముదాయం 20 సెం.మీ. పొడవుంటుంది. ఏప్రిల్-జూన్ వరకు కానుగు పూస్తుంది. అండాశయంలో 2 అండాలున్నా ఒకటే ఫలదీకరణం చెందుతుంది. కానుగు నాటిన 4-5 సంవత్సరాలకు గానీ పూత పూయదు. కానుగు కాయల్లో 1 లేదా 2 విత్తులుండవచ్చు. పూత పూసిన మరుసటి సంవత్సరం ఫిబ్రవరి - మే వరకు కాయలు తయారవుతాయి.

కానుగు నూనె ఔషధ లక్షణా లున్నది. చెట్టుకు 9-90 కిలోల కాయలు కాస్తుంది. కానుగు ప్రకృతి సిద్ధ పెరిగే చోట విత్తన సేకరణ ఎక్కడా క్రమ బద్ధంగా లేదు. గింజలో 95 శాతం పలుకులుంటాయి. కానుగు నూనె పసుప్పచ్చగా ఉంటుంది. కంపువాసన, చేదు రుచి కలిగి ఉంటుంది. ఆహార యోగ్యం అసలేకాదు. నూనెను వంట ఇంధనంగా మరియు దీపాలకు ఉపయోగిస్తారు. చర్మరోగాలకు చక్కగా పని చేస్తుంది.

కలప మండే శక్తి, కిలోకు 4600-4800 కిలోల కాలరీలు. కానుగు కలపను సాధారణంగా వంట చెరకుగా వాడతారు. కొన్ని వ్యవసాయ పనిముట్లకు పనికొస్తుంది. కానుగాకు చక్కని పచ్చి ఎరువు. ఎండిన కానుగాకును ధాన్య సంరక్షణ కొరకు ఉపయోగిస్తారు. కానుగు చెక్కను నేలలో వేసినపుడు నులిపురుగులు నిర్మూలించ బడతాయి. కానుగు అనావృష్టికీ మరియు చవుడుకు చక్కగా తట్టుకునే వృక్షం. ఒక కిలో కానుగు విత్తనంలో 1500-1700 విత్తులుంటాయి. కాయలను పగులగొట్టకుండా అలాగే ఉంచినపుడు మొలకెత్తే శక్తి ఏడాది వరకు ఉంటుంది. చెట్టుకు 10-50 కిలోల విత్తులు ఉత్పత్తి అవుతాయి.

కానుగు విత్తులను నాటే ముందు నానబెట్టి నాటినట్లయితే త్వరగా మొలకెత్తుతాయి. మొక్కలు ఆరు మాసాలకు అడుగెత్తు పెరుగుతాయి. రెండు అడుగుల మొక్కలను ఆగస్టు-15 చివరి తేదీగా నాటుకోవడం మంచిది. వాణిజ్య పంటగా పండిచదలుచుకుంటే 30×30×30 సెం.మీ.

గోతులు త్రవ్వి, 3×3 మీ. ఎడంలో నాటుకోవాలి. చెట్ల వయసు 3,4 సం॥ వచ్చే వరకు ఏడాదికోసారి కలుపు తీసుకోవాలి. కానుగు పంటలో అనేక చీడపీడలున్నాయి. వాటిలో ముఖ్యమైనవి కంతులు కలిగించేవి, ఆకులు తొలిచేవి, ఆకులు తినేవి, కాండం తొలిచేవి, రసాన్ని పీల్చేవి, పూలను మరియు పిందెలను తొలిచే పురుగులు ముఖ్యమైనవి. సాధారణంగా ఏ సస్యరక్షణ చర్యలు తీసుకోకుండానే వీటిని ప్రకృతి సిద్ధంగానే అదుపు చేయవచ్చు.

వర్షాధారంగా 5×4 మీ. ఎడంలో నాటినపుడు ఎకరాకు 3 వేల రూపాయల ఖర్చు వస్తుంది. నాబార్డు వారి లెక్కల ప్రకారం ఎకరా సాగు ఖర్చుల వివరాలు ఈ విధంగా ఉన్నాయి.

| | |
|---|---|
| ఎకరా మొక్కల సంఖ్య | 200 |
| రోజు కూలీ | 50 రూ. |
| నాట్ల దూరం | 5×4 మీ. |

రైతులు అప్పులు తీసుకున్నట్లయితే 6 సం. నుండి వసూళ్ళు మొదలుపెట్టవచ్చు. మార్జిన్ మనీ 5-25 శాతం ఉంటుంది. ఈ పథకానికి రైతులు, గ్రూపులు, సహకార సంఘాలు అందరూ అర్హులే.

కానుగు అగ్రోఫారెస్ట్రీకి పనికి రాదు. అడవులు, అడవేతర బంజరు భూములు, సామాజిక భూములు మరియు వ్యక్తి గత నేలల్లో చక్కగా సాగు చేసుకోవచ్చు. తరచూ అనావృష్టికి గురయ్యే మహబూబ్‌నగర్ మరియు అనంతపురం జిల్లాలలో కానుగు మరియు వెదురు లాంటి వృక్షాలను బంజర్లలోనూ, పొలంగట్ల పైన మరియు సామాజిక భూముల్లో అలాగే, గ్రీమణ అంతర్గత రోడ్లు మరియు ఇతర అన్ని రకాల రోడ్ల కిరు ప్రక్కల విరివిగా నాటి పెంచవచ్చు. ఆ జిల్లాలను పచ్చగా మార్చే కార్యక్రమానికి ప్రాధమ్యతలేనప్పుడు అవి భయంకరమైన దుష్పరిణామాలకు తప్పక గురి కావచ్చు. నేడు మనం, మన వ్యవసాయ రంగాన్ని రసాయన వ్యవసాయ దృక్పథం నుంచి రసాయనేతర వ్యవసాయ వైఖరికి మార్చవలసి ఉన్నది. నాగార్జునసాగర్ మరియు శ్రీరాంసాగర్ లాంటి భారీ ప్రాజెక్టుల క్రింది విశాలమైన ఆయకట్టు ప్రాంతాలలో, పొలంగట్లపై, పొలం సరిహద్దులపై కానుగు మొక్కలను నాటి, ఆ ప్రాంతాలలో జీవవైవిధ్యాన్ని నెలకొల్పవలసి ఉన్నది. ప్రపంచంలోని ఏదేశమైనా ఓవైపు భూమిని పచ్చదనంగా మార్చుతూనే మరోవైపు సాంద్ర వ్యవసాయాన్ని కొనసాగించాలి తప్ప వచ్చదనాన్ని విస్మరించడం తగని పని. పాలకుల ఆలోచనలు ఈవైపుకు మళ్ళాలి.

కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు బంజర్ల బాగు నేతకు ప్రాధాన్యతనివ్వడం అలాగే బయోడీజిలు ప్రాజెక్టులను ప్రోత్సహించడం రైతులకొక ఆశాకిరణమని చెప్పవచ్చు.

వృక్షజాలాన్ని పెంపొందించడమంటే పక్షులు, ఉడతలు, తొండలు, తేనెటీగలు, గ్రద్ద గూబలు లాంటి ఎన్నో జంతు జాతులకు ఆవాసం కల్పించినట్లే. 

## సాగు ఖర్చు వివరాలు

ఖర్చు (రూపాయలలో )

| పని వివరాలు | యూనిట్ | 1సం. | 2సం. | 3సం. | 4సం. | మొత్తం |
|---|---|---|---|---|---|---|
| 1.పంట పొలపు తయారీ | 4 గురు కూలీలు | 500 | - | - | - | 500 |
| 2.తొలి దున్నకం | గం.2-30 ని. (గం.100/-) | 250 | - | - | - | 250 |
| 3.అంతర పంటలు | ఎకరా | 400 | - | - | - | 400 |
| 4.మార్కింగు, గుంజలు పాతడం | ఇద్దరు కూలీలు | 250 | - | - | - | 250 |
| 5.45 ఘ.సెం.మీ. గుంతలు త్రవ్వడం, నింపడం | 7 గురు కూలీలు | 350 | 50 | - | - | -400 |
| 6.పశువుల ఎరువు సంతకు 2 కిలోలు | టన్నుకు 200 రూ. | 80 | - | - | - | 80 |
| 7.రసాయనిక ఎరువు చెట్టుకు 150 గ్రా. | 9 రూ. కిలో | 266 | 266 | 266 | 266 | 1064 |
| 8.రవాణా ఖర్చులతో సహా చెట్ల ధర | చెట్టుకు 3 రూ. | 600 | 120 | - | - | 720 |
| 9.నాట్ల ఖర్చులు (రోజుకు 100 మొక్కలు) | ఇద్దరు కూలీలు | 100 | 50 | - | - | 150 |
| 10.కలుపుతీత, ఎరువుల మేత (3,2,1,1) | 4 కూలీలు | 600 | 400 | 100 | 100 | 1200 |
| 11.చీడపీడల నివారణ | - | 40 | 40 | 40 | 40 | 160 |
| | మొత్తం | 3436 | 926 | 406 | 406 | 5174 |
| 12.అనుకోని ఖర్చులు | | 150 | 50 | 50 | 50 | 300 |
| స్థూల మొత్తం ఖర్చులు | 3586 | 976 | 456 | 456 | 456 | 5474 |

### ఎకరా రాబడి మరియు దిగుబడి

| సం. | సంవత్సరం | ఒక చెట్టుకు గింజలు (కిలో) | ఎకరానికి చెట్లు | మొత్తం గింజలు | ధర కిలోకు | మొత్తం ఆదాయం |
|---|---|---|---|---|---|---|
| - | - | | | | | |
| 1 | 5 | కిలోలు 3 | 200 | 600 | రూ.5 | 3000 |
| 2 | 6 | 3 1/2 | 200 | 700 | 5 | 3500 |
| 3 | 7 | 4 | 200 | 800 | 5 | 4000 |
| 4 | 8 | 4 1/2 | 200 | 900 | 5 | 4500 |
| 5 | 9 | 5 | 200 | 1000 | 5 | 5000 |
| 6 | 10 సం.నుండి | 5 1/2 | 200 | 1100 | 5 | 5500 |

### మీకు తెలుసా?

రాష్ట్రవ్యాప్తంగా **1,651** గ్రామాలకు మంచినీటి సదుపాయమే లేదు. **2,682** చోట్ల రక్షిత త్రాగునీరు లేదు. **34,748** ప్రాంతాల్లో పాక్షిక నీటి సరఫరా మాత్రమే వుంది. కేవలం **32,459** నివాస ప్రాంతాలకు మాత్రమే సంతృప్తికరంగా నీరు సరఫరా అవుతోంది. రాష్ట్రమంతటికీ రక్షిత నీటిని సరఫరా చేయాలంటే రు.**5,070** కోట్లు అవసరమని అంచనా.

# పసుపు కోత, తవ్వటం, నిల్వలో జాగ్రత్తలు

యం రామసుబ్బారెడ్డి, కడప

పసుపు పంట విత్తిన సుమారు 210 రోజుల నుండి 270 రోజులకు త్రవ్వకానికి వస్తుంది. భూమిలో ఉన్నటువంటి పసుపు దుంపలు పక్వమునకు చేరుతున్న కొలది మొక్కల ఆకులు పాలిపోయి ఎందుట ఆరంభమవుతుంది. మొక్క ఎండిపోవు వరకు పంట కోయరాదు. పసుపు బాగా పండినట్లు గుర్తు ఏమంటే మొక్కలు బాగా ఎండి నేలపై వాలిపోతాయి. పసుపును రెండు రోజులలో తవ్వుతామనగా మొక్క ఆకులు, కాండములను భూమట్టానికి కోసి వేయాలి. తదుపరి తేలికగా నీరు పెట్టి రెండు రోజుల తరువాత దుంపల త్రవ్వకం ప్రారంభించాలి

బోదెలపై నాటిన నల్లనేలల్లో నాగలిని నడిపించి దుంపలను తీయవచ్చు. కొన్ని ప్రాంతాలలో గడ్డపారలు, పికాసిలతో కూడా తవ్వి, దుంపలను భూమిలో నుండి తీస్తారు. ఇంకా భూమిలో మిగిలిపోయిన దుంపలను నాగలితో దగ్గరగా దున్ని ఏరించాలి. తర్వాత పసుపు దుంపలకు యున్న మట్టిని విదిలించి శుభ్రపరచాలి. తర్వాత దుంపలను, కొమ్ములను వేరు చేయాలి. దుంపలకున్న వేర్లను కోసివేసి ఆధునిక శాస్త్రీయ పద్ధతి ద్వారా వండితే మంచి నాణ్యతగల పసుపు లభ్యమవుతుంది. తవ్వి తీసిన 2-7 రోజుల లోపల ఉడక పెట్టిన యెడల పసుపు నాణ్యత చెడిపోకుండా ఉంటుంది.

**పసుపు ఉడికించే సమయంలో జాగ్రత్తలు:**




వండిన పసుపు నాణ్యంగా ఉండాలంటే అది ఉడికించేటపుడు ఆరబెట్టాలి. ఆలస్యమైతే నాణ్యత తగ్గుతుంది. రికవరి బాగుండదు. ఉడికించేటప్పుడు దుంపలను కొమ్ములను వేరు వేరుగా ఉడకపెట్టాలి.



తవ్విన పసుపును వేరుచేయడం

పసుపు ఉడికించే బానెలలో దుంపలు, కొమ్ములు మునిగే వరకు నీరు పోసి సమంగా మంట పెట్టాలి. 45-60 నిముషాలకు తెల్లటి నురుగు పొంగు దానితో పాటు పసుపుతో కూడిన మంచి వాసన పొగలు వస్తాయి. అప్పుడు పసుపును నొక్కితే మెత్తగా ఉంటుంది. సన్న పొరక పుల్లను గుచ్చితే లోనికి దిగబడుతుంది. ఆ దశలో, పసుపును బయటకు తీయాలి. తక్కువ ఉడికితే ఎండిన తర్వాత కొమ్ములోన, గర్భంలో తొర్రలా ఏర్పడుతుంది. సులువుగా విరుగుతుంది. ఎక్కువ ఉడికిస్తే ఆరిన తర్వాత కొమ్ము రంగు తగ్గుతుంది. ఆకారం బాగుండదు. పసుపు ఉడికించేందుకు వాడే నీరు శుభ్రంగా ఉండాలి. బురద నీరు, ఉప్పు నీరు వాడరాదు, పేడకలపరాదు.

పసుపు ఉడికించేందుకు ప్రత్యేకమైన పెనాల్ని రూపొందించారు. ఒక పెద్ద గాల్వనైజ్డ్ ఇనుప పెనంలో నాలుగు చిన్న పెనాలు సమంగా అమరుతాయి. పెద్ద పెనాన్ని పొయ్యిపై స్థిరంగా బిగిస్తారు. దానిలో 90×55×40 సెం.మీ. సైజు గల జల్లెడ రంధ్రాలు గల నాలుగు చిన్న గాల్వనైజ్డ్ ఇనుప బానెలు అమరేటట్లు తయారు చేస్తారు. ఇవి పెద్ద పెనము నుండి బయటికి తీయటానికి లోన పెట్టడానికి అనువుగా ఉంటాయి. వీటిలో పసుపు వండుతారు. ఈ చిన్నబానెలకు పై అంచున ఇరువైపులా రింగుల్లా, గొళ్ళాలు ఉంటాయి. ఈ గొళ్ళాలలో బలమైన కర్ర పెట్టి ఉడికిన పసుపును బయటకు తీయటానికి పచ్చి పసుపును లోపల దించేందుకు వీలవుతుంది. పాత పద్ధతిలో ఒకే పెనములో పసుపు ఉడికించి తీసేటప్పుడు ఇబ్బందులు నష్టాలుండేవి. కాని కొత్త పద్ధతిలో పసుపును తేలికగానూ, నాణ్యంగాను ఉడికించటానికి వీలుగా ఉంటుంది.

**ఆరబెట్టడంలో జాగ్రత్తలు :**

సమంగా ఉడికిన పసుపును, చిన్న బానెల నుంచి బయట చదునైన శుభ్రమైన నేల లేదా టార్పలిన్ లేదా సిమెంటు ప్లాట్‌ఫారంపై కుప్పగా పోయాలి. 24 గంటల తర్వాత రెండు మూడు అంగుళాల మందముండేలా పరచాలి. పలుచగా పరిస్తే ఎండిన పసుపు రంగు చెడిపోతుంది. మందాన్ని క్రమంగా తగ్గించుకుంటూ రావాలి. 10-15 రోజులకు పసుపు తయారై కొమ్ములన్నీ ఒకే వరుసకు వస్తాయి. ఆరబెట్టేటపుడు పసుపును తిరగబెట్టాలి. తిరగబెట్టేటపుడు పనివారు పసుపుపై కూర్చోకుండా పాదులవద్ద కొంత ఖాళీ చేసుకొని పసుపును తిరగబెడుతుండాలి. మధ్యాహ్నం తిరగబెడితే సమంగా ఎండుతుంది. బూజులు ఆశించవు. కొమ్ములు విరిస్తే కంచు శబ్దం వస్తే అది ఆరినట్లు ; తేమ శాతం 8 ఉన్నట్లు లెక్క వండి, ఎండిన పసుపు వచ్చి పసుపులో సుమారు 20 శాతం తూకముంటుంది. ఎండిన పసుపును శుద్ధిచేసి గోనె సంచులలో నిల్వ చేసుకోవాలి. పసుపు ఆరబెట్టినప్పుడు వర్షానికి తడువరాదు. ఉడికిన పసుపు తడిస్తే పసుపు రంగు కోల్పోయి నారింజ రంగు వస్తుంది. కావున తడవకుండా, పాలిథీన్‌షీటు లేదా టార్పలీన్ సిద్ధంగా ఉంచుకోవాలి. మంచు ఎక్కువగా పడేచోట రాత్రిళ్లు పసుపును కప్పటం మంచిది.

**ఆరేటప్పుడు ఆశించే బూజులు-అఫ్లాటాక్సిన్ విషపదార్థాలు :**

కారణాలు :

☆ ఉడికించి ఆరబెట్టినప్పుడు కుప్పల్ని పైకి క్రిందికి త్రిప్పకుండుట

☆ గాలి, వెలుతురు, ఎండతక్కువ ఉన్న ప్రాంతంలో ఆరబెట్టి, ఎండబెట్టుట

☆ ఎక్కువగా ఉడికించి దుంపల్ని కొమ్ముల్ని మెత్తపడేటట్లు చేయుట

☆ ఉడికి ఎండినప్పుడు అకస్మాత్తుగా వర్షం పడి సరుకు తడవటం

☆ మంచు ఎక్కువ పడే ప్రాంతాల్లో రాత్రిల్లు ఆరుతున్న పసుపును కప్పకుండుట.

☆ వండిన పసుపు తీయనపుడు కల్లంలో పోయునప్పుడు, తిరగ తిప్పునప్పుడు గాయాలు ఏర్పడుట. కల్లం ఉపరితలం లెవల్‌గా లేకుండుట

☆ ఎండిన పసుపుకు బరువు రావాలని నీరు చల్లటం

**లక్షణాలు :**

☆ యాస్పర్ జిల్లన్ నైజర్ బూజు ఆశించినపుడు నల్లని ప్రాంతాలు ఏర్పడుట

☆ యాస్పర్‌జిల్లన్ ప్లేవస్ బూజు ఆశించినపుడు దుంపలు, కొమ్ముల్లో ఆకు పచ్చని ప్రాంతాలు ఏర్పడుట

☆ ఫ్యూజేరియం బూజు ఆశించిన దుంప, కొమ్ములపై తెల్లగా రావటం

☆ ఉడికిన పసుపు తొందరగా ఎండకుండటం

☆ వండిన పసుపులో అఫ్లాటాక్సిన్ వృద్ధి అయి ఉండటం

నివారణ :

☆ వండిన పసుపును పైకి కిందికి సున్నితంగా తిప్పుతుండాలి.

☆ పసుపును ఒక రకమైఫ పసుపు వాసన, తెల్లని నురుగు వచ్చే వరకు (45-60 ని॥) ఉడికించుట; తక్కువ. ఎక్కువ ఉడికించరాదు.

☆ ఆరి, ఎండే పసుపు వర్షము, మంచుకు తడవకుండా కప్పాలి.

☆ ఎండపడి, గాలి ఆడే సమతల గట్టి కల్లంలో పసుపును ఆరబెట్టాలి.

☆ పసుపులో తేమ 8 శాతం వచ్చే వరకు ఎండ బెట్టుట; కొమ్ముకు కొమ్ము తగిలినప్పుడు కంచు శబ్దం రావాలి

☆ ఉడికిన పసుపుకు గాయలు, నొక్కులు లేకుండా పనులు చేయాలి.

**పాలిషింగ్, గ్రేడింగ్, ప్యాకింగ్ :**

మెరుగు పెట్టడం : ఎండబెట్టిన పసుపు దుంపలు, కొమ్ములు గరుకుగా పొలుసులు, చిన్న చిన్న వేర్లు కలిగి ఆకర్షణీయంగా ఉండవు. ఈ దుంపలను, కొమ్ములను మెరుగుబెట్టితే ఆకర్షణీయంగా తయారవుతాయి. వండి ఎండబెట్టిన పసుపును మనుషులతోనూ, యంత్ర పరికరాల సహాయంతో మెరుగు పెట్టవచ్చు. మనుషులతో మెరుగు పెట్టేందుకు ఎండిన పసుపు దుంపలను, కొమ్ములను గట్టి ఉపరితలం మీద రుద్ది గానీ లేదా గోనె సంచుల్లో చుట్టి కాళ్ళతో రుద్దటం కానీ చేయాలి. దీని కన్నా మేలైన, సులువైన పద్ధతి ఏమిటంటే ఒక డ్రమ్ముకు నడుమ ఇరుసు పెట్టి దాని పక్కల వ్యాకోచించు లోహంతో జల్లెడగా తయారు చేయించి, పసుపు దుంపలను, కొమ్ములను అందులో పోసి చేతితో ఇరుసును త్రిప్పితే డ్రమ్ము తిరుగుతుంది. డ్రమ్ము పక్కభాగ మందు ఇనుప మెష్ అమర్చుట వలన ఒకదానికి ఒకటి రానుకొని మెరుగు పెట్టబడుతుంది. విద్యుత్చ్ఛక్తి ద్వారా నడిచే యంత్రాలతో కూడా పసును మెరుగు పెట్టవచ్చు. ఆఖరు దశలో మెరుగు పెట్టేటప్పుడు పసుపు పొడిని నీళ్లలో కలిపి దుంపల కొమ్ములపై జిలకరించితే సరుకు ఆకర్షణీయంగా ఉంటుంది. మంచి ధర పలుకుతుంది.

గమనిక : మెరుగు పెట్టేటప్పుడు దుంపలు, కొమ్ములు ఆకర్షణీయంగా ఉండేందుకోసమని కృత్రిమ రంగులను వాడరాదు. వీటిని వాడితే దిగుమతి చేసుకునే దేశాలు అభ్యంతరం తెలుపుతున్నాయి.

గ్రేడింగ్ : ఎండిన దుంపలను, కొమ్ములను, సైజును బట్టి గ్రేడింగ్ చేయాలి. తరువాత మెరుగు పెట్టి ప్యాకింగ్ చేసుకోవాలి.

ప్యాకింగ్ : గ్రేడింగ్, మెరుగు పట్టాక ఎండిన దుంపలను, కొమ్ములను ఎగుమతి దృష్ట్యా ప్యాకింగ్ చేయడానికి శుభ్రమైన నూతన గోనె సంచులను వాడాలి. లోన పాలిథీన్ పూత ఉన్న గోనె సంచులు వాడటం శ్రేయస్కరం. తేమ తగులకుండా నిల్వ చేసుకోవాలి. దీనికోసం నిల్వ చేసే సంచుల అడుగున చాపలు, వరిపొట్టు పర్చాలి.

**పాతరలో పసుపు నిల్వ :**

ఏ కాలంలోనైనా నీరు నిలువని ఎత్తైన ప్రదేశాన్ని పసుపు పాతర వేయటానికి ఎన్నుకోవాలి. ఈ పాతరలలో వండి ఎండిన పసుపు దుంపలను, కొమ్ములను పురుగు పట్టకుండా నిల్వ చేయవచ్చు. ఈ పద్ధతిలో నిల్వ చేయాల్సిన సరుకు పరిమాణాన్ని బట్టి ఒక మీటరు లోతు 4 నుంచి 6 మీటర్ల వ్యాసం గల గుంత తీయాలి. ఈ గుంతను 2,3 రోజులు బాగా ఎండబెట్టాలి. గుంత అడుగు భాగంలో రెండు అంగుళాల మందంతో వరిపొట్టు వేయాలి. తరువాత గుంత అడుగు చుట్టు పక్క గోడలను బోద లేదా వరి గడ్డితో 4 అంగుళాల మందంతో కప్పాలి. ఆ బోద/వరిగడ్డి పొరను ఈత చాపలతో బాగా కప్పాలి. ఈత చాపలున్న గుంతలో శుభ్రం చేసిన పసుపును పోయాలి. దుంపల్ని, కొమ్ముల్ని నిల్వ ఉంచాలనుకుంటే తొలుత గుంత అడుగున గుండ్రంగా ఉండే దుంపల్ని ఉంచి దానిపై ఈత చాపలు పూర్తిగా పరచి ఆపైన కొమ్ములతో గుంత నింపాలి. గుంతలో పసుపును శంకు ఆకారంలో అంచులు పొర్లకుండా నింపాలి. శంకు ఆకారంలో ఉన్న పసుపు కుప్పను ఈత చాపలతో కొమ్ములు కనిపించకుండా పూర్తిగా కప్పాలి. ఈ విధంగా ఈత చాపలు పరిచిన కుప్పపై బోద లేదా వరి గడ్డి కప్పి తరువాత మట్టితో కప్పాలి. ఈ విధంగా శంఖాకారంలో పాతర వేసినందున వర్షపు నీరు సులువుగా దొర్లిపోతుంది. ఈ ప్రక్రియనంతా బాగా ఎండ ఉన్నప్పుడు చేయాలి. పాతర వేసేటప్పుడు పసుపు తడవకుండా జాగ్రత్తపడాలి. తొలుత గుంట అడుగున, చుట్టూ ప్రక్కగోడ ఎండిన తరువాత 2 శాతం లిండేన్ పొడిని గుంట అడుగున పలుచగా చల్లితే చెదలు పట్టదు. పసుపును గోనెసంచులలో ఉంచకుండా పై విధంగా నిల్వ చేయవచ్చు. పాత్ర పైన కుక్కలు, మేకలు, ఇతర జంతువులు మట్టిని తోడకుండా జాగ్రత్తవడాలి. పాత్ర నుంచి సరుకు తీసేటప్పుడు తొలుత మట్టికప్పును తరువాత బోద కప్పును ఆ తరువాత చాపల్ని జాగ్రత్తగా తీసి మట్టి, చెత్త, చిదుగు పసుపులో పడకుండా చూడాలి. ఈ విధంగా భూమిలో పాతర వేసిన సరుకును రెండు మూడు సంవత్సరాలుగా పురుగు ఆశించకుండా ఉంచవచ్చు.



**గోదాములో పసుపు నిల్వ :**

పండిన పసుపును గోనెసంచులలో నింపాలి. బస్తాలను గోదాములలో (76) నిల్వ చేయాలి. గోనె సంచులను శుద్ధి చేయుటకు లీటరు నీటికి 10 మి.లీ. మలాథియన్ మందు వంతున కలిపి గోతాల పైన లోపల బాగా పిచికారి చేయాలి. తర్వాత ఎండలో బాగా ఆరబెట్టాలి. ఆ తర్వాత పసుపు నింపాలి. కొత్త గోనెసంచులను శుద్ధి చేయపనిలేదు. తర్వాత గాలి చొరబడని గోదాములలో పసుపు నింపి బస్తాలను పీతలపై గోడలకు ఆనుకోకుండా పేర్చాలి. పసుపు నిల్వకు ముందు గోదాముల గోడలను, పైకప్పును, నేలను శుద్ధి చేయాలి. ఇందుకు గాను గోనెసంచులను శుద్ధి చేయుటకు వాడే మలాథియన్ మందు ద్రావణం వాడుకోవచ్చును. గోదాములలో పసుపు సంచులను నిల్వ ఉంచిన తర్వాత ప్రతి నెలకు ఒకసారి మలాథియన్ మందును సంచులపై పిచికారి చేస్తుండాలి. నింపిన పసుపు సంచుల్ని మరో పద్ధతిలో పురుగు పట్టకుండా గోదాములలో నిల్వజేయవచ్చు. ఈ పద్ధతిలో ఇథిలిన్ డై బ్రోమైడ్ (ఇ.డి.బి) మందు గల చిన్న గొట్టాల్ని గోనెసంచుల మధ్య ఉంచాలి. క్వింటాలు పసుపుకు 3 మి.లీ. ఇ.డి.బి. వంతున గొట్టం ముక్కు(కొన) వగులగొట్టి బస్తాల మధ్య ఉంచి గోదాములలోకి గాలి పోకుండా షట్టర్లు, వాకిండ్లు, కిటికీలు, వెంటిలేటర్లు మూయాలి. ఈ మందు పొగ ఒకసారి పెడితే సరిపోతుంది. పసుపు తీసే ముందు గోదామును పూర్తిగా తెరచి 4-5 గంటల తర్వాత సరుకు బయటకు తీసి అమ్ముకోవాలి. పడమటి గాలి సాగకముందే పసుపును నిల్వ చేయడం శ్రేయస్కరం. ఎందుకంటే నిల్వ పసుపును నాశనం చేసే నుసి పురుగులు, ముక్కు పురుగులు పడమటి గాలిలో వ్యాప్తి చెందుతాయి.

**వండిన పసుపు నిల్వలో పురుగులు :**

కారణాలు :

☆ దుంపలను, కొమ్ములను సక్రమంగా ఉడికించకపోవడం

☆ దుంపల్లో, కొమ్ముల్లో తేమ శాతం ఎక్కువగా ఉండటం

☆ చీడపట్టిన గోదాములలో నిల్వ ఉంచటం

☆ పురుగు పట్టిన గోతాల్లో (బస్తాల్లో) పసుపు నింపటం

☆ పడమటి గాలి సాగేటప్పుడు పసుపును నిల్వ చేయటం

లక్షణాలు :

☆ దుంపలు కొమ్ములకు చిన్న చిన్న రంధ్రాలు చేసి లోనికి పోయి పదార్థం తిని వాటిని డొల్లలుగా చేయుటం, నుసి పొడి (80) కలిగించడం ☆ దుంపల, కొమ్ములపై సన్నని గుడ్లు ఉండడం; డొల్లు శబ్దం రావటం ☆ నిల్వ సంచుల నుంచి పొడిలాగా దువ్వరాలడం, బరువు కోల్పోవడం

నివారణ :

☆ కంచు శబ్దం వచ్చినంత వరకు దుంపల్ని, కొమ్ముల్ని ఎండబెట్టడం. ☆ కొత్త గోనె సంచుల్లో లేదా శుద్ధి చేసిన గోనె సంచుల్లో పసుపు నింపటం ☆ పాత సంచుల శుద్ధికి లీటరు నీటికి 10 మి.లీటరు మలాథియాన్ వంతున కలిపి సంచుల లోపల, వెలుపల మందు ద్రావణం పిచికారి చేయాలి.

☆ గోదాముల గోడలను, నేలను, పై కప్పులను పైన చెప్పిన మందు ద్రావణంతో పిచికారి చేసి శుద్ధి చేయడం

☆ వంద చదరపు మీటర్ల విస్తీర్ణానికి 3 లీటర్ల మందు ద్రావణాన్ని వాడాలి. ☆ గాలి సోకని గోదాములైతే 100 కిలోల పసుపుకి 3 మి.లీ. ఇథలిన్ డై బ్రోమైడ్ (ఇ.డి.బి.) వంతున పొగ మందు గొట్టాలు పెట్టాలి.

☆ ఇ.డి.బి. పెట్టినపుడు మలాథియాన్ మందును వాడనవసరం లేదు. ☆ పడమటి గాలి సాగకముందే పసుపును నిల్వ చేయాలి

---

( వ పేజీ తరువాయి)

ఇందులో అవసరానికి మించిన స్థాయిలో మాంసకృత్తులు వుండకూడదు. మేత వృథా కాకుండా, అవసరమైనంత మాత్రమే కట్టాలి.

☆ బట్టి సున్నం (కాల్షియం ఆక్సైడ్) ను ఈ చెరువులో చల్లకూడదు. ఇది పి.హెచ్‌ని మరింత పెంచుతుంది. కాబట్టి అమ్మోనియా హాని మరింత పెరుగుతుంది.

☆ ఫైటోప్లాంక్టాన్ సాంద్రతలో హెచ్చుతగ్గులు లేకుండా అవసరమైనంత సాంద్రతలో నిలకడగా వుండేలా యాజమాన్యం చేయాలి.

☆ కండిషన్ సరయ్యేంత వరకు నత్రజని సంబంధ ఎరువులు ( ఉదా:యూరియా) వాడకూడదు.

☆ నాణ్యమైన జియొలైట్, ఎకరం నీటి విస్తీర్ణం మీటరు లోతున్న చెరువులో 20 నుండి 25 కిలోలు చల్లడం ద్వారా అమ్మోనియా సాంద్రతను కొంతవరకు తగ్గించవచ్చును

**చేప నలుపెక్కడం**

నీటి నాణ్యత లోపం ఏర్పడిన కొన్ని చెరువులలో చేపలు అసాధారణమైన నలుపు రంగుకు మారతాయి. కట్లలో ఈ సమస్య ఎక్కువగా వుంటుంది. తల, పెదవులు, రెక్కలు, పొలుసులతో సహా చేపంతా నల్లబడుతుంది. అంతర్గత అవయవాలు సాధారణంగానే వుంటాయి. చేప చురుకుగా మేత తింటుంది. పెరుగదల కూడా సాధారణంగానే వుంటుంది. చేప చర్మంలోని మెలనిన్ వర్ణద్రవ్యం మితిమీరిన సాంద్రతలో ఉత్పత్తి కావడం వలన చేప నల్లబడుతుంది. నల్లబారిన చేపలకు మార్కెట్ డిమాండ్ వుండదు. ఇవి సాధారణమైన రంగుకు మారాకే కొనుగోలు దారులు పట్టుబడి చేస్తారు. కాబట్టి మార్కెట్ సైజుకు ఎదిగినా నల్లబారిన చేపలను చెరువులోనే వుంచి మేపాల్సిన పరిస్థితి ఏర్పడుతుంది. ఇందువలన ఉత్పత్తి ఖర్చు పెరుగుతుంది.

దీనికి చికిత్స ఏమీ లేదు. నివారణ కొరకు నీరు కాలుష్యం చెందితే తాజా నీటితో మార్పిడి చేయాలి. ఫైటోప్లాంక్టాన్ సాంద్రత తక్కువగా వుంటే తగు మోతాదులో ఎరువులు వాడి సాంద్రత పెంచవచ్చును. ☆

# సమతుల్య ఆహారంగా కోడిగుడ్లు

ఎన్ వి యస్ వర్మ, నర్సాపురం,
ప.గోదావరిజిల్లా



మానవశరీరానికి కావలసిన పోషక పదార్థములు ఇంచుమించు అన్నింటినీ అందజేయునది మరియు ప్రత్యేకంగా చెప్పుకోవలసింది కోడిగుడ్డు మాత్రమే. ఏ విధమైన కల్తీ లేకుండా అందుబాటులో వుండేది కోడిగుడ్డు. పాలతోపాటు కోడిగుడ్డును కూడా సమగ్ర సమతుల్య ఆహారంగా చెప్పుకోవచ్చును. ప్రతి కోడిగుడ్డు మనకు సుమారు 80 కేలరీల శక్తిని ఇస్తుంది. కోడిగుడ్డులో తెల్లసొన మరియు పచ్చసొన అని రెండు భాగాలు వుంటాయి. తెల్లసొనలో మాంసకృత్తులు 8 నుండి 12 శాతం వరకు వుంటాయి.

**కోడిగుడ్డు భాగాలు**

గుడ్డుపై డొల్ల 12 శాతం, తెల్లసొన 58 శాతం, పచ్చసొన 30 శాతం వరకు వుంటుంది. నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ న్యూట్రిషన్, హైదరాబాద్ వారి గణాంకాల ఆధారంగా కోడిగుడ్డు లోని పోషక విలువలు ఈ క్రింది విధంగా వుంటాయి.

ప్రతి 100 గ్రాముల బరువుకు గుడ్డులో తేమ 72.4 గ్రాములు, మాంసకృత్తులు 13.3 గ్రాములు, కొవ్వుపదార్థములు 13.3 గ్రాములు, ఖనిజ లవణాలు 1.0 గ్రాములు వుంటాయి. శక్తి 173 కేలరీలు వుంటాయని నిర్ధారించారు.

అలాగే కోడిగుడ్డులో ఖనిజ లవణాలు ఈ క్రింది విధంగా వుంటాయి. కాల్షియం 60.0 మి.గ్రాములు, భాస్వరం 220.0 మి.గ్రాములు, ఇనుము 2.1 మి.గ్రాములు వుంటాయి.

**కోడిగుడ్డులో విటమిన్లు**

| విటమిన్లు | ఎంత |
|---|---|
| విటమిన్ ఎ | 360 మై.గ్రా. |
| థయామిన్ విటమిన్ బి$_1$ | 0.1 మి.గ్రా |
| రిబోఫ్లేవిన్ విటమిన్ బి$_2$ | 0.4 మి.గ్రా |
| నియాసిన్ విటమిన్ బి$_3$ | 0.1 మి.గ్రా |
| ఫొలిక్ ఆమ్లము | |
| విటమిన్ సి | 78.3 మై.గ్రా |

కోడిగుడ్డులో వివిధ భాగాలలో పోషకాలు

| పోషకం | మొత్తం | తెల్లసొన | పచ్చసొన |
|---|---|---|---|
| మాంసకృత్తులు | 6.6 | 3.0 | 3.3 |
| కొవ్వు | 6.6 | | 6.0 |
| పిండిపదార్థములు | - | - | - |
| సోడియం మి.గ్రా | - | - | 27.0 |
| శక్తి కేలరీలు | - | - | 27 |

మిగిలిన పోషకాలు అన్ని ఎక్కువగా పచ్చసొనలో మాత్రమే అందుబాటులో వుంటాయి.

☆ గుడ్డు పచ్చసొనలో మాత్రమే కొవ్వు పదార్థములు వుంటాయి.

☆ పచ్చసొనలో కొవ్వు పదార్థములు 25 నుండి 33 శాతం వరకు, మాంసకృత్తులు 15 నుండి 17 శాతం వరకు అందుబాటులో వుంటాయి.

☆ కోడిగుడ్డులోని కొవ్వు పదార్థములు తేలికగా జీర్ణము అవుతాయి. అందువల్ల గుడ్లను చిన్నపిల్లలు మరియు అనారోగ్యము నుండి కోలుకుంటున్న వారు తీసుకోవచ్చును.

☆ కోడిగుడ్డులో కాల్షియం, ఫాస్పరస్, ఇనుము వంటి ఖనిజలవణాలు అందుబాటులో వున్నాయి.

☆ దీనిలో విటమిన్ ఎ, విటమిన్ బి12, కూడా అందుబాటులో వున్నట్లు పరిశోధనలో వెల్లడైంది. అలాగే రిటినాల్, రిబోఫ్లేవిన్, ఫొలికేసిడ్ కూడా వున్నాయి.

☆ ఒక వయోవృద్ధునికి కావలసిన విటమిన్ బి12 , విటమిన్ ఎ కెరటీన్‌లో 80 శాతం, ఫోలిక్ ఆమ్లము 70 శాతం, ఇతర బి కాంప్లెక్స్ విటమిన్‌లలో 20 శాతం కేవలం రెండు కోడిగుడ్లలో లభిస్తాయి. దీనిని బట్టి కోడిగుడ్డును పోషక విలువ గలదిగా వర్ణించవచ్చును.

☆ శరీరం వినియోగించుకునే మాంసకృత్తుల విలువలను శాస్త్రజ్ఞులు 'నెట్ ప్రోటీన్ వాల్యూ'గా వ్యవహరిస్తారు. మిగిలిన వాటికన్నా కోడిగుడ్డులోని మాంసకృత్తులు జీర్ణము చేసుకోవడం చాలా తేలిక. ఇవి గుడ్డులో 96 శాతం, పాలలో 85 శాతం, మాంసంలో 76 శాతం మాత్రమే వుంటాయి.

☆ పసిపిల్లలు, పిల్లలు పెరగడానికి గర్భం ధరించిన సందర్భాల్లోను, బిడ్డలకు పాలిచ్చే సమయాల్లోను తల్లులకు, అనారోగ్యము నుండి కోలుకునేటపుడు మరియు వయోవృద్ధులకు మాంసకృత్తుల ఆవశ్యకత అధికంగా వుంటుంది. కాబట్టి గుడ్లను శక్తి ప్రధాతగా అభివర్ణించ వచ్చును.

☆ వంద గ్రాముల బరువు గల కోడిగుడ్లలోని మాంసకృత్తులు ఒక మహిళకు ఒక రోజుకు కావలసినంత మాంసకృత్తులు అందిస్తాయి.

ఆకు కూరలు మరియు పప్పు దినుసులలో అందుబాటులో వుండే కొన్ని రకాల అమైనో ఆమ్లాలు కోడిగుడ్లను తీసుకోవడం వలన తొందరగా ఉపయోగంలోకి వస్తాయి.

**కోడిగుడ్లు ఉపయోగించు పద్ధతులు**

☆ పచ్చి కోడిగుడ్డు కన్నా ఉడకబెట్టిన కోడిగుడ్డు తొందరగా జీర్ణము అవుతుంది.

☆ కోడిగుడ్డు సులభంగా జీర్ణము కావాలంటే నగం ఉడికించాలి. ఎక్కువ సేపు ఉడికించినపుడు పచ్చసొన బాగా గట్టిపడిపోయి సులభంగా జీర్ణం కాదు. రుచికూడా మారిపోతుంది.

☆ కోడిగుడ్డును సగం వుడికించడం వల్ల తెల్లసొన లోని విటమిన్ బి మన శరీరానికి తొందరగా లభ్యమవుతుంది.

☆ కొంతమంది పచ్చికోడి గుడ్డును అలాగే త్రాగుతారు. ఇది ఆరోగ్యరీత్యా మంచిది కాదు.

☆ సగం ఉడికించిన కోడిగుడ్డుతో తేనె కలుపుకొని తీసుకుంటే కీళ్లనొప్పులు తగ్గుతాయి.

☆ సగం ఉడికించిన కోడిగుడ్డులో బెల్లం కలుపుకొని తీసుకుంటే మొలల వ్యాధులు, మూత్రపిండాల వ్యాధులు తగ్గే అవకాశం వుంది. కోడిగుడ్డుతో రాత్రిపూట పాలతో కలిపి తీసుకుంటే మంచిది.

☆ కోడిగుడ్డు ఉడకబెట్టి తినడం వలన పోషక విలువలు పెరుగుతాయి. గుడ్డులో వున్న బ్యాక్టీరియా నశిస్తుంది.

☆ గుడ్డులోని 'ఎవిడిన్ ' అనే పదార్థము వలన బయోటిన్ అనే బి కాంప్లెక్స్ విటమిన్ తొందరగా జీర్ణము కాదు.

☆ కోడిగుడ్డు ఉడకబెట్టి తినడం వలన బయోటిన్ అనే బి కాంప్లెక్స్ విటమిన్ తేలికగా



ఎక్కువ అవుతుంది.

* మాంసకృత్తులు ఎన్నిరకాలుగా అందుబాటులో వున్నప్పటికీ ఉడకబెట్టి తినడం వలన కోడిగుడ్డులోని మాంసకృత్తులు తొందరగా జీర్ణం అవుతాయి.

**గుడ్డు ఉపయోగాలు**

* శరీరంలోని మొత్తం కొలెస్ట్రాల్‌లో 93 శాతం కేవలం కణాలతోనే వుంటుంది. 7 శాతం మాత్రమే రక్తంలోనికి ప్రవేశిస్తుంది. రక్తంలో వుండే కొలెస్ట్రాల్‌లోను 'లో డెన్సిటీలిన్ ప్రొటీన్"(యల్.డి.యల్) అంటారు.

* ప్రతి కోడిగుడ్డులోను కొలెస్ట్రాల్ లో 250 మి.గ్రాముల వరకు వుంటుందని పరిశోధనలు తెలియజేస్తున్నాయి. సామాన్య మానవునికి ప్రతిదినం 300 మి.గ్రా కొలెస్ట్రాల్ అవసరం అవుతుంది

* సాధారణ వ్యక్తులు ఎవరైనా ప్రతిదినం రెండు కోడిగుడ్లు సురక్షితంగా తినవచ్చును.

* గర్భిణీ స్త్రీలు, పిల్లలకు పాలిచ్చే తల్లులు మరియు ఎనీమియా(రక్తహీనత) తో బాధపడేవారు ప్రతిదినం ఆహారంలో తప్పనిసరిగా కోడిగుడ్డు చేర్చి తినడం వలన మంచి ఫలితం వుంటుంది.

* కోడిగుడ్డు ప్రతిదినం తీసుకోవడం వలన రోగ నిరోధక శక్తి పెరుగుతుంది.

* కోడిగుడ్డు పిల్లలలో ఎముకల పెరుగుదలకు ఎర్రరక్తకణాల సంఖ్య రక్తంలో పెరగడానికి, పటిష్టమైన కండరాల అభివృద్ధికి, ఆరోగ్యవంతమైన శరీరానికి, మేధస్సు వృద్ధి చెందడానికి ఉపయోగపడుతుంది.

* డయాబెటిస్( చక్కెరవ్యాధి)తో బాధపడేవారు తప్పనిసరిగా కోడిగుడ్డును తమ ఆహారంలో చేర్చి తినడం వల్లఎటువంటి సమస్యలు రావు.

**కోడి గుడ్డు ఎవరు తినకూడదు**

* కోడిగుడ్డు పచ్చిసొనలో వున్న కొవ్వు పదార్థములు బ్లడ్‌కొలెస్ట్రాల్ పెరగడానికి దోహదపడతాయి. కొలెస్ట్రాల్‌తో బాధపడేవారు మరియు హృద్రోగాలతో బాధపడేవారు పూర్తిగా కోడిగుడ్డును తినడం మానేయాలి.

* బ్లడ్‌కొలెస్ట్రాల్ అధికంగా వున్నవారు ఆరోగ్యరీత్యా కోడిగుడ్లు తినడం మంచిది కాదని కొంతమంది పరిశోధకులు తెలియజేస్తున్నారు.

* ఎలర్జీతో బాధపడేవారు గుడ్డుకు దూరంగా వుండం మంచిది. తరచు ఎలర్జీ బాధలున్నవారు గుడ్డుగానీ, కోడిగుడ్డుతో తయారైన ఆహార పదార్థములు గాని తిన్నపుడు ఎలర్జీ బాధలు అధికం అవుతాయి.

* కోడిగుడ్డు పైభాగాన వుండే పెంకు సన్నటి రంధ్రాలు వుంటాయి. అపరిశుభ్రమైన ప్రదేశాలల్లో కోడిగుడ్డును నిలువ చేసినపుడు వివిధ రకాల హాని కల్గించే సూక్ష్మజీవులు రంధ్రాల ద్వారా లోపలికి ప్రవేశించి, గుడ్డు తిన్నవారి కడుపులో చేరి అనారోగ్యం కల్గిస్తాయి.

* టైఫాయిడ్ మరియు కలరా వంటి వ్యాధికారకములైన సూక్ష్మక్రిములు కోడిగుడ్డు పెంకులోపలకు చేరి అనారోగ్యానికి కారణం అవుతాయని పరిశోధనలు తెలియజేస్తున్నాయి.

* కోడిగుడ్డులోని కొవ్వు పదార్థాలు గాల్‌బ్లాడర్‌ను కుచించుకుపోయేలా చేస్తాయి. దీని వలన గాల్‌బ్లాడర్ నందు నొప్పి కలుగుతుంది. గాల్‌బ్లాడర్ సంబంధిత వ్యాధులతో బాధపడేవారు కోడిగుడ్డుకు దూరంగా వుండటం మంచిది.

* కోడిగుడ్డు పచ్చసొనలో కొలెస్ట్రాల్ అధికంగా వుంటుంది. అందువలన లావుగా వున్నవారు పచ్చసొన తినకపోవడం ఆరోగ్యరీత్యా మంచిది.

**అపోహలు**

* కోడిగుడ్డు మాంసాహారం అని, కొలెస్ట్రాల్ పెరుగుతుందని, వేడి చేస్తుందనే మూఢనమ్మకాలు వున్నాయి. కోడిగుడ్డును సగం వుడకబెట్టి తినడం వలన వీటిని చాలా వరకు అధిగమించవచ్చును. ముఖ్యంగా స్థూల కాయులు పచ్చసొన తినకుండా వుంటే కొలెస్ట్రాల్ శాతం పెరగడం అధిగమించ వచ్చును.

* కొంతమంది ఫారంకోడిగుడ్డు కంటె నాటు కోడిగుడ్డు శ్రేష్టం మరియు ఎక్కువ పోషక విలువలు కలిగి వుంటుందని అభిప్రాయపడ్తున్నారు. రెండింటిలోను పోషక విలువలు ఒకేరకంగా వుంటాయి.

**వినియోగం**

* గుడ్డు మరియు కోడిమాంసం వినియోగంలో భారతీయులు ఎంతో వెనుకబడి వున్నారని పరిశోధనలు తెలియజేస్తున్నాయి.

* 1970 సంవత్సరంలో భారత్‌లో కోడిగుడ్లు తలసరి వినియోగం కేవలం నాలుగు మాత్రమే. 2005 నాటికి ఇది సుమారు 40 వరకు చేరింది.

* జాతీయ పౌష్టికాహార సంస్థ నిర్దేశించిన ప్రమాణాల ప్రకారం ఆరోగ్యకరమైన జీవనం కోసం కోడిగుడ్డు తలసరి వినియోగం సంవత్సరానికి 180 గాను, కోడిమాంసం తలసరి వినియోగం 12 కిలోలు వుండాలి. మన దేశంలో తలసరి వినియోగం కోడిగుడ్లు 40 మరియు కోడి మాంసం 2 కిలోలు అని పరిశోధనలు తెలియజేస్తున్నాయి.

* అభివృద్ధి చెందిన దేశాలలో కోడిగుడ్డు తలసరి వినియోగం 300 మరియు కోడి మాంసం 30 కిలోలుగా వుంది.

* ఇతర వర్ధమాన దేశాలలో అయితే సంవత్సరానికి తలసరి వినియోగం కోడిగుడ్లు 150 మరియు కోడి మాంసం 12 కిలోల వరకు వున్నట్లు పరిశోధనల సమాచారం.

* కోడిగుడ్లు మరియు మాంసం ఉత్పత్తిలో మన రాష్ట్రం అగ్రస్థానంలో వుంది. మన దేశంలో జరిగే కోడిగుడ్ల ఉత్పత్తిలో మూడవ వంతు, మరియు మాంసం ఉత్పత్తిలో ఆరవ వంతు ఆంధ్రప్రదేశ్‌దే కావడం గర్వకారణం.

ప్రభుత్వం మౌలిక వసతులు మరియు రాయితీలు కల్పించి ప్రోత్సహిస్తే, కోడిగుడ్లు ఎగుమతులు గణనీయంగా పెరిగే అవకాశం వుంది. ☆

( వ పేజీ తరువాయి)

నమాదానాలిచ్చేదెవరు? 2002 నుండి తతంగం జరుగుతున్నా తమకేమీ పట్టని తెలుగు దేశం నాయకులు ప్రతిపక్షం బెంచీలకు చేరాక భీషణ ప్రతిజ్ఞలు చేస్తున్నారు. ప్రమాదం ముంచుకొస్తున్నా రాష్ట్ర ప్రభుత్వం నిపుణుల కమిటీ అనీ, కర్నాటకు లేఖ వ్రాసామనీ తాత్సారం చేస్తున్నది.

ఆంధ్రప్రదేశ్ ప్రయోజనాలకు, ముఖ్యంగా నిరంతర కరువు పీడితమైన మహబూబ్‌నగర్ జిల్లాకు, రాజోలిబండ కాల్వ ఆయకట్టుకు ప్రమాదంగా మారిన పవర్ ప్లాంటు నిర్మాణాన్ని తక్షణం ఆపు చేయించాలి. నిపుణులు, రైతులు, రైతు సంఘాలు, రాజకీయ పార్టీలతో వివిధ స్థాయిలలో చర్చించి, అందరి ఏకాభిప్రాయంతో ఇరు రాష్ట్ర ప్రభుత్వాల అంగీకారంతో నిర్ణయాలు జరగాలి. ఇందుకై ప్రజావత్తిడి నిర్మించడం అవసరం.

అయితే, మార్చి 18 న మహబూబ్‌నగర్ జిల్లా శాసన సభ్యులు పవర్‌ప్లాంటు సందర్శించిన సందర్భంగా స్వర్ణ ఎనర్జీ సంస్థ యజమాని సుబ్బారెడ్డి నిర్మాణ పనుల్ని నిలిపివేస్తున్నట్లు ప్రకటించారు. నిపుణుల కమిటీ నివేదిక అనంతరం నిర్ణయం తీసుకుంటామన్నారని పత్రికల్లో వార్తలొచ్చాయి. సుమారు లక్ష ఎకరాల ఆయకట్టుకు సంబంధించిన ఈ అంశంపై వ్యక్తులుగాక ప్రభుత్వ స్థాయిలోనే నిర్ణయం జరగాలి. అనుమతినిచ్చిన కర్నాటక సర్కారు ఆ దిశగా ఆలోచించిన పరిస్థితిలేదు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం త్వరగా స్పందించి, ప్రభుత్వాల స్థాయిలో నిర్ణయాలు జరిగేట్లు కృషి చేయాలి. ☆

# సమగ్ర సస్యరక్షణ

ప్రొ॥ ఎన్. వేణుగోపాలరావు,
ఎంటమాలజిస్టు, తిరుపతి.

## పీక పురుగు

గడ్డి రంగులో ఉండే పొలుసు రెక్కలతో, ముందుకు పొడుచుకొచ్చే నోటి భాగాలతో తరచుగా చెరకు పైరు మొదటి


పురుగు ప్రభావం

దశ పైరులో ఎగురుతూ కనపడే రెక్క పురుగు తీవ్ర నష్టకారి. ముందు రెక్కల అంచున నల్ల మచ్చల వరస ప్రత్యేకంగా కనపడతాయి. ఇవి గుంపుగా ఆకులపై పల్చటి గ్రుడ్లను పెడతాయి. వీటి పిల్ల పురుగులు సున్నితంగా ఉండి శరీరంపై వెంట్రుకల మొదలువద్ద ముదురు గోధుమ రంగు మచ్చలతో పిలక లోపలికి చేరతాయి. వీటి తల భాగం సాదానలుపు లేక గోధుమ రంగులో ఉంటుంది. పెరిగిన లార్వాల వీపుపై ఐదు వైలెట్ రంగు గీతలుగా ఈ మచ్చలు కనిపించటం గమనించవచ్చు.

చెరకు పైరు మొదటి దశ నుండి, మధ్యస్థ దశ వరకు ఇది బెడదగా మారటం కద్దు. రాష్ట్రమంతటా దీని తాకిడి గుర్తించడం జరిగింది.

చెరకు పైరు పిలక తొడిగే దశలోనే దీని తాకిడి మొదలవుతుంది. దీని లార్వాలు పెరిగే చెరకు మొలక మధ్య భాగాన్ని తినటం వలన మొక్కలు ఎండిపోతాయి. ఈ పిలకల మొదట్లో ఈ పురుగు చొచ్చుకొని పోయిన రంధ్రాలుంటాయి. తరువాతి దశలో ఇది పెరిగిన చెరకు గడపై కణుపుల మధ్య భాగాన్ని తొలిచి లోపల పెరగడం మామూలుగా జరిగే ప్రక్రియ.

ఎండిన మొవ్వుగల చెరకు మొక్కల సాంద్రతనుబట్టి ఈ పురుగు స్థాయిని అంచనా వేయాలి.

ఈ పురుగు అదుపుకై దీన్ని తట్టుకో గలిగిన చెరకు రకాల్ని ఎన్నుకోవటం, పైరు మొదటి దశలో సాళ్లలో (బోదె) మట్టి ఎగదొయ్యటం మరియు చెరకు పైరుకు మొదటి దశలో వెంటవెంటనే నీళ్లు కట్టడం వంటి సమగ్ర పద్ధతులు అవలంభించాలి. ఈ పురుగును గ్రుడ్డు, లార్వాదశల్లో అదుపు చేయగల బదనికల్ని చెరకు పైర్లో వదిలి కూడా ప్రయోజనం పొందవచ్చును.

## వంగ మొవ్వు, కాయ పుచ్చు పురుగు

మధ్యస్థ పరిమాణంలో ఉండి గోధుమ, ఎరుపు రంగు సారలతో నిండిన ముందుజత పొలుసు రెక్కలతో వంగ మొక్కలపై ఎగురుతూ గ్రుడ్లు పెట్టే తల్లి పురుగుల్ని గమనించవచ్చు. దీని వీపు, తలభాగాలు ప్రస్ఫుటంగా నల్ల రంగులో ఉంటాయి. ఇవి ఒక్కొక్కటిగా లేత ఆకులపై లేక పూ మొగ్గలపై పెట్టే చిన్ని గ్రుడ్లనుండి వచ్చే పిల్ల పురుగులు గులాబీ రంగులోకి మారి మొక్క వివిధ భాగాల్లోకి చొచ్చుకుపోయి పెరుగుతాయి. వీటి దశ ఆకులపై, కాండంలోపల తెల్లటి కవచంలో ఉంటుంది.

వంగపైరుపై గడ్డుగా మారిన ఈ పురుగు అన్ని ప్రాంతాల్లో విస్తరించి నష్టం కలిగిస్తున్నది. దీని తాకిడి బంగాళాదుంప, కాకర, బఠాణి పైర్లపై కూడా గమనించబడింది.

వంగ మొక్కల పెరుగుదల భాగాలపై దీని తాకిడి ప్రస్ఫుటంగా చూడవచ్చు. దీని పిల్ల పురుగులు కాండం పెరిగే భాగాన్ని తొలవటం వలన మొక్క చివర్లు వాడి ఎండిపోవడం జరుగుతుంది. ఈ పురుగు కాయల్ని తొలవటం వలన మొదటి దశలో అవి రాలిపోతాయి. తరువాతి దశలో కాయలు పుచ్చువిగా మారటం వలన అవి ఎక్కువ భాగం పనికి రాకుండా పోతాయి. కాయలపై పురుగు తొలిచిన రంధ్రాలు, అది వదిలిన మలినాలు కనపడతాయి.

వంగపైరులో వాడిపోయిన కొమ్మల్ని / రెమ్మల్ని గుర్తించి, వాటి ప్రభావాన్ని అంచనా వేయవచ్చు.

వాడుకొమ్మల్ని, పుచ్చుకాయల్ని పైరు నుంచి తొలగించి తగిన దశలో కార్బరిల్, డైక్లోర్‌వాస్ వంటి మందుల్ని పిచికారి చెయ్యాలి.

## బెండకాయ తొలుచు పురుగు :

మధ్యస్థ పరిమాణంలో ఉండే తల్లి


పురుగు ప్రభావం



బెండపైరుపై పురుగు తొల్చిన కాయ

పురుగు ముందు రెక్కలపై ఆకుపచ్చ సార ప్రత్యేక ఆకృతినిస్తుంది. తల్లి పురుగులు బెండ మొక్కల లేత చిగుళ్లపై, మొగ్గలపై, కాయలపై గుండ్రంగా ఉండే లేతనీలి గ్రుడ్లను పెడుతూపోతాయి. వీటి నుండి వచ్చే మట్టి రంగులో ఉండే పిల్ల పురుగుల శరీరంపై తెల్ల సారలుండటం, గట్టి కురచ వెంట్రుకలుండడం ప్రత్యేకంగా చెప్పుకోవచ్చు. ఈ దశలో ఇవి మొక్కల చివరి కాండం భాగం తొలిచి లోపల చేరటం వలన వాడిపోయిన రెమ్మల్ని పైరులో గుర్తించవచ్చు. ఈ లార్వాలు మొగ్గ, పువ్వు, పిందె, కాయల్ని కూడా తొలిచి పనికి రాకుండా చేస్తాయి. పెరిగిన లార్వాలు బయటకు వచ్చి ఆకులపై లేక క్రింద మొక్క పరిసరాల్లో తెల్లటి మురికి కవచటం గల నిద్రదశలోకి మారతాయి.

ఈ పురుగులు బెండ, పత్తి పైర్లను అన్ని దశలోనూ నాశనం చేస్తాయి. దీని ఉధృతి ఎక్కువగా ఆగస్టు-అక్టోబర్ నెలల్లో ఉంటుంది. ఈ పురుగు తాకిడికి పైరు పెరుగుదల తగ్గటమేకాకుండా, ఇది పూత, పిందె, కాయల్ని తొలవటం ద్వారా పూర్తి నష్టకారిగా మారుతుంది. వంటకాలంలో 3-4 తెరలుండటం వలన నష్టం కొన్ని సార్లు 3-35 శాతం వరకు ఉంటుంది.

వీటిని తల్లి పురుగు దశలో లింగాకర్షణ ఎరల ద్వారా అంచనా వేయవచ్చు. గ్రుడ్లను పిల్ల పురుగుల్ని పైరుపై జరిపే పరిశీలన ద్వారా బేరీజు వేయవచ్చు.

దీని అదుపుకు కార్బరిల్, ఎండోసల్ఫాన్, థయోడికార్బ్ వంటి మందులు వాడవచ్చు. అయితే కార్బరిల్ మందును అతిగా వాడటం మంచిది కాదు.

**ట్రిస్టిజా తెగులు :**

బత్తాయి, నిమ్మ నారింజల్లో సమస్యగా మారిన ఈ ముఖ్యమైన వైరస్ తెగులు మన రాష్ట్రంలో కూడా ఉంది.

**తెగులు లక్షణాలు :**

తెగులు సోకిన చెట్ల లేత ఆకుల్ని సూర్యుని వెలుగుకు అడ్డు పెట్టి చూచినప్పుడు ఈనెల మీద అక్కడక్కడా పాలిపోయిన సారలుంటాయి. దీనినే "వీన్‌క్లియరింగ్" అంటారు. అటువంటి చెట్ల మొదలుపై కొద్దిపాటి బెరడు తీసి చూస్తే నొక్కులు కనిపిస్తాయి. వీటిని "స్టెమ్‌పిట్స్" అంటారు. ఈ వ్యాధి లక్షణాలు బత్తాయి మొలక చెట్లలో కనిపించవు. కాని బత్తాయిని అంటు కట్టినప్పుడు వేరు మూలంగా వాడే జంబేరిపైస్టెమ్ పిట్స్ ఏర్పడి వేరు మూలంగా నశించును. దీని వలన ఆకులు పలుచబడటం విపరీతమైన పూత పిందె వచ్చి, కాయ ముదిరే దశలో చెట్టు ఎండిపోతుంది.



కాండంపై తెగులు ప్రభావం

ప్రత్యేకత :

పేను పురుగు ద్వారా ఈ తెగులు మిగతా చెట్లకు వ్యాపిస్తుంది.

నష్టము :

తెగులు సోకిన మొక్కల నుండి సేకరించిన మొగ్గలు అంట్లు కట్టడం జరిగినప్పుడు బత్తాయి చెట్లపై ఈ వ్యాధి ప్రకోపించి, చెట్లు నిలువునా ఎండిపోవును. ఈ స్థితి మన రాష్ట్రంలో కొన్ని చీనీతోటలు పెంచే ప్రాంతాల్లో అనుభవానికొచ్చి, నూటికి నూరు శాతం నష్టం కలిగింది.

నివారణ :

చీనీ, నిమ్మ పరిశోధనా స్థానం ద్వారా ఇవ్వబడే (రంగపూర్ నిమ్మపై అంటుకట్టబడిన) మొక్కల్ని నాటాలి.

చీనీ నిమ్మ పరిశోధనా స్థానం వారిచే ధృవీకరించబడిన చీనీ చెట్ల నుండీ బడ్‌స్టిక్కును తీసికొని వాటి బడ్స్‌ను అంటుకట్టేందుకు ఉపయోగించాలి. పేనుబంక అదుపుకు యిమిడాక్లోప్రిడ్ (0.5 మి.లీ) లేక మోనోక్రోటోఫాస్ (1.6 మి.లీ. లీటరు నీటికి) వంటి మందుల్ని పిచికారి చేయాలి.

చెట్లపై బ్రతికే కాండపు పరాన్న జీవుల్ని (కస్కుటా) తొలగించాలి.

# వేసవి పాడి ఎంతో లాభదాయకం

డా. బి జాన్‌బాబు,
డా. పివివియస్ శివరామ్



**రా**ష్ట్రంలో గేదెల ద్వారా పాల ఉత్పత్తి అధికంగా జరుగుతోంది. అలాగే సంకరజాతి ఆవుల ద్వారా కూడా అధిక పాలను రైతులు ఉత్పత్తి చేస్తున్నారు. సాధారణంగా శీతాకాలంలో అవసరానికి మంచి పాలు ఉత్పత్తి అవుతుండగా, వేసవిలో చాలా తక్కువ పాలు ఉత్పత్తి అవుతున్నాయి. శీతాకాలంలో ఉత్పత్తి అయ్యే పాలకు సరైన మార్కెట్ వుండటం లేదు. పాల కేంద్రాలు సగం పాలనే కొనుగోలు చేస్తుంటయి. వేసవిలో గేదెల పాల ఉత్పత్తి తగ్గడానికి గల కారణాలను, పాల ఉత్పత్తిని వేసవిలో పెంచేందుకు గల కారణాలను మనం తెలుసుకుందాం.

### వేసవిలో పాడి పొందాలంటే?

☆ గేదెలను ఏప్రిల్ నెలల్లో చూలు కట్టిస్తే వేసవి పాడిని పొందవచ్చును.

☆ గేదెలు చూడి కాలం 10 నెలలు కాబట్టి వేసవి ఆరంభంలో గేదెలు ఈనాలంటే ఏప్రిల్, మే నెలల్లో చూలు కట్టించాలి.

☆ అప్పుడు అవి ఫిబ్రవరి-మార్చి నెలల్లో ఈనుతాయి. కాబట్టి వేసవి పాడి సాధ్యమౌతుంది.

☆ ఈనిన మూడు నెలల్లో చూలు కట్టించాలి. మేత, దాణా దానికి కావలసినంత పెడితే పశువు చూలుకట్టినా పాల దిగుబడి మామూలుగా ఇస్తుంది.

☆ వేసవిలో ఎదను గుర్తించడం ముఖ్యం ☆ చిరు ఉచ్చ వేయడం, కరివి ఎర్రబడటం, తీగవేయడం గమనించి, కృత్రిమ గర్భోత్పత్తి చేయించాలి.

☆ వేసవిలో ఎద సమయంలో కొన్నిసార్లు కేవలం మూడు గంటలు మాత్రమే ఎద వుంటుంది. కాబట్టి ఎద వచ్చిన వెంటనే చూలు కట్టించాలి.

☆ ఎద లక్షణాలు 12 గంటల తర్వాత కూడా వుంటే మళ్లీ కృత్రిమ గర్భోత్పత్తి చేయించాలి.

ఇటీవల నిర్వహించిన పరిశోధనలో పశువుల్లో అండోత్పత్తి ప్రతి ఏడు రోజులకు జరుగుతూ వుంటుంది. ఇది ఏడాది పొడవునా వుంటుందని కనుగొన్నారు. వేసవిలో కూడా పశువుల్లో అండోత్పత్తి జరుగుతుంది. అనుకూల పరిస్థితుల్లోనే అండోత్పత్తి జరుగుతుందని గుర్తుంచుకోవాలి.

### పశువులు సకాలంలో ఎదకు రావాలంటే

☆ పశువులు సకాలంలో ఎదకు రావడానికి ఖనిజ లవణాలు మిశ్రమం రోజుకు 30 గ్రాములు ఇవ్వాలి.

☆ ఆయుర్వేద, హోమియో మందులు, హార్మోన్లు వాడవచ్చు.

☆ ఎదకు రావడానికి మందులు వాడే ముందు పశువైద్యుడితో అండాశయాలను, గర్భాశయాన్ని పరీక్షించాలి.

☆ పచ్చిమేత రోజులు 30-40 కేజీలు పెడితే పశువులు సకాలంలో ఎదకు వస్తాయి.

☆ అవకాశం వున్న రైతులు బహువార్షిక పశుగ్రాసాలను సాగుచేస్తే సంవత్సరం పొడవునా ముఖ్యంగా వేసవిలో పశుగ్రాసం లభిస్తుంది.

☆ చిక్కుడు జాతి పశుగ్రాసాలైన బొబ్బర, పిల్లిపెసర, జనుము, సిరాటో, సెంట్రో వంటి పశుగ్రాసాలను పశువులకు ఇవ్వడం ద్వారా అదిక పాల ఉత్పత్తిని పొందవచ్చు.

☆ పశువులకు ఎల్లప్పుడు అందుబాటులో వుంచాలి.

☆ మధ్యాహ్న సమయంలో రెండు బకెట్ల నీళ్లు నాలుగు నుండి ఆరుసార్లు పశువు శరీరంపై చల్లితే పాలదిగుబడి పెరుగుతుంది. పశువు ఎదకు వస్తుంది. ☆

---

( వ పేజీ తరువాయి)

సంవత్సరం పొడవున రావచ్చు. కాని జనవరి నుండి ఏప్రిల్ నెల వరకు ఈ వ్యాధి ఎక్కువగా సోకుతుంది. ఈ అంటువ్యాధి ఇతర వ్యాధుల కన్నా త్వరగా సోకే గుణం కలదు. గాలి, నీరు, మేత ద్వారా ఈ వ్యాధి ఇతర పందులకు సోకుతుంది. వైరస్ పందులలో ప్రవేశించిన 2-7 రోజులలో లక్షణాలు కన్పిస్తాయి.

1. ముట్టె పైన, నాలుకపైన, గిట్టలనడుమ, మరియు పొదుగు, చనులపై బొబ్బలు (పొక్కులు) ఏర్పడుతాయి.

2. జ్వరము తీవ్రంగా యుండును

3. చూడి పందులు ఈసుకుపోయే ప్రమాదం ఉన్నది.

4. పందులు కుంటుతాయి. రక్తము కారుతుంది. కాళ్ళగిట్టలు ఊడిపోవచ్చు.

**చికిత్స :**

1. జబ్బు చేసిన పందులను వేరు చేయాలి.

2. పుండును పోటాషియం పర్మాంగనేటు నీటిలో కడగాలి. ఈగలు వాలకుండా జాగ్రత్త పడాలి. పరిసరములు సోడియం హైడ్రాక్సైడ్ మందు నీటితో కడుక్కోవాలి.

3. గిట్టల మధ్య గాయములకు బోరోగ్లిసరిన్ పూయాలి. వేపనూనె, సిమెలెంట్ మొదలగు మందులు వాడవచ్చును.

4. యాంటిబయోటిక్స్ ఇంజక్షన్ వాడుటవల్ల ఇతర వ్యాధులు కల్గించే క్రిములు చేరకుండా అరికట్టవచ్చు.

5. జబ్బు పందులు తినగా మిగిలిన దాణా, నీరు, మలమూత్రాలు దూరంగా గుంటలో పాతిపెట్టాలి. ☆

# చౌడు భూములు - సమగ్ర విశ్లేషణ-యాజమాన్యం

సిహెచ్ఎస్. రామలక్ష్మి,
డా॥ కె.జీవన్‌రావు
రాజేంద్రనగర్

వివిధ భూసమస్యలు సుస్థిర అధికోత్పత్తిని సాధించకుండా ఆటంక పరుస్తున్నాయి. రాష్ట్రంలోనే కాక దేశం మొత్తం మీద కొన్ని లక్షల హెక్టార్ల నేల వ్యవసాయానికి అనుకూలంగా లేదు. రైతుకు సమస్య సృష్టించే ఇట్టి నేలలను సమస్యాత్మక నేల లంటారు. పలు రకాల సమస్యాత్మక నేలల్లో చౌడు నేలల గురించి తెలుసుకుందాం

ప్రపంచ వ్యాప్తంగా 950 మిలియన్ హెక్టార్లలో చౌడు భూములున్నాయని అంచనా (పట్టిక-1). ఇవి మన దేశంలో -10 మి.హె. ఉండగా, దీనిలో 5.5 మి.హె. తెల్లచౌడు భూములు కాగా 4.5 మి. హెక్టార్ల నల్ల చౌడు భూములు. ఆంధ్రప్రదేశ్‌లో ప్రస్తుత అంచనా ప్రకారం 4 లక్షల 56 వేల హెక్టార్ల వరకు చౌడు భూములున్నాయని అంచనా.

రాష్ట్రంలో దాదాపు అన్ని జిల్లాల్లోను ఈ చౌడు భూములున్నాయి. ముఖ్యంగా ప్రకాశం, గుంటూరు, మహబూబ్‌నగర్, కృష్ణా, నెల్లూరు, ఉభయగోదావరి, నిజామాబాద్, నల్గొండ, వరంగల్ జిల్లాల్లో ఎక్కువ విస్తీర్ణంలో ఉన్నాయి. మన దేశంలో చౌడు సమస్య ఎక్కువగా గుజరాత్ రాష్ట్రంలోను (1649 వేల హెక్టార్లు), తక్కువ సమస్య కేంద్ర పాలిత ప్రాంతమైన ఢిల్లీ (0.6 వేల హెక్టార్లు) లోను ఉందని అంచనా. ప్రపంచం మొత్తం మీద చూసినట్లయితే ఆస్ట్రేలియా (360 ల॥ హె. ) లో ఎక్కువ చౌడు నేలలున్నట్లు పరిశోధనలో వెల్లడైంది.

**పట్టిక -1. ప్రపంచ వ్యాప్తంగా విస్తరించి ఉన్న చౌడు నేలల విస్తీర్ణం (మి. హె.)**

| ఖండం | తెల్లచౌడు | నల్లచౌడు | మొత్తం |
|---|---|---|---|
| ఉత్తర అమెరికా | 6.2 | 9.6 | 15.8 |
| మెక్సికో మరియు మధ్య అమెరికా | 2.0 | - | 2.0 |
| దక్షిణ అమెరికా | 69.4 | 57.6 | 128.0 |
| ఆఫ్రికా | 54.6 | 27.0 | 81.6 |
| దక్షిణ ఆసియా | 83.0 | 1.8 | 84.8 |
| ఉత్తర మరియు మధ్య ఆసియా | 91.6 | 120.0 | 211.6 |
| సౌత్‌ఈస్ట్ ఆసియా | 20.0 | - | 20.0 |
| ఆస్ట్రేలియాసియా | 17.4 | 341.6 | 360.0 |
| యూరప్ | | | 50.8 |
| | మొత్తం | | 952.66 |

**పట్టిక-2 ఇండియాలో చౌడు నేలల విస్తీర్ణం (వేల హెక్టార్లలో)**

| రాష్ట్రం/కేంద్రపాలిత ప్రాంతాలు | విస్తీర్ణం |
|---|---|
| ఆంధ్రప్రదేశ్ | 456 |
| బీహార్ | 85 |
| గోవా | 20 |
| గుజరాత్ | 1649 |
| హర్యానా | 560 |
| పంజాబ్ | 525 |
| కర్నాటక | 180 |
| కేరళ | 26 |
| మధ్యప్రదేశ్ | 245 |
| మహారాష్ట్ర | 130 |
| ఒరిస్సా | 400 |
| రాజస్తాన్ | 1200 |
| తమిళనాడు | 340 |
| ఉత్తరప్రదేశ్ | 960 |
| పశ్చిమబెంగాల్ | 820 |
| అండమాన్ నికోబార్ | 15 |
| ఢిల్లీ | 0.6 |
| పాండిచ్చేరి | 1 |

చౌడు భూముల్లో రకాలు :

భూసార పరీక్ష ద్వారా మట్టిలోని కొన్ని భౌతిక, రసాయనక లక్షణాలను బట్టి వీటిని ముఖ్యంగా 3 తరగతులుగా విభజించవచ్చును. (పట్టిక. 4 లో ఈ భూముల లక్షణాలు చూడవచ్చు.)

1. తెల్ల చౌడు భూములు
2. నల్లచౌడు భూములు
3. ఉప్పుచౌడు భూములు

తెల్లచౌడు భూములు గుర్తించడం :

నేల పైభాగంలో ఎండాకాలంలో ఉప్పు పొంగి ఉంటుంది. కొన్ని రకాల లవణాలు గాలిలోని తేమను పీల్చుకుని ఎల్లప్పుడు తడిగా ఉండే లక్షణాలు కల్గి ఉంటాయి. కొన్ని చోట్ల భూమి మెత్తటి పొడిగా పొంగి ఉంటుంది. దీనిపై కాలు వేసినపుడు నేల క్రుంగడం కూడా జరుగుతుంది. ఉప్పాకు మొక్కలు ఈ నేలలో ఎక్కువగా పెరిగి ఉంటాయి. వీటి ఆకులు ముదురు ఆకుపచ్చ రంగు కలిగి తాకినపుడు మైనం వలె మెత్తని జిగురుగా ఉంటాయి. పైరు వేసినప్పటికి మొక్కలు అక్కడక్కడ మాత్రమే పెరిగి ఉంటాయి. పైరు సరిగా ఎదగదు. పెరుగుదల ఎగుడు దిగుడుగా ఉంటుంది. ఆకులు ముడుచుకుని, చివర్లు ఎండిపోయి ఉంటాయి. ఈ లక్షణాలు ఆధారంగా పాల చౌడు భూములను గుర్తించవచ్చును.

**నల్లచౌడు భూములను గుర్తించడం :**

నేల ఎండినపుడు గునపం వేసినా దిగుబడనంత గట్టిగా బండబారి, రాయివలె ఉంటుంది. తగినంత నీరు, తేమ ఉన్నప్పుడు మెత్తటి, చిక్కటి బురద తక్కువవుతుంది. కాలు పెడితే దిగబడిపోతుంది. నీరు ఎప్పుడూ పేరుకోదు. రోజులు తరబడి నీరు ఇంకదు. గాలి, నీరు చొరబడే శక్తి ఎక్కువగా ఉంటుంది. నేలలోని సేంద్రియ పదార్థం. హ్యూమస్ కలిగిన కారణంగా నేలలకు ఒక విధమైన నల్లని రంగు వస్తుంది.

ఉప్పు చౌడు నేలలను గుర్తించడం :

ఇవి చూడటానికి అచ్చం పాలచౌడు

**పట్టిక -3 రాష్ట్రంలో చౌడు భూములు విస్తీర్ణం (ఒక అంచనా)**

| జిల్లా | పాల చౌడు | కారు చౌడు | మొత్తం హెక్టార్లలో |
|---|---|---|---|
| శ్రీకాకుళం | 3000 | 500 | 3500 |
| విజయనగరం | 2500 | 500 | 3000 |
| విశాఖ | 2500 | 500 | 3000 |
| తూ.గోదావరి | 28000 | 1500 | 19500 |
| ప.గోదావరి | 15000 | 1000 | 16000 |
| కృష్ణా | 36000 | 4000 | 40000 |
| నెల్లూరు | 18000 | 16000 | 34000 |
| గుంటూరు | 46000 | 3000 | 49000 |
| ప్రకాశం | 50000 | 4000 | 54000 |
| చిత్తూరు | 3000 | 6000 | 9000 |
| కడప | 2500 | 7000 | 9500 |
| అనంతపురం | 2100 | 12000 | 14100 |
| కర్నూలు | 2000 | 10000 | 12000 |
| మ.నగర్ | 33000 | 18000 | 51000 |
| రంగారెడ్డి | 1000 | 1000 | 2000 |
| మెదక్ | 2000 | 14000 | 16000 |
| నిజామాబాద్ | 4000 | 1000 | 5000 |
| ఆదిలాబాద్ | 1500 | 2000 | 3500 |
| కరీంనగర్ | 2600 | 1500 | 4100 |
| వరంగల్ | 2600 | 5500 | 8100 |
| నల్గొండ | 14600 | 9000 | 23600 |
| ఖమ్మం | 5000 | 1000 | 6000 |

నేలల మాదిరిగానే కన్పిస్తాయి. అయితే పాల చౌడు, కారు చౌడు నేలల రెండింటిలో గల దుర్లక్షణాలు ఉంటాయి. ఎండా కాలంలో నేల పైభాగంలో తెల్లని ఉప్పు పొంగి ఉండటం, నేల మెత్తటి పొడిగా తయారవడం గమనించవచ్చును.

చౌడు భూములు ఏర్పడటానికి ముఖ్యకారణాలు

1. భూమిలోని మాతృ ఖనిజాలు
2. వేడి వాతావరణం
3. తక్కువ వర్షపాతం
4. పంట సాగుకు ఉప్పునీటిని వాడటం
5. భూమిలో మురుగు నీరు పోయే ఏర్పాటు లేకపోవడం
6. నీటి కాలువల నుండి నీరు పక్క భూములలోనికి చొచ్చుకొని పోవడం.
7. భూగర్భ జలం ఉపరితలంలో ఉండటం వలన
8. సముద్రపు నీరు వలన ఈ నేలలు ఏర్పడతాయి.

తెల్లచౌడు భూముల యాజమాన్యం గురించి తెలుసుకుందాం :

1 తెల్ల చౌడు భూములను అనువుగా తయారు చేయలంటే మంచి సాగునీరు అవసరం.
2. భూమిపై పేరుకుపోయిన ఉప్పును పారతో చెక్కు తీసి వేయాలి.

నీటిలో ప్రధాన సమస్య అధిక లవణాలు కలిగి ఉండటం, కావున వీటిని పరిమిత స్థాయికి తీసుకురావాలంటే నాణ్యత గల సాగునీరు అవసరం. పొలాన్ని చదును చేసి సుమారు 20-25 సెంట్ల మడులు (1/4 ఎకరం)గా విభజించి గట్లు వేయాలి. ప్రతి మడిలో 9 అంగుళాల లోతు నీరు పెట్టి బాగా దమ్ము చేయడం వలన భూమిలోని లవణాలు నీటిలో కరుగుతాయి.

4. ఈ నీటిని మడిలో 2-3 రోజులు నిల్వ ఉంచి తర్వాత మురుగు నీటి కొలతల ద్వారా మడిలో నీటిని తీసివేయాలి.
5. రెండవ సారి నాలుగయిదు అంగుళాల నీరు సరిపోతుంది, ఈ విధంగా 4 లేక 5 సార్లు చేస్తే లవణ పరిమాణం తగ్గుముఖం పడుతుంది.
6. ఒక మడిలో నీరు మరొక మడిలోకి పారించకుండా సాగునీటిని నేరుగా మడిలోని వచ్చే విధంగాను, మురుగు నీరు బయటకు వెళ్ళే విధంగాను, వేర్వేరు కాలువలు ఏర్పాటు చేసుకోవాలి.
7. మురుగు కాలువల లోతు కనీసం 2 అ॥ ఉండేలా చూసుకుని, మురుగు తీసి వేయడంలో అత్యంత జాగ్రత్త వహిమించాలి. లవణాల స్థాయి మరల పెరగకుండా మంచి యాజమాన్య పద్ధతుల ద్వారా ఈ స్థితిని నిలబెట్టుకోవాలి.

భూమిలో లవణ సాంద్రత ఏ లోతు వరకు తగ్గించాలనేది పంట రకాన్ని బట్టి ఉంటుంది.

| | |
|---|---|
| వరి | 0-30 సెం.మీ |
| జొన్న | 0-60/70సెం.మీ. |
| పత్తి | 0-60/120 సెం.మీ. |
| పండ్లతోటలు | 0-150/200 సెం.మీ. |

8. సేంద్రియ ఎరువులను అధికంగా వాడాలి. జీలుగు పంటను పువ్వు వచ్చేంత వరకు పెంచి భూమిలో కలియదున్నాలి.
9. సాధారణంగా వేసే ఎరువుల కన్నా 25 శాతం అధికంగా ఎరువులు వేయాలి. ఎకరానికి 20 కిలోలు జింక్ సల్ఫేట్ చివరి దుక్కిలో గాని నాటడానికి ముందుగాని వేయాలి.
10. యూరియా, అమ్మోనియం సల్ఫేట్, సూపర్ ఫాస్ఫేట్, డి.ఎ.పి.ఎరువులను వాడవచ్చును. అమ్మోనియం క్లోరైడ్, మ్యూరేట్ ఆఫ్ పొటాష్ ఎరువులను వాడకూడదు.
11. పంట గింజలను భూమిలో విత్తేముందు 0.1 శాతం (10 గ్రాముల ఉప్పును 10 లీటర్ల నీటికి) ఉప్పు ద్రావణంలో 2 లేక 3 గంటలు

## వివిధ రకాల చౌడు భూములు లక్షణాలు

| లక్షణం | పాలచౌడు / తెల్లచౌడు | కారుచౌడు / నల్లచౌడు | పాలకారు చౌడు |
|---|---|---|---|
| ఉదజని సూచిక (పిహెచ్) | 8.5 కంటే తక్కువ | 8.5 కంటే ఎక్కువ | 8.5 కంటే తక్కువ |
| లవణాల పరిమాణం | 4 మి.మీ. కంటే ఎక్కువ | 4మి. మీ కంటే తక్కువ | 4 మి. మీ. కంటే ఎక్కువ |
| భూమిలో ఉండే ద్రావణం | సల్ఫేట్, క్లోరైడ్ | కార్బోనేట్, బైకార్బోనేట్ | సల్ఫేట్, క్లోరైడ్ |
| రసాయనిక పరిస్థితి | అయన్లు గాఢత ఎక్కువ, సోడియం గాఢత తక్కువ. | అయన్లు మరియు సోడియం గాఢత ఎక్కువ. | కార్బోనేట్, బైకోర్బోనేట్, సోడియం గాఢత ఎక్కువ. |
| పొలంలో వీటిని గుర్తించడం | 1. వేసవిలో భూమి పైపొరంలో తెల్లగా, ఉప్పు లవణాలు పొర కన్పిస్తుంది. 2. ఉప్పు ఆకు మొక్కలు ఎక్కువగా కన్పిస్తాయి. | 1. భూమిపై పొర ముదురు గోధుమ రంగు నల్లగా తెట్టులా కన్పిస్తుంది. 2. సేంద్రియ పదార్థం భూమిపై పొరలో మట్టి రేణువులలో విడిపోయి కన్పిస్తుంది. | 1. భూమిపై పొరలలో గోధుమ రంగు లవణాలు ఏర్పడి, అక్కడక్కడ నల్లని మచ్చలు కన్పిస్తాయి. |
| బాగు చేయు విధానం | నాణ్యమైన సాగునీరు ఉపయోగించి లీచింగ్ ప్రక్రియల ద్వారా లవణ తీవ్రత తగ్గించుకోవడం | సిఫార్సు చేసిన జిప్సం పొడిని భూమిపై వెదజల్లి నీరు పెట్టి, దమ్ము చేసి, లవణాలను బయటకు పంపి వేయాలి. (3-4 సార్లుచేయాలి) | జిప్సంను భూమిపై వెదజల్లి అధిక లవణాలను తొలగించడం (3-4 సార్లు చేయాలి) |
| సాగు చేయు విధానం | బాగు చేసిన వెంటనే పచ్చిరొట్ట పైర్లను పెంచి భూమిలో కలియ దున్నాలి. తట్టుకునే రకాలను ఎంచుకోవాలి. | పచ్చిరొట్ట పైర్లను పూత దశలో కలియదున్ని క్షారత్వాన్ని తట్టుకునే రకాలను పెంచుకోవాలి. | పచ్చిరొట్ట పైర్లను పూత దశలో కలియదున్ని చౌడు క్షారత్వాన్ని తట్టు కునే, రకాల సాగు చేయాలి. |

నానబెట్టినచో పంటలలో ఉప్పు శాతాన్ని తట్టుకునే శక్తిని పెంచుకోవచ్చును.

12. ఉప్పును తట్టుకునే వరి, చెరకు, జొన్న, మొక్కజొన్న, సజ్జ వంటి పైర్లను ఎంచుకోవాలి. పప్పుధాన్యాపు పంటలు ఉప్పు గుణాన్ని తట్టుకోలేవు. అదే విధంగా రేగు, ఉసిరి, నేరేడు వంటి పండ్ల మొక్కలను కూడా తెల్లచౌడు నేలల్లో పెంచుకోవచ్చును.

**కారు చౌడు భూముల యాజమాన్యం :**

ఈ నేలల్లో మార్పిడి సోడియం శాతాన్ని 1.5 కన్నా తక్కువ స్థాయికి తీసుకురావడం, ఉదజని సూచిక అనుకూలమైన స్థాయికి తగ్గించడం ముఖ్యాంశాలు :

1. మార్పిడి సోడియంను నీటిలో కరిగే లవణాలుగా మార్చడం

2. కరిగిన లవణాలను మురుగు నీటి ద్వారా బయటకు పంపడం. ఈ విధంగా తీసుకురావడానికి అవసరమైన సవరణ పదార్థాలను నేలకు వేయాలి.

3. ఈ సవరణ పదార్థాలలో ముఖ్యమైనవి జిప్సం, సల్ఫ్యూరిక్ ఆమ్లం, అల్యూమినియం సల్ఫేట్, గంధకం, కాల్షియం క్లోరైడ్ మొదలైనవి.

4. వీటన్నింటిలో ముఖ్యమైనది, చౌకగా, అందుబాటులో ఉండేది జిప్సం.

5. ఇందులో 24 శాతం కాల్షియం, 18 శాతం గంధకం ఉంటాయి. నేలలో మార్పిడి సోడియంను తగ్గించడానికి కాల్షియం, ఉదజని సూచిక తగ్గించడానికి గంధకం పని చేస్తాయి.

6. వేయవలసిన జిప్సం పరిమాణం నేల క్షార తీవ్రతపై ఆధారపడి ఉంటాయి. అధిక సోడియం శాతం ఉంటే ఎక్కువ జిప్సం మరియు తేలిక నేలల కంటే బరువైన నేలల్లోను ఎక్కువ జిప్సం వాడాలి. వేయవలసిన జిప్సం మోతాదు ప్రయోగశాలలో పరీక్ష ద్వారా నిర్ధారించుకుని వేయడం మంచిది.

7. ఒక వేళ నేలలో సున్నం శాతం అధికంగా ఉంటే జిప్సానికి ప్రత్యామ్నాయంగా పైరైట్‌ను లేదా పొడి చేసిన గంధకాన్ని వాడవచ్చును. పైరైట్‌ను 5 మిల్లీ మీటర్ల కన్న తక్కువ గుళికల పరిమాణంలో ఉండాలి.

8. చెరకు ఫ్యాక్టరీల నుండి లభించే వ్యర్థ పదార్థమైన ప్రెస్‌మడ్‌ను కూడా జిప్సంకు బదులుగా వాడుకోవచ్చును. దీనిని హెక్టారుకు 2-3 టన్నుల వేయాలి.

పైన తెలిపిన పద్ధతుల ద్వారా నేలలను బాగు చేసిన తర్వాత క్రింది పద్ధతుల ద్వారా నేలను బాగు చేసుకోవాలి.

9. జీలుగను పచ్చిరొట్ట పైరుగా వేసి పూత దశలో నేలలో కలియదున్నాలి.

10. బాగా నీరు పెట్టి రెండు వారాలు మురగనిచ్చి నీటిని తీసివేయాలి.

11. మొదటి పంటగా వరి నాటుకోవాలి.

12. రసాయనక ఎరువులు సాధారణంగా వేసి దీనికన్న 25 శాతం అధికంగా వాడాలి.

13. నారు చిక్కగా నాటి తగినన్ని మొక్కలు ఉండేటట్లుగా చూసుకోవాలి.

14. ఈ నేలల్లో లేత నారుకన్న ముదురు నారు చక్కగా నిలదొక్కుకుంటుంది.

15. పొలానికి నీరు పలుచగా ఎక్కువసార్లు పెట్టడం మంచిది.

16. ఎకరానికి 20 కిలోల జింక్ సల్ఫేట్ వేయాలి.

17. సాధారణంగా వాడే రసాయనిక ఎరువులన్నీ వాడుకోవచ్చును.

18. కారుచౌడును తట్టుకునే పంటలు వేసుకొని మంచి యాజమాన్య పద్ధతులు పాటించి నట్లయితే ఆశించిన దిగుబడులు సాధించవచ్చును.

పట్టిక : ఉదజని సూచిక ఆధారంగా వేయవలసిన జిప్సం మోతాదును క్రింది పట్టికలో తెలుసుకోవచ్చును.

| ఉదజని సూచిక | వేయాల్సిన జిప్సం(ట./ఎ.) తేలిక నేలలు | మధ్యస్థ నేలలు | బరువు నేలలు |
|---|---|---|---|
| - | | | |
| 8.7 | - | - | 0.8 |
| 9.0 | 0.6 | 1.2 | 1.8 |
| 9.4 | 1.6 | 2.8 | 4.0 |
| 9.8 | 2.8 | 4.4 | 5.6 |
| 10.0 | 3.4 | 5.2 | 6.0 |

1. నేలను బాగా చదును చేసి సుమారు 20-25 సెంట్లు మడులుగా విభజించి మంచిగా గట్టు వేసుకోవాలి.

2. తర్వాత బాగా పొడి చేసిన జిప్సంను నేలపై సుమారుగా పడేటట్లు చల్లి, దున్ని నీరుపెట్టి ఇంకేటట్లు చేయాలి.

3. మొదట నీరు ఇంకడం నెమ్మదిగా నెమ్మదిగా ఉంటుంది. ఈ విధంగా 3-4 సార్లు నీరుపెట్టి ఇంకించిన 3-4 రోజుల తర్వాత చివరిగా నీటిని అధికంగా పెట్టి దమ్ము చేసి, తేరనిచ్చి మరునాడు మురుగు కాల్వల ద్వారా నీటిని తీసి వేయాలి.

4. జిప్సం నీటిలో చాలా తక్కువగా కరుగుతుంది. కావున ఎక్కువ నీరు అవసరం. (2.5 గ్రా./లీటరు నీటికి), జిప్సంను 15-20 సెం.మీ. లోతు వరకు, విత్తడానికి ముందు వేసి భూమిలో బాగా కలియదున్నాలి.

5. భూసార పరీక్ష అందుబాటులో లేనట్లయితే హెక్టారుకు 3-4 టన్నుల జిప్సంను వేయాలి.

6. పైన చెప్పిన పద్ధతి ప్రకారం 3 సం॥ చేస్తే నల్లచౌడు సోడియం మార్పిడి శాతాన్ని చాలా వరకు తగ్గించవచ్చును.

**చౌడు భూములకు సంబంధించిన సాధారణ సూచనలు**

1. నేలలో చౌడు ఏ రకమైనదో తెలుసుకోవడానికి మట్టి నమూనాలను పరీక్షించాలి. ఎండాకాలంలో మట్టి నమూనాలు సేకరిస్తే చౌడు ఖచ్చితంగా నిర్ధారించవచ్చును. నేల పైభాగం నుండి 6 అంగుళాల వరకు ఒక నమూనా, 6 నుండి 12 అంగుళాల వరకు ఒక నమూనా తీసి పంపడం వలన తీవ్రత గుర్తించడానికి సరైన అవగాహన కలుగుతుంది.

2. ఒకసారి చౌడు భూములు బాగు చేసిన తర్వాత అందులో వరుసగా పంటలు వేయాలి. పొలాన్ని ఖాళీగా ఉంచకూడదు.

3. ప్రతి రెండు సంవత్సరాలకు ఒకసారి మట్టి నమూనాలను తీసి పరీక్షకు పంపి మార్పులు గమనిస్తూ తగిన జాగ్రత్తలు తీసుకుని, మేలైన సాగు పద్ధతులు పాటించాలి.

4. మురుగు నీరు పోవు సౌకర్యం తగినంతగా లేకపోతే బాగు చేసిన భూములు మరల చౌడు భూములుగా మారే ప్రమాదం ఉంది.

5. సాగునీటి వసతులున్నపుడే చౌడు భూములను సమర్థవంతంగా బాగు చేసుకోవడం వీలవుతుంది. నీటి వసతి లేనపుడు సంవత్సరం సగటు వర్షపాతం 850 మి.మీ కన్న ఎక్కువ గల ప్రాంతాలలో జిప్సం వాడవచ్చును. మే నెల నుండి ఆగస్టు వరకు ఆయా ప్రాంతాల్లో వర్షాలు కురిసే సమయంలో నేలలో తగినంత తేమ ఉన్నప్పుడు జిప్సం వేసి బాగు చేసుకోవచ్చును.

6. పాల చౌడు, భూములకు జిప్సం వేయనవసరం లేదు. కారు చౌడు మరియు ఉప్పుచౌడు నేలలకు మాత్రమే వేయాలి.

7. జిప్సం జిల్లాలోని ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర కో-ఆపరేటివ్ మార్కెట్లో ఫెడరేషన్- ద్వారా లభ్యమవు తుంది. టన్ను ధర రు. 350-400 మధ్యలో ఉంది. వివరాలకు దగ్గరలో ఉన్న వ్యవసాయ మార్కెట్ కమిటీని కాని, వ్యవసాయాధికారిని కాని సంప్రదించ వచ్చును.



# వ్యవసాయానికి కేంద్ర బడ్జెట్ భద్రత కలిగించగలదా?

 డా॥ అరిబండి ప్రసాద రావు, హైదరాబాద్

ఇప్పటికీ మనదేశ జనాభాలో మూడింట రెండువంతులకు వ్యవసాయమే జీవనాధారం. అయితే, దేశ స్థూల ఆదాయంలో వీరివాటా 2003 - 04లో 21 శాతామే అని ఆర్థిక సర్వేలో కేంద్ర ఆర్థిక శాఖ తెలియజేసింది. అందువల్ల, వ్యవసాయాభివృద్ధి, వ్యవసాయమే జీవనాధారంగా వున్న ప్రజల అభివృద్ధే తమ ప్రధాన లక్ష్యమని ప్రకటించారు. వ్యవసాయం రాష్ట్ర అంశం కాబట్టి, వ్యవసాయాభివృద్ధికి ప్రధాన పెట్టుబడులు రాష్ట్ర ప్రభుత్వాల నుండే వస్తుందని, అందువల్ల, కేంద్ర పెట్టుబడి రాష్ట్ర ప్రభుత్వాలకు మద్దతుగా, ప్రోత్సహించే రీతిలో వుంటుందని కేంద్ర ఆర్థికమంత్రి తెలిపారు. సరళీకరణ, ప్రైవేటీకరణ, ప్రపంచీకరణ విధానాలవల్ల వ్యవసాయం ఎన్నో సమస్యలతో సంక్షోభంలో పడి, రైతులు ఎన్నో కష్టాలను ఎదుర్కొంటున్నారు. అప్పుభారాలతో దిక్కుతోచని కొంతమంది రైతులు ఆత్మహత్యలు చేసుకుంటున్నారు. ఈ నేపథ్యంలో, కేంద్ర ప్రభుత్వ కొత్త బడ్జెట్ రైతుల ఆత్మహత్యలను నివారించి, వారి జీవనానికి ఏమైనా భద్రత కలిగించ గలదా అంశాన్ని పరిశీలిద్దాం.




**విధానాలే కీలక పెట్టుబడులు**

వ్యవసాయరంగం రాష్ట్ర అంశం కాబట్టి, కేంద్ర పెట్టుబడి రాష్ట్ర వ్యవసాయ పెట్టుబడులకు కేవలం మద్ధతుగా, ప్రోత్సాహకంగా వుంటుందనే అంశం పూర్తి వాస్తవాలను ప్రతిబింబించడం లేదు. వ్యవసాయాభివృద్ధిని, రైతాంగ బాగోగులను నిర్ణయించే దానిలో ప్రభుత్వ విధానాలే అత్యంత కీలక పెట్టుబడిగా పనిచేస్తాయి. ఇలా చేస్తున్నాయి కూడా. ముఖ్యంగా వ్యవసాయాభివృద్ధి వ్యూహం, భూసంస్కరణలు, వాణిజ్య విధానం, ముఖ్యంగా ఎగుమతి - దిగుమతి విధానాలు, ద్రవ్యవిధానం, పారిశ్రామిక, వ్యవసాయోత్పత్తుల ధరలసరళి, వ్యవసాయానికి సంబంధించిన వివిధ పరిశ్రమలకు ఇచ్చే ప్రోత్సాహకాలు, మార్కెట్ నియంత్రణ అంశాలు, ప్రజల ఆదాయాలను, స్థితిగతులను ప్రభావితం చేసే అన్ని ప్రభుత్వ నిర్ణయాలు వ్యవసాయరంగాన్ని నేరుగా నియంత్రిస్తాయి. అందువల్ల, ప్రస్తుతం కొనసాగుతున్న వ్యవసాయ సంక్షోభంలో కేంద్ర ప్రభుత్వం విధానాల పాత్రే ప్రముఖంగా వుంటుంది. ఈ విషయాలన్నింటిని మభ్యపెటి, వ్యవసాయాభివృద్ధికి, రైతాంగ బాగోగులను రాష్ట్ర ప్రభుత్వాలపై నెట్టి, కేంద్ర ప్రభుత్వం ఏదో ఉదారంగా, దయతో వ్యవసాయాభివృద్ధికి బడ్జెట్ మద్దతు ఇస్తున్నట్లు ఆర్థిక మంత్రి ప్రసంగించడం వాస్తవాలను మభ్యపెట్టటమే. తన విధానాల దుష్ఫలితాలకు స్వయంగా భాధ్యత వహించకుండా, ఇతరులను బలిపశువులుగా చేయడమే అవుతుంది. వ్యవసాయాభివృద్ధికి కార్పొరేటీకరణకై చేపట్టిన విధానంవల్ల నేడు సేద్యంలో రైతుమనుగడనే ప్రశ్నార్థకంగా మార్చింది. అందువల్ల, కేంద్ర ప్రభుత్వం రైతాంగ భద్రతను చేకూర్చటానికి తన వ్యవసాయ విధానాన్ని, ప్రభుత్వ విధానాలను ఇప్పటివరకూ వచ్చిన అనుభవాలను దృష్టిలో వుంచుకొని, పున:పరిశీలించి, మార్చాల్సిన అవసరంవున్నది. ఈ మార్పు చేయకుండా, కేవలం బడ్జెట్ కేటాయింపు పెంచి వ్యవసాయసంక్షోభాన్ని అధిగమించి, వ్యవసాయదారులకు భద్రత కలిగించవచ్చుని భావించడం అత్యాశే అవుతుంది. కేవలం కేటాయింపులు పెంచితే సరిపోదు. ఆయా రంగాలకు ఎంత శాతం కేటాయించారనే దాన్ని పరిశీలించాలి.

**పెంచిన వ్యవసాయ రుణసౌకర్యం రైతులకు అందుతుందా?**

కొత్త ప్రభుత్వం అధికారంలోకి రాగానే మూడేళ్ళలో సంస్థాగత రుణసౌకర్యం రెట్టింపు చేస్తానని వాగ్దానం చేసింది. ఈ మేరకు గత సంవత్సరం రూ. 1,05,000 కోట్లు రుణసౌకర్యం ప్రకటించింది. దీనిని మించి దాదాపు రూ. 1,08,000 కోట్ల రుణసౌకర్యం ఇప్పటికే అందించిందట. 2005-06లో ఈ సౌకర్యాన్ని 30 శాతం పెంచుతానని బడ్జెట్‌లో ప్రకటించింది. అంటే, ఈ రుణాన్ని దాదాపు రూ. 1,40,400 కోట్లకు పెంచటానికి ప్రతిపాదించింది. అయితే, ఇప్పటికే పెంచానని చెప్తున్న రుణసౌకర్యంవల్ల ఆంధ్రప్రదేశ్ రైతాంగం అంతగా లాభం పొందలేదని తెలుస్తుంది. దీనికి ప్రధాన కారణం ఈ పెంచామని చెప్తున్న రుణంలో ఎక్కువ భాగం ఎకౌంట్ పుస్తకాలలో పాత అప్పు చెల్లించినట్లు, తిరిగి వారికి కొత్తగా అప్పు

## బడ్జెట్‌లో వ్యవసాయరంగం

**గ్రామీణ విజ్ఞాన కేంద్రాలు**

దేశవ్యాప్తంగా 100 కోట్ల రూపాయలతో గ్రామీణ విజ్ఞాన కేంద్రాలను ఏర్పాటు చేస్తారు. దీనికి మిషన్-2007 అని పేరుపెట్టారు. 2007 నాటికి ప్రతి పల్లెలోను నెలకొల్పాలని లక్ష్యంగా పెట్టుకున్నారు.

**గ్రామీణాభివృద్ధి**

2004-05 లో గ్రామీణాభివృద్ధికి 13,885 కోట్ల రూపాయలు కేటాయిస్తే, ఈసారి 33 శాతం పెంచి 18,353 కోట్లు చేసారు. గ్రామీణ మౌళిక వసతుల అభివృద్ధి నిధిని ఏర్పాటు చేసి ఏటా 8 వేల కోట్ల రూపాయలు వెచ్చిస్తారు.

**భారత్ నిర్మాణ్**

త్రాగునీరు, సాగునీరు, రహదారులు, గృహనిర్మాణం, విద్యుదీకరణ, టెలిఫోన్ తదితర సౌకర్యాలతో గ్రామాలను అభివృద్ధి చేస్తారు. ప్రైవేట్ భాగస్వామ్యంతో 2009 నాటికి సాధిస్తామని పేర్కొన్నారు.

**జాతీయ గ్రామీణ ఉపాధి హామీ పథకం**

జాతీయ పనికి ఆహార పథకాన్ని జాతీయ గ్రామీణ ఉపాధి హామీ పథకంగా పేరు మార్చారు. 2005-06లో రు.5400 కోట్లను, 50లక్షల టన్నుల ఆహార ధాన్యాలను కేటాయించారు.

ఇచ్చినట్లు చూపించటమే. కొత్తగా 58.2 లక్షల రైతులకు అప్పు ఇచ్చినట్లు తెలిపారు. చిన్న సన్నకారు రైతుల వాటా ఏమాత్రం పెరుగలేదు. ఏ కౌలురైతుకు సంస్థాగత రుణం అందలేదు. అయితే, వ్యవసాయం పేరుతో కొంతమందికి అదనపు రుణసౌకర్యం అందివుండవచ్చు. పెట్టుబడులకు పేదరైతులు ప్రైవేటు వ్యాపారస్తుల మీద ఆధారపడడం ఏమాత్రం తగ్గలేదు.

### బడ్జెట్‌లో దేనికెంత?

| రంగం | కేటాయింపు(కోట్లలో) |
|---|---|
| వ్యవసాయ రుణం | 1,08,500 |
| గ్రామీణాభివృద్ధి | 18,334 |
| జాతీయ గ్రామీణఉపాధి హామీపథకం | 11,000 |
| గ్రామీణ విద్యుద్దీకరణ | 11.000 |
| గ్రామీణ మౌళిక సదుపాయల అభివృద్ధి | 8,000 |
| సత్వర నీటిపారుదల కార్యక్రమం | 4,800 |
| రాజీవ్‌గాంధీ జాతీయ త్రాగునీరు | 4,750 |
| జాతీయ పండ్ల తోటల మిషన్ | 630 |
| బిందు సేద్యం | 400 |

#### పునరుజ్జీవం చేయాల్సిన సహకారవ్యవస్థ

ఇప్పటికే అన్యవ్యస్థంగా సహకారవ్యవస్థ మారింది. వ్యవసాయరంగ సంక్షోభ నివారణలో సహకారరంగపాత్ర ఎంతోవుంది. దీన్ని ఆధ్యయనం చేసి తగిన సూచనలు ఇవ్వడానికి ఒక ప్రత్యేక బృందాన్ని ఏర్పాటుచేశారు. పారుబకాయిలను తీసివేయటానికి, ఈ సంఘాల మూలధన పటిష్టతకు, సహకార సంఘాల పునర్వ్యవస్థీకరణకు చట్టంలో మార్పులకు ఈ అధ్యయన బృందం సూచనలు చేసిందని. ఈ నివేదికను అంగీకరించినట్లు బడ్జెట్ ప్రసంగంలో తెలిపారు. రాష్ట్ర ప్రభుత్వాలతో చర్చల అనంతరం తగిన చర్యలు తీసుకుంటామని వాగ్దానం చేశారు. కాని, దీనికై ఏ బడ్జెట్ కెటాయింపు చేయలేదు.

#### తగ్గిన ఎరువుల సరఫరా

2004-05లో ఎరువుల సరఫరా తగ్గింది. ముఖ్యంగా యూరియా కొరతవల్ల రైతులు తిరిగి ఇబ్బందులు పడుతున్నారు. చాలా రాష్ట్రాలలో యూరియా, డి. ఎ. పి., సూపర్ ఫాస్ఫేట్, పొటాష్ ఎరువుల కొరత వచ్చిందని మంత్రిగారు చెప్పారు. అయినా, ఈ సంవత్సరం ఎరువుల సబ్సిడీ రూ. 12,662 కోట్లనుండి దాదాపు రూ. 17,000 కోట్లకు పెరిగింది. దీనికి ప్రధాన కారణం ఎరువుల తయారీలో పెరిగిన ముడిపదార్థాల ధరలే. సూపర్ ధర ఇంకా పెరిగింది. దీనికి కారణం 2002లో టన్నుకు రూ. 650 ఇచ్చిన సబ్సిడీని పెంచకుండా ఉండడమే. 2002-05 మధ్యకాలంలో ఈ తయారికి అవసరమైన రాక్‌ఫాస్ఫేట్ ధర టన్నుకు రూ. 1900 నుండి రూ. 2500 వరకు పెరగడమే. అయితే, ఈ ఎరువుల ధరను ఇప్పటి వరకూ రాష్ట్ర ప్రభుత్వాలే నిర్ణయిస్తున్నాయి. కేంద్ర ప్రభుత్వం సబ్సిడీని నిర్ణయిస్తుంది. ఇకముందు దీని ధరను కూడా కేంద్ర ప్రభుత్వమే నిర్ణయించాలని ప్రతిపాదించింది.

#### నామమాత్రపు ఇరిగేషన్ కేటాయింపు

వచ్చే 5 ఏళ్ళలో ఒక కోటి హెక్టార్లకు నీటి సౌకర్యాన్ని విస్తరించాలని బడ్జెట్‌లో చెప్పారు. దేశంలో ఇరిగేషన్ సౌకర్యాలను విస్తరించడానికి ప్రాధాన్యత ఇవ్వబడింది. కాని, ఈ విస్తరణ బాధ్యత వనరుల కొరతను ఎదుర్కొంటున్న రాష్ట్రాల మీదనే పడింది. కేంద్ర కేటాయింపులు నామమాత్రంగా వున్నాయి. గత సంవత్సరం నిరుపయోగంగా వున్న జలాశయాలను తిరిగి వాడుకలోకి తీసుకురావడాకి ఒక జాతీయ ప్రాజెక్టు స్కీంను ప్రకటించింది. 9 రాష్ట్రాలలోని 16 జిల్లాలలో 700 జలాశయాలను అభివృద్ధి పరచి 20,000 హెక్టార్లకు అదనపు నీటి సౌకర్యం కలిగించటం దీనిఉద్దేశం. అయితే ఈ స్కీంను మార్చి, 2005 లోనే ప్రారంబిస్తారట. 2005-06లో ఈ కేటాయింపును రూ. 100 కోట్లకు పెంచుతారట. ఇక ఇరిగేషన్ ప్రాజెక్టుల నిర్మాణాన్ని వేగం చేసి లాభాలు పొందడానికి 2004-05లో రూ. 2,800 కోట్లను కేటాయించారు. కొత్త బడ్జెట్‌లో దీన్ని రూ. 4,800 కోట్లకు పెంచారు. దీనిలో గత సంవత్సరం ఏమేర ఖర్చు పెట్టింది వివరాలు అందుబాటులో లేవు.

సాగునీటి వినియోగసామర్థ్యం పెంచటంలో సూక్ష్మ నీటిసాగు పద్ధతి ఎంతో ఉపయోగపడుతుంది. ఇంతవరకూ దాదాపు 12 లక్షల హెక్టార్లలో దీనిద్వారా సేద్యం చేస్తున్నారు. 10వ ప్రణాళికా అంతానికి ఈ విస్తీర్ణాన్ని 30 లక్షల హెక్టార్లకు 11వ ప్రణాళికా అంతానికి 140 లక్షల హెక్టార్లకు పెంచాలని ప్రతిపాదించారు. అయితే, 2005-06లో కేటాయించిన బడ్జెట్ రూ. 400 కోట్లు మాత్రమే. ఈ కెటాయింపు నిర్దేశించిన లక్ష్యాన్ని సాధించటానికి ఏ మాత్రం సరిపోదు.

#### పంటల బీమాపథకం

పంటల భీమాపథకం ప్రయోగాలతోనే నడుస్తుంది. కష్టకాలంలో రైతులకు ఇది అంతగా ఉపయోగపడడంలేదు. రైతులకు సహాయకారిగా ఉండేలా తగుమార్పులు చేసేందుకు సంబంధించిన వారితో చర్చలు జరుపుతామని తెలిపారు. అందువల్ల 2005 - 06లో ఇప్పటికే అమలులో వున్న జాతీయ పంటల భీమాపథకాన్నే కొనసాగిస్తామని చెప్పారు. అందువల్ల, పంటల భీమాపథకం ద్వారా రైతులకు ఏ అదనపు సహాయము లభించదు.

#### గిట్టుబాటు ధరలు

ఇవి రైతులకు మిధ్యగానే మారాయి. అయితే, ధాన్యం కనీస మద్ధతుధర పెరుగుతున్న వ్యవసాయఖర్చులకు అనుగుణంగా పెరగటంలేదు. పంటల కోత తరుణంలో ధరలు బాగా పడిపోతున్నాయి. ఇక నుంచి కనీస మద్ధతుధరను లెక్కించేటప్పుడు కేవలం డబ్బురూపేణా, వస్తురూపేణా, రైతుకుటుంబ సభ్యుల ప్రత్యక్ష శ్రమను మాత్రమే లెక్కించాలని తెలిపారు. దీనివల్ల రైతుల ఆదాయానికిచ్చే కనీస మద్ధతు తగ్గిపోతుంది. ఇది చాలదన్నట్లు వ్యవసాయోత్పత్తుల మార్కెట్ మౌలిక సౌకర్యాలను మార్పు చేయాలని ప్రభుత్వం ప్రతిపాదించింది. దీని ప్రధాన లక్ష్యం వ్యవసాయ మార్కెట్లలో ప్రైవేట్ పెట్టుబడులను అకర్షించడమేనని చెప్పబడింది. ఈ సందర్భంలో నాబార్డ్, జాతీయ సహకార అభివృద్ధి కార్పొరేషన్‌ల ద్వారా వ్యవసాయోత్పత్తుల మార్కెటింగ్ చట్టాన్ని సవరించిన రాష్ట్రాలకు మాత్రమే సహాయమందించేందుకు ఒక స్కీంను ఏర్పాటు చేసినట్లు ప్రకటించారు. అయితే, దీనికై కేటాయించింది నామమాత్రంగా రూ. 72 కోట్లు మాత్రమే. ప్రభుత్వసంస్థలు కూడా గతంలోలాగా టోకు మార్కెట్‌లో రైతుల నుండి వ్యవసాయోత్పత్తులను కొనడంలేదు. అంటే ఇక మార్కెట్ కొనుగోళ్ళలో ప్రైవేట్ శావుకార్లదే పూర్తి ఆధిపత్యం వహిస్తుంది. వీరి ఆధ్వర్యంలో రైతులకు జరిగే న్యాయం (అన్యాయం) గురించి ప్రత్యేకంగా చెప్పవల్సినపనిలేదు.

#### తగ్గుతున్న ఎగుమతులు - పెరుగుతున్న దిగుమతులు, మెట్ట ప్రాంతరైతులపై భారం

విదేశీ వాణిజ్యంపై ఆంక్షలను ఎత్తివేసిన తరువాత వ్యవసాయోత్పత్తుల దిగుమతుల వేగం పెరుగుతున్నాయి. కారణాలు ఏమైనప్పటికీ, 1 ఏప్రిల్, 2000 నుండి దాదాపు సగం, ఆ తరువాత ఇంకో సంవత్సరానికి వ్యవసాయోత్పత్తుల దిగుమతుల పరిమాణాలపై

ఉన్న అన్ని ఆంక్షలను ఎత్తివేసింది. ఆ తరువాత 300 సున్నిత పురకాల వస్తువు(సెన్సిటివ్ ఐటమ్స్)ల దిగుమతుల పరిమాణాలను కేంద్ర ప్రభుత్వం జాగ్రత్తగా పర్యవేక్షిస్తుంది. ఆంక్షలను ఎత్తివేసిన తరువాత భయపడినట్లుగా మన వ్యవసాయోత్పత్తులు దిగుమతులు పెరగలేదని ప్రభుత్వం చెబుతుంది. అయితే, గణాంకాలు వేరేవిధంగా వున్నాయి.

2000-01లో కేవలం 1858 మిలియన్ డాలర్ల విలువైన దిగుమతులు కాగా 2003 ఏప్రిల్ - 2004 ఫిబ్రవరి మధ్య కాలంలో అవి 3282 మిలియన్ డాలర్లుకు పెరిగాయి. కేవలం ఒక సంవత్సరం పది నెలల కాలంలో దిగుమతులు 1424 మిలియన్ డాలర్ల మేర, అంటే 76.6 శాతం పెరిగాయి. ఈ కాలంలో ఎగుమతులు 6004 నుండి 6506 మిలియన్ డాలర్ల వరకు మాత్రమే పెరిగాయి. అంటే పెరిగింది 8.4 శాతం మాత్రమే. ఎగుమతి - దిగుమతుల నిష్పత్తి 2000-01లో 3.23 కాగా, ఇది 2001-02, 2002-03, 2003 ఏప్రిల్ - 2004 ఫిబ్రవరి మధ్య కాలంలో వరుసగా 2.57, 2.40, 1.98 కి తగ్గిపోయింది. ఈ గణాంకాలన్ని ఎగుమతుల కన్న దిగుమతులు చాలా వేగంగా పెరుగుతున్నట్లు సూచిస్తున్నాయి. ఇది ఆందోళన కల్గించే విషయం. ప్రభుత్వం ఈ విషయాల్ని మధ్యపెట్టి, ఆంక్షలను ఎత్తివేసినందువల్ల ఆందోళన చెందే స్థాయిలో దిగుమతులు పెరగలేదని ప్రచారం చేస్తుంది.

ఈ పెరిగిన దిగుమతులు కొన్ని పంటలలో చాలా ఎక్కువగా ఉన్నాయి. 2002-03లో అంతకు ముందు సంవత్సరం కన్నా దిగుమతులు వేగంగా పెరిగాయి. ఈ కాలంలో వంట నూనెలు 24 శాతం, ఆహార ధాన్యాలు 20 శాతం, ముడిపత్తి, కాటన్‌వేస్ట్ 50 శాతం దిగుమతులు పెరిగాయి. 2000-01లో అంతకు ముందు సంవత్సరం కన్నా (ఇది దిగుమతి పరిమాణాలపై ఆంక్షలు ఎత్తివేసిన మొదటి సంవత్సరం) పప్పు ధాన్యాలు 32 శాతం, టీ 54 శాతం, తోళ్ళు 28.4 శాతం, పత్తి బట్టలు 24 శాతం, పండ్లు ఇతర నట్స్ 29 శాతం పెరిగాయి. ఫలితంగా, స్థానిక ఉత్పత్తిదారులు మార్కెట్ ధరలు తగ్గి నష్టపోయారు.

ఈ పెరిగిన దిగుమతులు ప్రధానంగా మెట్ట ప్రాంతాల పంటలే. వీనిలో దాదాపు మూడింట రెండొంతులపైగా వంటనూనెలే వున్నాయి. 2003 ఏప్రిల్ - 2004 ఫిబ్రవరి మధ్యకాలంలో వ్యవసాయోత్పత్తుల దిగుమతులలో వంటనూనెలు 71 శాతం పైగా వున్నాయి. దీనివల్ల వేరుశనగ, పొద్దుతిరుగుడు, సోయరైతులు ధరలు తగ్గి ఆదాయం కోల్పోతున్నారు. వీనితరువాత పప్పుధాన్యాల దిగుమతులు 2వ స్థానంలో వున్నాయి (13.7 శాతం). పండ్లు ఇతర నట్స్ దాదాపు 6.5 శాతం వున్నాయి. ప్రపంచీకరణ నేపథ్యంలో మెట్ట ప్రాంతాల్లో పండ్లతోటలు, కూరగాయలు, పూల ఉత్పత్తిని బావుల కింద పెద్ద ఎత్తున ప్రోత్సహిస్తుంది. అంటే మొత్తం దిగుమతుల్లో 91 శాతం పైగా మెట్ట ప్రాంతరైతులకు సంబంధించినవే. అందువల్ల, మెట్ట ప్రాంతరైతులు నష్టపోతు కోలుకోలేని సంక్షోభంలో కూరుకుపోతున్నారు.

**దిగుమతుల సుంకాలను పెంచాలి**

ప్రపంచ వాణిజ్య సంస్థ నియమ నిబంధనలవల్ల ఇక సుంకాలు పెంచి మాత్రమే దిగుమతులను నియంత్రించగలం. అయితే, ప్రభుత్వం ఇప్పటికే ఈ శక్తిని వినియోగిస్తుంది. మార్చి, 2004 నాటికి వడ్లు, బియ్యం, జొన్న, ఇతర త్రుణ ధాన్యాలు, కాఫీ, ఆపిల్స్, ఎల్లిపాయలు, పాలపొడి, అరికానట్, సోయా వంట నూనె, ఆవనూనె, ఆముదాలు, వాని నూనె, వంటకు వాడని ఇతర నూనెలపై నిబంధనలు అనుమతించిన మేరకు దిగుమతి సుంకాలను గరిష్ఠంగా విధిస్తుంది. ఇక ఈ ఉత్పత్తుల దిగుమతులను సుంకాలను పెంచడం ద్వారా నియంత్రించే శక్తిని ప్రభుత్వం పూర్తిగా కోల్పోయింది. టీ, గోధుమ, ఆలుగడ్డల పిండి, వెన్న, నెయ్యిలాంటి పాల ఉత్పత్తులు, లవంగాలు, చికెన్ ఉత్పత్తులు, హామ్ (ప్రోసెస్డ్ పంది మాంసం ఉత్పత్తి), సూజి, కొబ్బరి, కొబ్బరి నూనెలపై పన్నులు పెంచి నియంత్రించే శక్తిని దాదాపు 70-75 శాతం మేర కోల్పోయింది. నూనెగింజల మొక్కలు, విత్తనాలు, కూరగాయల విత్తనాలు, గోధుమల దిగుమతులను నియంత్రించే శక్తి సగం మేర కోల్పోయింది. వేగంగా పెరుగుతున్న దిగుమతుల నేపథ్యంలో వీని, పెరుగుతున్న దిగుమతులను నియంత్రణ చేయకుండా రైతుల ప్రయోజనాలను ఎలా కాపాడగలం? రైతుల భవిష్యత్ ఏమిటి? ఇవి చాలా బాధాకరమైన ప్రశ్నలు. దిగుమతుల నియంత్రణకు, ఈ రైతుల ప్రయోజనాలను కాపాడటానికి ప్రత్యామ్నాయరూపంలో మద్దతు అందించకుంటే సేద్యం ద్వారా వీరు జీవనం కొనసాగించే స్థితిలో లేరు. వీరిని ఆదుకోడానికి దిగుమతి సుంకాల ద్వారా వచ్చే ఆదాయంతో ఏ ప్రత్యేక పథకాలను బడ్జెట్‌లో పెట్టలేదు. ఈ రైతులు ప్రత్యేక సహాయ పథకాలు లేకుండా సేద్యంలో మనుగడ సాగించలేరు. ☆

## అమెరికా ఓటమి

పత్తి సబ్సిడీలకు సంబంధించిన కేసులో అమెరికా ఓడిపోయింది. బ్రెజిల్ విజయం సాధించింది. డబ్ల్యూటీఓ అప్పిలేట్ కోర్టు అమెరికాకు మింగుడు పడని తీర్పును ఇచ్చింది. అమెరికా ఆ దేశంలోని పత్తి రైతులకు పరిమితులకు మించి సబ్సిడీలు ఇస్తోందని, ఎగుమతి రుణాల విషయంలోనూ డబ్ల్యూటీఓ నిబంధనలను ఉల్లంఘిస్తోందని బ్రెజిల్ ఈ కేసులో సమర్థంగా తన వాదనలను కోర్టు ముందు వుంచింది. అయితే సబ్సిడీల విషయంలో డబ్ల్యూటీఓకు లోబడే తాను వ్యవహరిస్తున్నాని అమెరికా వాదించింది.

అమెరికా తన రైతులకు భారీ మొత్తంలో ఇస్తున్న సబ్సిడీల వల్ల ప్రపంచవ్యాప్తంగా పత్తి ధరలు పడిపోతున్నాయన్న బ్రెజిల్ వాదనను కోర్టు సమర్థించింది. సబ్సిడీల మొత్తాన్ని తప్పుగా లెక్కించారని డబ్ల్యూటీఓ న్యాయమూర్తులు పేర్కొన్నారు. పత్తి సబ్సిడీల కేసులో అమెరికా విధానాన్ని నిరసిస్తూ బ్రెజిల్ మొదటగా ప్రపంచ వాణిజ్య సంస్థను ఆశ్రయించింది. అప్పట్లో బ్రెజిల్ పక్షాన తీర్పు వెలువడింది. దీన్ని డబ్ల్యూటీఓ అప్పిలేట్ కోర్టులో అమెరికా సవాలు చేసింది. ప్రపంచ వాణిజ్య సంస్థ దిగువ కోర్టు ఇచ్చిన తీర్పును అప్పిలేట్ సమర్థించింది. కోర్టు ఇచ్చిన తాజా తీర్పు ఒక్క బ్రెజిల్‌కే కాదు భారత్ వంటి వర్ధమాన దేశాలకు కూడా లబ్ధి చేకూరుతుందని విశ్లేషకుల అంచనా.

అమెరికా అనుసరిస్తున్న అహేతుక వ్యవసాయ విధానాలపై వర్ధమాన దేశాలు చాలాకాలం నుండే గగ్గోలు పెడుతున్నాయి. డబ్ల్యూటీఓలో సభ్యత్వం కలిగిన దేశాల్లో30 దేశాలు వర్ధమాన దేశాలే. త్వరలో సమావేశమై దోహా రౌండ్ సంప్రదింపులు ప్రారంభించిన తరుణంలో ఈ తీర్పు వెలువడటం అమెరికాకు చెంపదెబ్బ. అమెరికా ప్రభుత్వం అక్కడి పత్తి రైతులకు ఇస్తున్న భారీ సబ్సిడీలు అంతర్జాతీయ మార్కెట్‌లో వాణిజ్యంపై ప్రభావం చూపిస్తున్నాయి. అమెరికా చర్యతో ఆఫ్రికా, ఆసియా దేశాల్లోని వ్యవసాయరంగం సంక్షోభంలో పడుతున్నది. ఇప్పటికైనా మన ప్రభుత్వం బ్రెజిల్ అనుభవాన్ని దృష్టిలో పెట్టుకొని మన వ్యవసాయ రంగాన్ని కాపాడుకోవాల్సిన అవసరం ఎంతయినా వుంది.

# కాటన్ సీడ్ రైతుల పరిస్థితులు - పరిష్కార మార్గాలు

టి రామకృష్ణ, కార్యదర్శి, కర్నూలు జిల్లా రైతుసంఘం

గతంలో విత్తనాలను రైతు స్వంతంగా తయారు చేసుకొని పంటలు వేసుకొనే వాడు. క్రమేణా వ్యవసాయంలో మార్పులు వచ్చాయి. దేశవాళి విత్తన సంస్థలు అభివృద్ధి చెందాయి. కొత్త, కొత్త హైబ్రిడ్ వెరైటీస్‌ను తయారు చేశాయి. పంటల దిగుబడి పెరిగింది. ఇది వ్యవసాయ రంగంలో పెను మార్పులను సృష్టించింది.

ఈ నేపథ్యంలో బహుళజాతి విత్తన సంస్థలు దేశంలో ప్రవేశించడానికి ప్రభుత్వ విధానాలు దోహద పడ్డాయి. తద్వారా మన దేశ విత్తన కంపెనీలకు పోటీగా మాన్‌సాంటో లాంటి ఇతర దేశాల సంస్థలు ప్రవేశించాయి. ఫలితంగా మన దేశంలోని విత్తన సంస్థలను సహితం కబళిస్తున్నాయి. ఉదా. ప్యారీ మహేంద్ర, మహికో కంపెనీలను విదేశీ బహుళజాతి విత్తన సంస్థలు హస్తగతం చేసుకున్నాయి. ఈ విత్తన సంస్థలు ప్రధానంగా ప్రత్తి పంటపైన కేంద్రీకరించడం జరిగింది.



కర్నూలు కలెక్టరేట్ వద్ద ఆందోళన చేస్తున్న విత్తన రైతులు

**విత్తన కంపెనీలు అభివృద్ధి :**

కర్నూలు, మహబూబ్‌నగర్ జిల్లాల్లో కాటన్ సీడ్ తయారు చేయుటకు అనుకూల వాతావరణ పరిస్థితులు వున్నాయి. శీతోష్ణస్థితి సమతుల్యంగా ఉండటం వలన సరియైన దిగుబడులు రావడం జరుగుతున్నది. అంతేగాక కరువు పరిస్థితులు ఉండటం పేదరికంవల్ల వ్యవసాయ కూలీలు చౌకగా దొరకడం కూడా కలిసి వచ్చింది. అందువల్ల ప్రకాశం, గుంటూరు జిల్లాలలోని అనేక మంది రైతులు ఇక్కడకువచ్చి స్థిరపడ్డారు. విత్తన పరిశ్రమ అభివృద్ధి చెందింది. గత 10 ఏళ్ళ క్రిందట 5,6 కంపెనీలు ఉండగా ఇపుడు 30 కంపెనీలు జిల్లాలో పని చేస్తున్నాయి. ప్రకాశం, గుంటూరు జిల్లాల నుంచి ఇక్కడకు వచ్చిన రైతులు కొందరు నష్టపోయి తిరిగి వెళ్ళిపోయిన వారున్నారు. కొందరు రైతులుగా వచ్చి ఆర్గనైజర్లుగా మారి కంపెనీ యజమానుల స్థాయికి ఎదిగిన వారున్నారు. గుజరాత్, మధ్యప్రదేశ్ రాష్ట్రాలతోబాటు రాజస్తాన్ తదితర రాష్ట్రాలలో ప్రత్తి పంట విస్తారంగా పెరగడానికి దోహద పడుతున్నారు.

**బి.టి కాటన్ సీడ్ :**

దేశంలో బి.టి. కాటన్ పేరుతో మాన్‌శాంటో, మహికో కంపెనీలు రైతుల్లో ప్రచారం ముందుకు తీసుకొని రావడం జరిగింది. శనగ పచ్చ పురుగును నివారించడం జరుగుతుందని ప్రచారం చేయించడం వల్ల రైతులు ఆవైపు ఎక్కువ పంటలు వేయడం జరుగుతున్నది. మాన్‌శాంటో, మహికో కంపెనీలు ఇచ్చిన బి.టి. కాటన్ సీడ్ జిల్లాలలో కొంత మేరకు దెబ్బతీసింది. లోకల్ సీడ్ కంపెనీలు ఆవైపు కొంత ప్రయత్నించి రైతులలో ఆ విత్తనాలను ప్రవేశపెట్టగలిగారు.

**ఆర్గనైజర్ల వ్యవస్థ :**

జిల్లాలో కాటన్ సీడ్ పంట ప్రస్తుతం సుమారు 10 వేల ఎకరాలకే ఉన్నది. ప్రక్కనే ఉన్న మహబూబ్‌నగర్ జిల్లాలో కూడా అంతే విస్తీర్ణం ఉంది. కర్నూలు, మహబూబ్‌నగర్ జిల్లా సుమారు 5 వేల మంది రైతు కుటుంబాలు ఈ విత్తనాలు పండించి జీవిస్తున్నారు. కర్నూలు ప్రధాన కేంద్రంగా నూజివీడు, తులసీ అంకూర్, మహేంద్ర ప్రోతడ్, మహాగుజరాత్, ఎం.ఎస్.ఎస్. మైకో కంపెనీలతోబాటు చిన్న చిన్న కంపెనీలు 30 దాకా ఉన్నాయి. ఇక్కడే ప్రాసెసింగ్. గ్రేడింగ్ చేసుకోవడానికి వీలుగా జిన్నింగ్ ఫ్యాక్టరీలు ఉన్నాయి.

ఈ రైతులు కంపెనీలకు విత్తనాల ఉత్పత్తిపై ఒక రేటు నిర్ణయించుకొని పంటలు వేయడం పంటలు వచ్చిన తరువాత ఆ రేటుకు అమ్ముకోవడం జరుగుతుండేది. క్రమేణా సీడ్ రైతులకు పెట్టుబడులు ఎక్కువై ఇతర పెట్టే వ్యాపారాలపై ఆధారపడవలసి వచ్చింది. దీన్ని అవకాశంగా తీసుకొని ఈ రైతులలోనే కొందరు ఆర్గనైజర్లుగా మారారు. వారు స్వంతంగా రైతులకు పెట్టుబడులు ఇవ్వడం అవసరమయినపుడు కంపెనీల నుండి ఆర్గనైజర్ అప్పుతెచ్చుకొని ఆ అప్పును రైతులకు ఇచ్చి, వసూలు చేసే పద్ధతి మొదలయ్యింది. క్రమేణా రైతుకు కంపెనీకి వున్న డైరక్ట్ ఒప్పందం తగ్గిపోయింది. కంపెనీలు సహితం రైతులతో నేరుగా కాకుండా తసకు గ్యారంటీగా వసూలు చేసి ఇచ్చే వారు అవసరం కనుక ఆర్గనైజర్లను ఆశ్రయించారు. విత్తనాలు ఫెయిల్ అయినా, వాతావరణం సరిగా లేక పంటలు దెబ్బతిన్నా, అప్పు తిరిగి ఇవ్వలేని స్థితిలో రైతు వున్నపుడు కంపెనీ నష్టపోవాల్సి వస్తున్నది. ఆర్గనైజర్లు అయితే ఆ రిస్క్ కంపెనీలకు వుండదు. వీరే ఆ బాధ్యత తీసుకొని వసూలుచేసి ఇవ్వడానికి బాధ్యత తీసుకొని పనిచేస్తారు. అంతే కాకుండా రైతు మార్కెట్‌లో గిరాకీ వున్నపుడు మొత్తం పండించిన విత్తనాలను ఆ కంపెనీలకు ఇవ్వకుండా కొంత విత్తనాన్ని ఇతర కంపెనీలకు అమ్మే అవకాశం వున్నది. దీన్ని అరికట్టి ఆ రైతును కంట్రోల్ చేసి ఆ కంపెనీకే అమ్మేట్లు ఏర్పాటు చేయడానికి ఈ దళారి వ్యవస్థను విత్తన కంపెనీల వారు ప్రోత్సహించారు. అందువల్ల రైతుకు ఇచ్చే రేటులో కనీసం 10శాతం ఈ ఆర్గనైజర్లకు కమిషన్‌గా ఇవ్వడానికి సిద్ధపడ్డారు. అందువల్ల కర్నూలు, మ.నగర్ జిల్లాల్లో వున్న ఈ ఆర్గనైజర్ల వ్యవస్థ వేళ్లూనుకుంది.

రైతు అధిక పెట్టుబడికి సమకూర్చుకోలేకపోవడం, ఎకరాకు సుమారు 60 వేల నుండి లక్ష రూపాయల దాకా భారీ పెట్టుబడులు పెట్టవలసి రావడం, కంపెనీలు గాని, బ్యాంకులు గాని అప్పులు ఇవ్వడానికి ముందుకు రాకపోవడం వల్ల ఈ ఆర్గనైజర్లపైనే రైతు ఆధారపడాల్సి వస్తున్నది. ఒక దశలో ఈ ఆర్గనైజర్లు రైతులకు కంపెనీలకు సహాయకారిగా వుండేవారు. దీనివల్ల రైతులకు ప్రయోజనం అనే అభిప్రాయం వుండేది. క్రమేణా రైతుల నుంచి కంపెనీల

అనుకూలంగా మార్పు చెంది, వీరు కూడా చిన్న చిన్న కంపెనీలను పెట్టి రైతులతో నేరుగా కొనుగోలు చేయడమే గాక, రైతులకు సమస్యలు వచ్చినపుడు, రైతుల వెంట కాకుండా కంపెనీ యజమానులతో చేతులు కలిపి రైతాంగాన్ని దెబ్బతీసే స్తితికి చేరుకున్నారు. ప్రస్తుతం కంపెనీ, విత్తన రైతు మధ్య సంబంధాలు ఏర్పాటు తీసుకొని రాగలిగి, ఈ ఆర్గనైజర్లను తప్పిస్తే కొంతవరకు రైతుల ఆర్ధిక పరిస్థితి మెరుగు పడ్డానికి అవకాశం' వుంటుంది.

**విత్తనాలు కొనుగోలులో నష్టపోవడం**

సీడ్ రైతు ప్రధానంగా ఫౌండేషన్ సీడ్ కొరకు కంపెనీపై ఆధారపడవలసి వుంటుంది. ఆ సీడ్ రేటు 3500 నుండి రు.5వేల వరకు రైతు కొనుగోలు చేయవలసి వస్తున్నది. ఈ సీడు 1500 రూపాయలకు అమ్మినా కంపెనీ యజమానికి లాభం వుంటుంది. అయితే రైతుల్లో ఏర్పడిన అనైక్యతను ఆసరాగా తీసుకొని అధిక లాభాల కొరకు గిరాకిని బట్టి రేటు అమ్మడం జరుగుతుంది. అంతేగాక సీడ్ విత్తనం అమ్మేటపుడు కూడా స్థిరమైన రేటు లేదు. 450 గ్రాముల ప్యాకెట్ ధర కనీసం 450 రూపాయల నుండి 1600 రూపాయల వరకు అమ్మడం జరుగుతోంది. స్థిరమైన ఫిక్స్డ్ రేటు నిర్ణయించి రైతుకు విత్తనాలు అమ్మితే సీడ్ రైతుల నష్టాన్ని నివారించడానికి అవకాశం వున్నది.

ఇంతేగాక, విచిత్రమైన దోపిడీ అనాదిగా సీడ్ యజమానులు అవలంభిస్తున్నారు. రైతులు కూడా దీనిని అమలు జరుపుతున్నారు. రైతుల దగ్గర కంపెనీలు కొనుగోలు చేసేటపుడు 750 గ్రాముల ప్యాకెట్ క్రింద నిర్ణయిస్తారు. ఆ విధంగానే 44 పత్తిరకం అయితే 180 లు, రీసెర్చి వెరైటీ అయితే 215నుండి 225 వరకు రేటు నిర్ణయించి, 750 గ్రాముల ప్యాకెట్‌గా కొనుగోలు చేస్తారు. ఈ పత్తి ప్రోసెసింగ్, గ్రేడింగ్, ఇతరత్రా అన్ని రైతు తన స్వంత ఖర్చులేనే చేయించి కంపెనీకి ఇవ్వాలి. కంపెనీ కేవలం ప్యాకింగ్ ఖర్చు మాత్రమే భరిస్తుంది. అయితే ఆ కంపెనీ తిరిగి రైతుకు, విత్తనాలను సప్లయి చేసేటపుడు 450 గ్రాములు ప్యాకెట్‌ను తయారుచేసి అమ్మడం జరుగుతుంది. దీనివల్ల రైతు సుమారు 300 గ్రాముల విత్తనాలను నష్టపోతున్నాడు. ఈ 450 గ్రాముల ప్యాకెట్ ఎకరాకు విత్తడానికి తక్కువ అవుతుంది. కాబట్టి తరుగు అవసరం లేకపోయినా రెండు ప్యాకెట్‌లలో సుమారు 900 గ్రాములు కొనుగోలు చేయవలసి వస్తోంది. విత్తనాల రేటు రైతు ఇచ్చేటపుడు 750 గ్రాముల ప్యాకెట్‌కు 220 రూపాయలు కాగా, తిరిగి రైతుకు అమ్మేటపుడు 450 గ్రాముల ప్యాకెట్ ధర కనీసం 450ల నుండి పైననే అమ్ముతున్నారు. మైకోమన్‌సాంటో కంపెనీలు బిటి కాటన్ పేరుతో రైతుకిచ్చేది పైన ఉదహరింపబడిన 220రూపాయలవే. కానీ 450 గ్రాముల ప్యాకెట్‌ను, మార్కెట్‌లో 1600 రూపాయలకు అమ్ముతున్నారు. అందువలన రైతులు నిలువునా దోపిడికీ గురికావడమే కాకుండా, కంపెనీలు విపరీతమైన లాభాలు గడిస్తున్నాయి. ఇందులోంచి రేటు కొంతమేరకు పెంచినా రైతులను ఆదుకోవచ్చు.

**గ్రేడింగ్ విధానం**

రైతులనుండి సీడ్ పత్తి తీసుకొని వచ్చే నవీన పద్ధతులు వచ్చిన తరువాత ఆధునిక మిషిన్స్‌తో గ్రేడింగ్ చేయడం జరుగుతున్నది. గతంలో పుచ్చు విత్తనాలను ఏరివేసి మిగిలిన మంచి విత్తనాలను తీసుకొని రైతు దగ్గర కొనుగోలు చేసేవారు. ఇపుడు జల్లెడ పట్టడం జరుగుతున్నది. దీని వల్ల విత్తడానికి పనికి వచ్చే సన్న గింజలు సహితం ఆ జల్లెడలోంచి పోతున్నాయి. గ్రేడింగ్‌లో తీసివేసిన విత్తనాలు మార్కెట్‌లో కేవలం నూనె గింజల దాణాకు కేజి మూడు రూపాయలకు అమ్ముకోవలసి వస్తుంది. గ్రేడింగ్ కంపెనీల దగ్గరే వారికి వదిలివేయాల్సి వస్తుంది. గ్రేడింగ్ పద్ధతిలో ఇంత నిక్కచ్చిగా వ్యవహరించే కంపెనీలు అదే రేటు దగ్గరకు వచ్చేసరికి లాభాపేక్షతో పనిచేయడం తప్ప, కనీస మానవతా దృక్పధాన్ని అనుసరించడం లేదు.

**కల్తీ విత్తనాలు**

సీడ్ పండించే రైతులకు ఇచ్చే ఫౌండేషన్ సీడ్‌లో కల్తీ ఇవ్వడం జరుగుతుంది. కొన్ని కంపెనీలు తమ లాభాపేక్షతో ఇలాంటి అక్రమాలకు పాల్పడుతున్నారు. దీనివల్ల రైతులు తీవ్రంగా నష్టపోతున్నారు. విత్తన కంపెనీలు ప్రధానంగా సరైన టెక్నాలజి వుపయోగించి తయారు చేయాలి. వాతావరణ పరిస్థితులు, రైతులలో ఆ పంటకు కావలసిన అవగాహన పెంచే పద్ధతులు తదితర అంశాలను పరిగణలోకి తీసుకోవాలి. జిల్లాలో ఈ మధ్యకాలంలో అనేక మంది రైతులు కల్తీ విత్తనాల బారిన పడి తీవ్రంగా నష్టపోతున్నారు. ఉదాహరణకు జూపాడు బంగళా మండలం 80 బన్నూరు గ్రామంలో మహికో మన్‌సాంటో కంపెనీవారు ఇచ్చిన బిటి 12 రకం విత్తనం దిగుబడి కేవలం ఎకరానికి 3 క్వింటాళ్లలోపే వచ్చింది. ఆ రైతులందరూ ప్రభుత్వానికి ఫిర్యాదు చేసారు. వారు ఎం.డి.ఓ కమిటికి అప్పజెప్పారు. నంద్యాల శాస్త్రవేత్తలు పరిశీలించారు. వారు పరిశీలించే నాటికి పంట కాలం దాటిపోయింది. కాబట్టి కల్తీ విత్తనాల వల్ల జరిగిందని గ్యారంటీ చెప్పలేమన్నారు. దీని వల్ల రైతాంగం కలెక్టరేట్ దగ్గర ధర్నాలు చేయడంతో బాటు విత్తనాలు అమ్ముతున్న షాపులను నిరవధికంగా మూసివేయడం జరిగింది. అందువల్ల విత్తనం ఇచ్చిన కంపెనీలు గ్యారంటీ ఇవ్వవలసిన అవసరం ఎంతయినా వున్నది.

**కంపెనీలు- ఆర్గనైజర్లు, రైతులకు పెట్టే ఇబ్బందులు**

ప్రధానంగా కాటన్‌సీడ్ రైతులు మొదటి వారంలో సీడ్ నాటుతారు. డిజెంబర్ నాటినుండి ఫిబ్రవరి దాకా కంపెనీలకు విత్తనాలు ఇస్తూ వుంటారు. అనంతరం ఆ విత్తనాలు శాంపిల్ తీస్తారు. శాంపిల్ తీసిన మూడు నెలలకు రిజల్ట్స్ వస్తాయి. విత్తనాలు పాస్ అయినవా? ఫెయిల్ అయినవా? అని తేల్చి చెప్తారు.

ఇందులో కంపెనీల వారు మార్కెట్‌లో గిరాకీ లేకపోతే ఆ విత్తనాలు అగ్రిమెంట్ ప్రకారం కొనుగోలు చేయవలసి వస్తుందని భయంతో పాస్ అయిన విత్తనాలు ఫెయిల్ అయినవి చెప్పే పద్ధతి వున్నది. దీని వల్ల రైతు దివాళా తీసి పెట్టుబడి సైతం నష్టపోవాల్సి వస్తుంది. అంతేగాక మార్కెట్ మందగించినా మొత్తం విత్తనాలు తీసుకోకపోవచ్చు. దీని వల్ల కూడా రైతులు ఇబ్బందులు పడుతున్నారు.

రైతులకు ఇచ్చే విత్తనాల ఖరీదు కంపెనీకు ఇచ్చిన నాలుగు నెలలకు గానీ డబ్బు ఇవ్వరు. అప్పు ఇచ్చిన ఆర్గనైజర్స్ వారు ఇచ్చిన మొత్తానికి రెండు రూపాయల వడ్డీ ప్రకారం 15 నెలలకు అసలు వడ్డీ కలిపి మొత్తం పట్టుకొని రైతుకు మిగిలిన రొక్కం ఇస్తారు. అందువల్ల రైతు ఒక్కొక్కసారి ఆ ఆర్గనైజర్లకే అప్పు పడి వట్టి చేతులతో వెళ్లవలసి వస్తుంది. పంట అంతా ఏప్రిల్‌లో నాటితే మార్చి నాటికి పంట పూర్తి అవుతుంది. సంవత్సర కాలం కుటుంబం యావత్తు పనిచేసినా గ్యారంటీ లేని స్తితి ఏర్పడుతున్నది.

**సమ్మె - రేటు పెరుగుదల**

ఈ స్థితిలో కర్నూలు జిల్లాలో కాటన్‌సీడ్ రైతులు గత రెండు నెలలుగా రేటు పెంపుదలపై సమ్మె చేసారు. కంపెనీ యజమానులు వారి అండగా వున్న ఆర్గనైజర్స్ వాటిపై స్పందించకపోవడం వల్ల ప్రభుత్వం జోక్యం కల్పించుకుంది. అయినా కంపెనీ యజమానులు దిగిరాలేదు. దీంతో రైతులు ప్రత్యక్ష కార్యాచరణకు పూనుకున్నారు. ధర్నాలు, పికెటింగ్‌లు ఆందోళన చేయడంతో పాటు కంపెనీలన్నీ

(తరువాయి వ పేజీలో)

# ఉత్తరకోస్తా నూనెగింజల పంటలకు సోకే తెగుళ్ళు - నివారణ

డా॥ టి.ఎస్.ఎస్.కె. పాత్రో,
అనకాపల్లి
టి.ఎస్.కె.కె.కిరణ్ పాత్రో
రాజేంద్రనగర్

ఉత్తర కోస్తా జిల్లాలలో సమతల ప్రాంతాలలో ముఖ్యంగా వేరుశనగ, నువ్వులు ఈ మధ్య కాలంలో అక్కడక్కడ ప్రొద్దుతిరుగుడు పువ్వు పండిస్తున్నారు. ఏజెన్సీ ప్రాంతాలలో వలిశలు ముఖ్యమైన నూనె గింజల పంట.

## వేరుశనగ నాశించే తెగుళ్ళు :

వేరుశనగ పంట మీద ఆకుమచ్చ తెగులు, తుప్పులేక కుంకుమ తెగులు, మొదలు కుళ్ళు తెగులు ముఖ్యమైనవి.

**ఆకుమచ్చ తెగులు :**

ఈ తెగులు పంట మీద 25 రోజుల నుండి వాతావరణ పరిస్థితులను బట్టి ఎప్పుడైనా ఆశించవచ్చు. తెగులు సోకిన మొక్కల ఆకులపై నలుపు రంగు మచ్చలు ఏర్పడతాయి. మచ్చ చుట్టూ పసుపు పచ్చని వలయాకారపు వృత్తం ఉంటుంది. మొక్క క్రింది భాగములోని ముదురు ఆకులపై ఈ తెగులు లక్షణాలు ముందుగా కనిపిస్తాయి. ఈ తెగులు ఆకుల మీద, ఆకుల కాడల మీద, కాండము మీద కూడా సోకుతుంది. వాతావరణము అనుకూలంగా ఉన్నప్పుడు ఈ నల్లని మచ్చలు ఒక దానితో ఒకటి కలిసి పెద్దవై ఆకులు ముదర కుండానే వాడి రాలిపోతాయి.

నివారణ : ఆకుమచ్చ తెగులు నివారణకు తెగులు సోకని పొలము నుండి విత్తనాలను సేకరించి, గుండ్రంగా, ముడతలు లేని బలిష్టంగా ఉన్న విత్తనాలను విత్తడానికి ఉపయోగించాలి. విత్తేముందు ఒక కిలో విత్తనానికి 3 గ్రాముల మాంకోజబ్ మందు కలిపి విత్తాలి. ఈ తెగులు పంట మీద ఆశిస్తే మాంకోజబ్ మందు రెండు గ్రాములు ఒక లీటరు నీటిలో కలిపి పిచికారీ చెయ్యాలి. తెగులు తీవ్రత హెచ్చుగా ఉండే కార్బండిజమ్ ఒక గ్రాము మందు ఒక లీటరు నీటిలో కలిపి ముందుగా పిచికారి చేసి 15 రోజుల తరువాత మాంకోజబ్ పిచికారి చెయ్యాలి. వేరుశనగ పంట మీద పిచికారి చెయ్యడానికి ఎకరానికి 200 లీ. మందు ద్రావణం అవసరం అవుతుంది.

**తుప్పు తెగులు లేక కుంకుమ తెగులు :**

తుప్పు తెగులు మొదట ముదురు ఆకుల మీద కనిపిస్తుంది. ఆకుల అడుగు భాగంలో చిన్న చిన్న ఎరుపు లేక పసుపు రంగు మచ్చలు కనిపిస్తాయి. ఆకు అడుగు భాగాన ఎరుపు, గోధుమ రంగు మచ్చలు ఏర్పడతాయి. ఆకుల పైభాగాన లేత పసుపు రంగు మచ్చలు కనిపిస్తాయి. ఆకు అడుగు భాగాన ఉన్న ఎరుపు, గోధుమ రంగు మచ్చలు ఎర్రటి కుంకుమ రంగుకు మారి ఉబ్బెత్తుగా ఉంటాయి. వాతావరణ పరిస్థితులు అనుకూలంగా ఉన్నప్పుడు ఈ ఉబ్బెత్తులు ఒక దానితో ఒకటి కలిసి ఆకులు పండక ముందే పసుపు రంగుకు మారి పండి రాలిపోతాయి. పంట తొలి దశలో ఈ తెగులు సోకినట్టయితే 50-60 శాతం వరకు దిగుబడి తగ్గుతుంది. ఈ తెగులు నివారించడానికి మాంకోజబ్ మందు రెండు శాతం ఒక లీటరు నీటిలో కలిపి విత్తిన 30 రోజుల నుండి 15 రోజుల కొకసారి రెండు సార్లు పిచికారీ చెయ్యాలి.

**మొదలు కుళ్ళు తెగులు :**

ఈ తెగులు ఎక్కువగా ఇసుక నేలలలోను, ఎర్ర నేలలలోను ఎక్కువగా సోకుతుంది. ఈ తెగులును కలుగజేసే శిలీంధ్ర బీజాలు నేల ద్వారా, విత్తనం ద్వారా వ్యాపిస్తాయి. విత్తిన తరువాత విత్తనాలు మొలకెత్తకుండానే కుళ్ళిపోతాయి. ఒక వేళ మొలకెత్తిన తరువాత ఈ తెగులు సోకితే లేత ఆకులపై గోధుమ రంగు మచ్చలు ఏర్పడతాయి. మొక్క మొదలులో కాండంపై పెద్ద మచ్చలు ఏర్పడి మొక్క వాడిపోయి చనిపోతుంది. ఇటువంటి మొక్కలను పెరికినప్పుడు సులభంగా ఊడి వస్తాయి. విత్తిన 25-30 రోజుల లోపల ఈ తెగులు సోకడం వల్ల పొలంలో ఉండవలసిన మొక్కల సాంద్రత చాలా వరకు తగ్గి, తక్కువ దిగుబడి వస్తుంది.

ఈ తెగులును నివారించడానికి విత్తే ముందు విత్తనాన్ని మాంకోజబ్ మందు 3 గ్రాములు ఒక కిలో విత్తనానికి కలిపి విత్తాలి.

## నువ్వు పంటను ఆశించే తెగుళ్ళు :

నువ్వు పంటను ముఖ్యంగా ఆకుమచ్చ తెగులు, వెర్రి తల తెగులు, బూడిద తెగులు ఆశిస్తాయి.

**ఆకుమచ్చ తెగులు :**

ఆకుల మీద, కాండం మీద ముదురు గోధుమ రంగు వలయాకారపు మచ్చలు ఏర్పడతాయి. తెగులు ఉధృతమైన కొద్ది ఆకులు ఎండి, రాలిపోయి, మొక్కలు చనిపోతాయి. ఈ తెగులు కనిపించిన వెంటనే బావిస్టిన్ 3 గ్రాముల మందు 10 లీటర్ల నీటిలో లేదా మాంకోజబ్ 2 గ్రాములు ఒక లీటరు నీటిలో కలిపి 15 రోజులు వ్యవధిలో మూడు సార్లు పిచికారి చేసి నివారించవచ్చు.

**వెర్రితల తెగులు :**

ఈ తెగులు ఒక మొక్క నుండి మరొక మొక్కకు పచ్చదీపపు పురుగుల ద్వారా వ్యాప్తి చెందుతుంది. ఈ తెగులు సోకిన మొక్కలలో ఆకులు చిన్నవై, పువ్వులలోని భాగాలన్ని ఆకుల మాదిరిగా మారిపోయి కాయలు ఏర్పడవు. మొక్కల ఎదుగుదల తగ్గి పైభాగాలలో చిన్న చిన్న ఆకులు గుబురుగా ఉండి వెర్రితలవలె ఉంటుంది. అందుకే దీనికి వెర్రితల తెగులు అంటారు.

వెర్రితల తెగులు కనిపించిన వెంటనే తెగులు సోకిన మొక్కలను పూర్తిగా తీసి వేసి తగుల బెట్టుట వలన ఈ తెగులు వ్యాప్తి చెందకుండా అరికట్టవచ్చు. ఈ తెగులు పచ్చదీపపు పురుగుల ద్వారా వ్యాప్తి చెందుతుంది. కాబట్టి ఈ పురుగులను నివారించడానికి ఏదైనా కీటక నాశనిని పిచికారి చేయవలసి ఉంటుంది. దీపపు పురుగుల నివారణకు కార్బరిల్ రెండు గ్రాములు కానీ, మిధైల్ పెరాథియాన్ రెండు మి.లీ. కానీ, ఎండోసల్ఫాన్ రెండు మి. లీ. కాని ఒక లీటరు నీటిలో కలిపి పిచికారి చెయ్యాలి.

**బూడిద తెగులు :**

ఈ తెగులు ఎక్కువగా రబీ పంటకాలంలో ఆశిస్తుంది. ఈ తెగులు ఆశించిన మొక్కల ఆకులపై బూడిద చల్లినట్లు కనిపిస్తుంది. తెగులు తీవ్రత హెచ్చుగా ఉన్నప్పుడు ఆకులన్నీ బూడిదతో కప్పబడినట్లు ఉంటాయి. ఈ తెగులు ఉదయం మంచుకురిసి, పగలు ఉష్ణోగ్రత హెచ్చుగా ఉన్నప్పుడు వస్తుంది.

ఈ తెగులు నివారణకు నీటిలో కరిగే గంధకపు పొడి 3 గ్రాములు ఒక లీటరు నీటిలో కలిపి తెగులు కనిపించిన వెంటనే ఒకసారి 15 రోజుల తరువాత మరొకసారి పంటపై పిచికారి చెయ్యాలి. వై.ఎల్.ఎం. 16 రకము ఈ తెగులును కొంత వరకు తట్టుకుంటుంది.

**ప్రొద్దుతిరుగుడును ఆశించే తెగుళ్ళు :**

ప్రొద్దుతిరుగుడు పంట మీద ముఖ్యంగా ఆకుమచ్చ తెగులు వస్తుంది. తెగులు సోకిన మొక్కల ఆకులపై వర్తులాకారపు గోధుమ రంగు మచ్చలు ఏర్పడతాయి. ఈ మచ్చలు ఆకుకాడ, కాండము, పువ్వు మీద కూడా వస్తాయి. ఆకుల మీద మచ్చలు మధ్య ముదురు గోధుమ రంగులో ఉండి చుట్టూ లేత గోధుమ వర్ణములో ఉండి, మొదట చిన్నగా ఉండి క్రమేపి పెరిగి పెద్ద మచ్చలు అవుతాయి.

ఆకుమచ్చ తెగులు నివారించడానికి మాంకోజబ్ 2 గ్రాముల మందు ఒక లీటరు నీటిలో కలిపి 10 రోజుల వ్యవధిలో తెగులు ఉధృతిని బట్టి 2,3 సార్లు పిచికారీ చేయవలసి ఉంటుంది.

**వలిశ పంటను ఆశించే తెగుళ్ళు :**

వరిశ పంటను ముఖ్యంగా ఆకాశ పందిరి లేదా బంగారు తీగ, బూడిద తెగులు ఆశిస్తాయి. ఇది వలశ మొక్క కాండాన్ని ఆశించే అసంపూర్ణ పరాన్న జీవి. ఇది వలిశ మొక్క భూమిలో నుండి గ్రహించిన ఆహార పదార్థాలను హాస్టోరియాల ద్వారా గ్రహించడం వల్ల మొక్కలు బలహీనమై దిగుబడులు విపరీతంగా ఒక్కొక్కసారి 50-60% తగ్గుతాయి. ఈ పరాన్న జీవి భూమిలో ఉండే విత్తనాల ద్వారాను, విత్తినప్పుడు విత్తనాలలో కలిసి ఉండి వెదజల్లబడి మొలకెత్తుతాయి. ఈ పరాన్న జీవి మొక్కల మీద పందిరిలాగా అల్లుకుంటుంది. అందుకే దీనిని ఆకాశ పందిరి అంటారు. దీని నివారణకు విత్తేనాన్ని వెదజల్లే ముందు జల్లించి ఆకాశ పందిరి విత్తనాన్ని వేరు చేసి విత్తాలి. భూమిలో ఉన్న ముందు సీజను తాలుకు విత్తనాలు మొలకెత్తి పరాన్న జీవి ఆశించినట్లయితే రైతులు, 2,3 పర్యాయములు పూత పూయక ముందే ఏరి పార వెయ్యాలి. రసాయనాలతో ఈ పరాన్న జీవి నివారణ గురించి చింతపల్లి ప్రాంతీయ వ్యవసాయ పరిశోధన స్థానంలో పరిశోధనలు జరుగుతున్నాయి.

బూడిద తెగులు :

బూడిద తెగులు ఆశించినట్లయితే మొక్క అంతా బూడిదతో కప్పబడినట్లు ఉంటుంది. ఈ తెగులును నివారించడానికి నీటిలో కరిగే గంధకపు పొడి 3 గ్రాములు ఒక లీటరు నీటిలో కలిపి 15 రోజులు వ్యవధిలో రెండు సార్లు పిచికారీ చేయవలసి ఉంటుంది.



( వ పేజీ తరువాయి)

నుండి వచ్చే దిగుబడులలో ఎగుమతికి అవసరమైన కాయలు 15 శాతం కంటె ఎక్కువ లభించడం లేదు. మామిడి రైతులకు ఎగుమతులకు సంబంధించిన సరైన అవగాహన లేదు. కోతకు ముందు, కోసిన తర్వాత అనుసరించవలసిన, ఆచరణ యోగ్యమైన నిర్దిష్టమైన సాంకేతిక పద్ధతులు ( తోటల నిర్వహణ, కోత, ప్యాకింగ్, రవాణా వంటి అంశాలు) పూర్తి స్థాయిలో నిర్ధారింపబడాల్సి వుంది.

**మార్కెట్ ఇబ్బందులు**

విదేశీ మార్కెట్‌ను గురించిన సమాచారం తెలియకపోవడం, కమీషన్ ఏజెంట్లు( దళారులు) ఎక్కువ కమిషన్ తీసుకోవడం, ప్రచార లోపం వలన కొన్ని దేశాలలో మన రకాలను గురించి తెలియకపోవడం, అమెరికా వంటి దేశాలలో నిబంధనలు ఎక్కువగా వుండటం, వాటికి అనుగుణంగా మన రైతులు తగిన ప్రమాణాలు పాటించకపోవడం , ఓడరేవులు, విమానాశ్రయాలు ఉత్పత్తి కేంద్రాలకు దూరంగా వుండటం వంటి అంశాలు ఆటంకాలుగా వున్నాయి.

**ఎగుమతులు మెరుగుకు సూచనలు**

☆ ఎగుమతులకు అనువైన కాయలను సాగుచేయడంలో వివిధ మెళకువలపైన, అనుసరించవలసిన యాజమాన్య పద్ధతులపైన రైతులకు శిక్షణ ఇవ్వాలి. ఉద్యానవన శాఖ, వ్యవసాయ శాస్త్రవేత్తలు సమన్వయంతో ఈ పనిని చేపట్టాలి.

☆ ఎగుమతికి అనువైన, ఆచరణ యోగ్యమైన, నిర్దిష్ట సాంకేతిక పద్ధతులను పరిశోధనా సంస్థలు రూపొందించాలి.

☆ ఎగుమతికి అనువైన రకాలను గుర్తించడం, వున్న రకాలను అభివృద్ధి పరచడం, ఎగుమతికి అనువైన కొత్త రకాలను రూపొందించడం వంటి కార్యక్రమాలను పరిశోధనా సంస్థలు చేపట్టాలి.

☆ ప్యాకింగ్ ముడిసరుకు, ప్రీకూలింగ్ కూలర్లు, శీతల వాహనాలు రవాణాకు అవసరమైన ఓడలు, విమానాలు మొదలైనవి రైతులకు అందుబాటులో వుంచాలి.

☆ విదేశాలలో మన రకాలను గురించి బాగా ప్రచారం చేసి, వారికి మన రకాలపైన సరైన అవగాహన ఏర్పడేట్లు చేయాలి.

☆ విదేశీ మార్కెట్ సమాచారాన్ని సేకరించి, రైతులకు, ఎగుమతి దారులకు అందించాలి.

☆ ఆర్థిక సంస్థలు, బ్యాంకులు రుణసదుపాయాన్ని కలుగజేయాలి.

☆ రైతుల కో-ఆపరేటివ్ సొసైటీలను ప్రభుత్వం ప్రోత్సహించాలి.

**కాయలు కోసిన తర్వాత జాగ్రత్తలు**

☆ ఎగుమతికి పనికి వచ్చే మామిడి కాయలను గుర్తించి వాటినే కోయాలి.

☆ కాయలను ఉదయం 6-9, సాయంత్రం 4-6 గంటల మధ్యలో కోయాలి.

కాయకున్న తొడిమ 7-8 సెం.మీ. వుండేటట్లు జాగ్రత్తగా కోసుకోవాలి.

☆ కాయలను ప్లాస్టిక్ క్రేట్స్‌లలో వుంచి కోసిన ఆరు గంటల లోపల ప్రోసెసింగ్ సెంటరుకు తరలించాలి. క్రేట్స్‌లో పేపరు కట్టింగ్‌లు కానీ, మెత్తటి గడ్డిగాని వుంచాలి.

☆ తొడిమ నుండి సొన పూర్తిగా కారిన తరువాత ప్లాస్టిక్ క్రేట్స్‌లలో వుంచి శుభ్రమైన నీటితో కడగాలి. తరువాత సర్ఫ్ లేక సబ్బు నీళ్లతో కడిగి శుభ్రమైన మెత్తటి గుడ్డతో తుడవాలి. ఇలా చేసినందువల్ల మసితెగులు, త్రిప్స్ పురుగుల వలన కలిగిన మరకలు తొలగిపోతాయి.



( వ పేజీ తరువాయి)

మూసివేస్తూ తాళాలు వేయడం జరిగింది. అనంతరం వ్యవసాయ శాఖామంత్రి, కమిషనర్‌గారికి, రాష్ట్ర రైతునాయకుల జోక్యంతో 750 గ్రాముల ప్యాకెట్‌కు 15 రూపాయలు పెంచడం జరిగింది. ఈ విజయంపై రైతులలో ఉత్సాహం పెరిగింది. సంఘం వుండి సాధించ గలిగామనే ఆత్మవిశ్వాసం పెరిగింది.

**పరిష్కార మార్గాలు**

- రైతుకు 750 గ్రాముల ప్యాకెట్ నుండి తిరిగి వారికి అదే మోతాదులో విత్తనానికి ( 450 గ్రాములు) అమ్మాలి.

- 750 గ్రాముల ప్యాకెట్ ధర కనీసం రిసెర్చి వెరైటీ 350 లు, 44 రకానికి 250 రూపాయలు వుండాలి.

- కల్తీ విత్తనాలు అమ్మే వారిపై కఠినచర్యలు తీసుకోవడమే కాకుండా, నష్టం జరిగిన రైతులకు పరిహారం ఇవ్వాలి.

- బ్యాంకులు, కంపెనీలు ఆర్గనైజర్లతో సంబంధం లేకుండా సరిపడ అప్పులు ఇవ్వాలి. కంపెనీలు నేరుగా రైతులతో అగ్రిమెంట్‌లు చేసుకోవాలి.

- సీడ్ రైతులకు ఇన్స్యూరెన్సు సౌకర్యం కల్పించాలి.



# "వైద్యనాథన్ కమిటి రిపోర్ట్"
# సహకార రంగ పటిష్టతకా? నిర్వీర్యానికా?

సంభారపు భూమయ్య, కన్వీనర్, సహకార సంరక్షణ సమితి

గ్రామీణ సహకార పరపతి సంస్థల పునరుజ్జీవనం కొరకు ఏర్పడిన " టాస్క్‌ఫోర్స్ కమిటి" తన నివేదికను కేంద్ర ఆర్థికశాఖకు ఫిబ్రవరి రెండవ వారంలో నివేదించింది. కేంద్ర ఆర్థిక శాఖామాత్యులు శ్రీ చిదంబరం 2005-06 సంవత్సరపు బడ్జెట్ ప్రసంగంలో గ్రామీణ సహకార పరపతి వ్యవస్థ పటిష్టతకు టాస్క్‌ఫోర్స్ సూచనల అంశాన్ని ప్రస్తావించారు. కానీ బడ్జెట్ కేటాయింపులు మాత్రమే చేయలేదు.

ఈ టాస్క్‌ఫోర్స్‌కు ప్రొఫెసర్ ఎ వైద్యనాథన్, ఛైర్మన్‌గా నాయకత్వం వహించారు. ఈ కమిటి ప్రధాన సూచనలు:

1. ప్రాథమిక వ్యవసాయ సహకార పరపతి సంఘాలు, జిల్లా సహకార కేంద్ర బ్యాంకులు, మరియు రాష్ట్ర సహకార బ్యాంకులలో పేరుకుపోయిన నష్టాలను పూడ్చుటకు, వీటిలో నిరంతరం కనీసస్థాయిలో ఆర్థిక నిల్వలు కొనసాగించుటకు, ప్రభుత్వం హామీ వుండే బ్యాంకులకు చెల్లించని మొత్తాలను చెల్లించుటకు మరియు వీటిలో ప్రభుత్వ వాటాధనమును తిరిగి ప్రభుత్వాలకు చెల్లించుటకు గాను మొత్తం రు.14,839 కోట్లు (మార్చి 2003 నాటికి) అవసరం వుందని అంచనా వేసి, ఈ గ్రామీణ సహకార పరపతి సంస్థల పునరుజ్జీవనం కొరకు ఆ మొత్తాన్ని ఆర్థిక ప్యాకేజిగా ఇవ్వాలని సూచించింది.

2. ఈ ఆర్థిక ప్యాకేజి ఖర్చును కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు మరియు సహకార సంస్థలు వరుసగా 53:31:16 నిష్పత్తిలో భరించాలని సూచించింది.

3. ప్రాథమిక వ్యవసాయ సహకార సంఘానికి వచ్చే "గ్రాస్‌మార్జిన్" ఆదాయం, నిర్వహణ మరియు సిబ్బంది ఖర్చులో కనీసంగా 50 శాతం వుండాలి. మరియు ఆ సంఘం 50 శాతం రుణ వసూలు కలిగి వుండాలి. ఈ రెండు అంశాలు పూర్తి చేసిన సంఘాలు మాత్రమే ఆర్థిక ప్యాకేజి పరిధిలోకి వస్తాయని పేర్కొంది.

4. డిపాజిట్ దారుకి ఓటు హక్కు కల్గించాలి.

5. జిల్లా సహకార కేంద్ర బ్యాంకులు పబ్లిక్ నుండి డిపాజిట్లు సేకరించరాదు.

6. ప్రభుత్వం తన వాటాధనమును, ప్రభుత్వ నామినీలను ఉపసంహరించుకోవాలి.

7. రాష్ట్రాలు మరొక కొత్త సహకార చట్టాన్ని ఆమోదించాలి. (నమూనా కూడా సూచించింది.)

8. రాష్ట్ర ప్రభుత్వం ఈ పథకమును ఏకమొత్తంలో ఆమోదించాలి. ఆమోదించని రాష్ట్రాలకు రెండు సంవత్సరాల గడువునిచ్చింది.

9. ప్రాథమిక అప్పు పొందుటకు మరియు వాటిలో డిపాజిట్ చేయుటకు స్వేచ్ఛ కలిగివుండాలి. మరియు ఫెడరల్ సంఘంలో సభ్యత్వం కల్గి వుండాలా లేదా అని నిర్ణయించే స్వేచ్ఛ ప్రాథమిక సంఘానికి వుంటుంది.

10. వాణిజ్య బ్యాంకులకు వర్తించే అన్ని అంశాలను సహకార బ్యాంకులకు కూడా వర్తింపచేస్తూ బ్యాంకింగ్ రెగ్యులేషన్ చట్టానికి సవరణలు తేవాలి.

11. సూచనలు ఆమోదిస్తూ, అమలుకు రాష్ట్ర ప్రభుత్వం ఎగ్జిక్యూటివ్ ఆర్డర్‌ను జారీ చేయాలి. రిజర్వ్ బ్యాంకుతో అవగాహన పత్రంపై సంతకం చేయాలి.

**రిజర్వు బ్యాంక్, రాష్ట్ర ప్రభుత్వాల అభ్యంతరాలు-సూచనలు**

పరపతి రంగాన్ని మాత్రమే పరిశీలించిన రిపోర్టు మొత్తం సహకార వ్యవస్థకు వర్తించే చట్టాన్ని నిర్దేశించడం పట్ల అభ్యంతరాన్ని రిజర్వు బ్యాంక్ వ్యక్తపరిచింది. డిపాజిట్‌దారులకు ఓటుహక్కు ఇచ్చి నిర్వహణలో భాగస్వామ్యాన్నిచ్చినపుడు బయటి నియంత్రణ ఎందుకని ప్రశ్నించింది. ప్రత్యామ్నాయంగా సహకార బ్యాంకుల్లోని ప్రాథమిక సహకార సంఘాల్లోని డిపాజిట్లకు రక్షణగా, ప్రత్యేకంగా, డిపాజిట్ ఇన్సూరెన్సు కార్పోరేషన్ ఏర్పాటుకు సూచించింది. ఆర్థిక సాంఘిక కారణాల వలన బ్యాంకింగ్ రెగ్యులేషన్ చట్టాన్ని పూర్తిస్థాయిలో సహకార బ్యాంకులకు అమలు చేయలేకపోతున్నామని రిజర్వు బ్యాంక్ పేర్కొంది.

ఆంధ్రప్రదేశ్, పశ్చిమబెంగాల్, ఒరిస్సా, మహారాష్ట్ర, పంజాబ్ రాష్ట్ర ప్రభుత్వాలు, రాష్ట్ర సహకార బ్యాంకులు, సహకార బ్యాంకుల జాతీయ ఫెడరేషన్ తదితర సంస్థలు వివిధ అంశాలపై అభ్యంతరాలు, సూచనలను వైద్యనాథన్ కమిటికి నివేదించాయి.

ముఖ్యంగా ఆర్థిక ప్యాకేజి వర్తించే పరిధి అంశంలో షరతుల అమలు విషయంలో, ఆర్థిక భారాన్ని భరించే నిష్పత్తి అంశంలో, ప్రభుత్వ వాటాధనమును వాపసు తీసుకోవడంపై, డిపాజిటర్‌కు ఓటు హక్కు కల్గించడంపై, సమాంతరంగా మరో సహకార చట్టం తేవడంపై, జిల్లా సహకార కేంద్ర బ్యాంకులు పబ్లిక్ నుండి డిపాజిట్ల నిషేధంపై, బ్యాంకింగ్ రెగ్యులేషన్ చట్టం మార్పులపై, ఫెడరల్ సంఘం నుండి కాక ఇతర ఆర్థిక సంస్థ నుండి అప్పు పొందు విషయంలో, మరియు ఇతర అంశాలపై మార్పును కోరుతూ కమిటికి సూచనలు చేసాయి

అయినప్పటికీ వీరి సూచనలను వైద్యనాథన్ కమిటి పరిగణలోకి తీసుకోకపోవడం పట్ల ఆశ్చర్యం కల్గిస్తుంది.

**సహకార వ్యవస్థను నిర్వీర్యం చేయడానికే!**

సహకార వ్యవస్థ మౌలికంగా వినియోగదారుల వ్యవస్థ. ఇది పెట్టుబడిదారుల వ్యవస్థ కాదు. వినియోగదారుల ఐక్యమవడం ద్వారా వారు దోపిడీకి గురికాకుండా లాభసాటిగా వినియోగ అవసరాలను తీర్చుకుంటారు. ఉత్పత్తి, పంపిణి మరియు సంపదలను సహకార విధానం వికేంద్రీకరిస్తుంది. ఈ విధానంలో పాల్గొనే వ్యక్తులను తమ ఆర్థిక స్వయంసమృద్ధి చెందింపచేస్తుంది.

రోజురోజుకు కేంద్రీకృతమవుతున్న పెట్టుబడిదారీ వ్యవస్థ నుండి వినియోగదారులు రక్షింపబడుటకు గ్రామస్థాయి నుండి జాతీయ స్థాయి వరకు సహకార సంస్థలు సమాఖ్యలుగా ఏర్పడి మార్కెట్ శక్తులకు వ్యాపార పోటీని ఇస్తున్నాయి.

అంతేకాకుండా సహకార విధానాలు సాంఘిక లక్ష్యాలను, మానవతా విలువలను నిర్దేశించుకున్నవి. సహకార సూత్రాలను అమలు పర్చడం ద్వారా సహకార వ్యవస్థ మనిషిని సంఘజీవిగా మలుస్తుంది. అందుకే సహకార ఉద్యమాన్ని ప్రజా ఉద్యమంగా పేర్కొంటారు.

సహకార భావజాలం, విధివిధానాల ప్రచారానికి రాష్ట్ర, కేంద్ర

స్థాయిలలో, అంతర్జాతీయ స్థాయిలలో సహకార ఉద్యమ నాయకత్వ వ్యవస్థలను సహకార రంగం ఏర్పరచుకున్నది. అంతర్జాతీయ స్థాయిలో " అంతర్జాతీయ సహకార సమితి", జాతీయ స్థాయిలో " జాతీయ సహకార యూనియన్"లు సహకార విధివిధానాల రూపకల్పనలో ప్రభుత్వాలకు సలహా సంప్రదింపులు అందజేసే వ్యవస్థలు.

సహకార భావం బలపడుతున్నకొలదీ, ఆ భావాన్ని నిర్వీర్యం చేయడానికి మార్కెట్‌శక్తులు వివిధ రకాలుగా ప్రయత్నాలు చేస్తున్నాయి. ఆ రీతిలోనే వైద్యనాధన్ కమిటీ వ్యవహరించిందని భావించాల్సి వస్తుంది. ఎలా నిర్వీర్యం చేస్తుంది?

1. డిపాజిట్‌దారుకు ఓటుహక్కు కల్పించడం ద్వారా గ్రామాల్లోని ధనికులు, ప్రయివేటు ఫైనాన్స్ సంస్థలు సహకార సంస్థలలో చేరి వడ్డీ వ్యాపారం చేయడానికి మార్గం సుగమం చేస్తుంది. గ్రామీణ సహకార వ్యవస్థలో పెత్తందార్ల వ్యవస్థ పటిష్టానికి దారితీస్తుంది.

2.సహకార బ్యాంకులు ప్రజలనుండి డిపాజిట్లు సేకరణపై నిషేదం మరియు ప్రాథమిక సంఘం ఫెడరల్ సంఘం నుండి కాకుండా ఇతర ప్రైవేటు ఆర్థిక సంస్థల నుండి అప్పు పొందుటకు అవకాశం కల్పించడం ద్వారా ప్రాథమిక సంఘాలు ప్రైవేటు ఆర్థిక సంస్థల, బహుళజాతి సంస్థల వ్యాపార పనిముట్లుగా అంటే వాటి అవుట్‌లెట్స్‌గా మారుతాయి. మరో ప్రక్క జిల్లా సహకార బ్యాంకులకు ఆర్థిక వనరుల సేకరణ మార్గాలు మూతపడతాయి. దీంతో ఈ ప్రాథమిక సహకార సంఘాలు బలవంతంగా ప్రైవేటు ఫైనాన్సర్ గడపలోకి నెట్టబడతాయి.

3. నేటి పరిస్థితులలో సహకార సంస్థల నుండి ప్రభుత్వాలు వాటాధనమును, ప్రభుత్వ నామినీలను ఉపసంహరించుకోవడం వలన, స్వార్థపర శక్తులు రెచ్చిపోయి దుర్వినియోగం చేసే అవకాశాలు మెండుగా వున్నాయి.

## నేపథ్యాన్ని, సందర్భమును విస్మరించిన కమిటి

ఆర్థిక సరళీకరణ విధానాల నేపథ్యంలో భారత బ్యాంకింగ్ రంగాన్ని అంతర్జాతీయ స్థాయికి చేరుటకుగాను నర్సింహం కమిటి సూచనల మేరకు వాటిలో ప్రుడెన్షియల్ నార్మ్స్‌ను అమలు చేయడం వలన వాణిజ్య బ్యాంకింగ్ రంగం కుప్పకూలే పరిస్థితి ఏర్పడింది. 1995లో రు.58 వేల కోట్లు వాటిలో నిరర్థక ఆస్తులుగా తేలాయి. ఈ ముప్పునుండి వాణిజ్య బ్యాంకులను రక్షించడానికి కేంద్ర ప్రభుత్వం రు.34 వేల కోట్ల ఆర్థిక సహాయమును రీకాపిటలైజేషన్ పేరుతో అంచెలంచెలుగా సహాయం అందించింది. తద్వారా పారిశ్రామిక, వ్యాపార వర్గాలకు ఆర్థిక చేయూతలో ఎలాంటి ఇబ్బంది కలుగలేదు.

కానీ చిన్న సన్నకారు రైతులకు, గ్రామీణ చేతివృత్తిదారులకు ఆర్థిక చేయూతనిస్తున్న సహకార బ్యాంకులు కూడా 1996 నుండి ప్రుడెన్షియల్ విధానాల్ని అమలు పరుస్తున్నా వాటికి కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ఏ ఆర్థిక చేయూతనివ్వలేదు. సహకార ఉద్యమం డిమాండ్ మేరకు కేంద్ర ప్రభుత్వం 1999 సంవత్సరంలో రిజర్వు బ్యాంక్ డిప్యూటి గవర్నర్ శ్రీ కపూర్ నాయకత్వంలో ఒక కమిటీని వేసింది. ఈ కమిటీ తన సూచనలతో వాణిజ్య బ్యాంకులకు ఇచ్చిన తరహాలోనే సహకార బ్యాంకులకు ఆర్థిక చేయూతనివ్వాలని సూచించింది.

కపూర్ కమిటీ సూచనల ఖర్చుపై కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు భిన్నాభిప్రాయాలు వ్యక్తపరిచాయి. పరిష్కారంగా కేంద్ర ఆర్థిక సహాయమంత్రి నాయకత్వంలో జాయింట్ కమిటిని కేంద్ర ప్రభుత్వం వేసింది. ఇందులో 8 రాష్ట్రాల సహకార శాఖామాత్యులు సభ్యులుగా వున్నారు. ఈ జాయింట్ కమిటీ కూడా కపూర్ కమిటి సూచనలతో ఏకీభవించింది. ఆర్థిక చేయూతకు పర్యవేక్షణకు నియంత్రణ వ్యవస్థ సూచించింది. అంతలోనే కేంద్ర ప్రభుత్వం ముందస్తుగా ఎన్నికల పోవడంతో ఈ జాయింట్ కమిటీ సూచనలు అమలుకు నోచుకోలే

ఈ నేపథ్యంలోనే నూతనంగా ఏర్పడిన యుపిఎ ప్రభుత వైద్యనాధన్ నాయకత్వంలో టాస్క్‌ఫోర్స్‌ను నియమించింది. వైద్యనాధ కమిటీ ఈ నేపథ్యాన్ని, సందర్భాన్ని విస్మరించి, ఆర్థిక ప్యాకే పొందాలంటే సహకార బ్యాంకులు ' ఆత్మహత్యలు చేసుకొ బహుళజాతి, పెట్టుబడిదారీ ఆర్థిక సంస్థల ముందు మోకరిల్లాలి ఆ విధంగా సూచనల్విడం, భారత రాజ్యాంగ స్ఫూర్తిని, పరిధిని, సహకా భావనను, విధానాన్ని అతిక్రమించడమే అవుతుంది.

## సహకార ఉద్యమం కోరుతున్న అంశాలు

1. సహకార సంస్థలు వినియోగ సభ్యుని ఆధిపత్య సంస్థలుగ కొనసాగుటకు ప్రస్తుతమున్న సహకార చట్టానికి సవరణ తీసుకురావడం సరిపోతుంది. ప్రత్యేకంగా మరొక చట్టం తీసుకురావడ అవసరం లేదు.

3. రిజర్వు బ్యాంక్ సూచించనట్లు ప్రాథమిక సంఘాలలో, సహకా బ్యాంకులలో డిపాజిట్‌ల రక్షణకు ప్రత్యేకంగా " డిపాజిట్ ఇన్స్యూరెన్స కార్పొరేషన్" ఏర్పాటు చేయాలి.

4. సహకార భావనకు, విధానానికి విరుద్ధమైన డిపాజిట్‌దారునికి ఓట హక్కును తీసివేయాలి.

5. కేంద్ర బడ్జెట్ 2005-06 లో ఆర్థిక ప్యాకేజికి నిధులు కేటాయించాలి.

6. సహకార సంస్థలకు ప్రభుత్వాల వాటాధనం, సహాయం సహకార భావనకు విరుద్ధం కాదు. వాటిని కొనసాగించాలి. ☆

---

( వ పేజీ తరువాయి)

గింజలను ఒలిచి తొక్క లోపలి భాగం నల్లబడేలా చూసి , కోత కోయాలి. గింజ బాగా ముదిరిన పిదప మొక్కలు పీకాలి.

8. కలుపు మొక్కలు పొలంలో లేకుండా పూర్తిగా తీసివేయాలి.

9. కలుపు తీయునపుడు మొక్కలకు గాయాలు లేకుండా జాగ్రత్త పడాలి

పంట కోత మరియు కోత తరువాత జాగ్రత్తలు

1. డిగ్గర్‌బ్లేడ్ సరైన లోతున వుండేలా చూడాలి. దీనివల్ల కాయలకు గాయాలు కాకుండా జాగ్రత్త పడవచ్చు.

2. పీకిన వేరుశనగ మొక్కలను కాయలతో సహా తలక్రిందులుగా చిన్న చిన్న కుప్పలుగా ఆరబెట్టాలి. ఆకులు, కాండం, కొమ్మలు పెళుసెక్కే వరకు 6-7 రోజులు వీటిని పొలంలో వుంచాలి.

3. బాగా నిండిన, ఆరోగ్యకరమైన కాయలను బాగా ఆరబెట్టాలి. కాయల తేమను 9 శాతం కంటె తక్కువ స్థాయికి తీసుకురావాలి. వేరుశనగ కాయలను పిడికిలితో పట్టుకొని కుదిపితే గలగల శబ్దం రావాలి.

4. వేరుశనగ కాయలను నిల్వ చేయడానికి క్రొత్త/ శుభ్రమైన గోనె సంచులను వాడాలి.

5. కాయలను నిల్వ చేయడానికి పాత సంచులు వాడవలసిన అవసరం వచ్చినట్లయితే " క్లోరోఫైరిఫాస్" మందును ఒక లీటరు నీటిలో 2.5 మి.లీ మందును కలిపి సంచుల బయట మరియు లోపల స్ప్రే చేయాలి.

6. నిల్వ చేసే గదిలో గోడలు, పైకప్పు, గచ్చు మీద క్లోరోఫైరిఫాస్ ద్రావణం స్ప్రే చేయాలి.

7. కాయలను గాలి, వెలుతురు బాగున్న, చూరు కారని గదిలో వుంచాలి.సంచులను బల్ల చెక్కలపై ఉంచి, చిన్న చిన్న నెట్లు వేయాలి.

8. గోడలకు, నెట్లకు మధ్య 2అడుగుల ఖాళీస్థలం విడిచి పెట్టాలి. ☆

# సమస్యలపై కదులుతున్న రైతన్న

## రైతు సమస్యలపై మార్చి 21న ధర్నాలు :

రైతాంగం ఎదుర్కొంటున్న వివిధ సమస్యలను ప్రభుత్వం దృష్టికి తీసుకువచ్చి, పరిష్కరించాలని డిమాండ్ చేస్తూ మార్చి 21న ప్రభుత్వ కార్యాలయాల వద్ద ధర్నాలు చేయాలని ఆంధ్రప్రదేశ్ రైతు సంఘం పిలుపునిచ్చింది.



ప్రొఫెసర్ జయతీఘోష్ కమిషన్ నివేదికను అమలు చేయాలని, ఉచిత విద్యుత్‌ను కొనసాగించాలని, పంటలను మద్దతు ధరలకు కొనుగోలు చేయాలని, ప్రైవేట్ వ్యవసాయ మార్కెట్ యార్డులను తేవద్దని, ప్రాథమిక వ్యవసాయ సహకార సంఘాలను మూసివేయవద్దని, కరువు ప్రాంతాల్లో వెంటనే కరువు పనులు చేపట్టాలని, మంచినీరు, పశుగ్రాసాన్ని సరఫరా చేయాలని డిమాండ్ చేస్తూ రాష్ట్రంలోని వివిధ జిల్లా కేంద్రాలలోను, మండల కేంద్రాల్లో ప్రదర్శనలు, ధర్నాలు, మెమోరాండాలు అందజేయడం వంటి కార్యక్రమాలు జరిగాయి. ఆయా జిల్లాలో ముందుకొచ్చిన సమస్యలను పరిష్కరించాలని అధికార్లకు సంఘం నాయకులు వినతి పత్రాలు అందించారు.

కొబ్బరికి వైరస్ తెగులు నివారణకు ప్రభుత్వం ఎకరానికి 100 చెట్లకు సరిపడా మందు ఇవ్వాలని, కొబ్బరి రైతులకు గిట్టుబాటు ధర కల్పించాలని, ఆక్వా రైతులకు నాణ్యమైన సీడు, సీడు ప్రభుత్వమే సరఫరా చేసి, మార్కెట్టు సౌకర్యం కల్పించాలని సదస్సు ప్రభుత్వాన్ని కోరుతూ తీర్మానించింది. రైతు సంఘం రాజోలు డివిజన్ అధ్యక్షునిగా వడ్డి ధర్మారావు, ఉపాధ్యక్షునిగా బత్తుల బులిస్వామి, కార్యదర్శిగా చవాకుల సూర్యప్రకాశరావు, సహాయకార్యదర్శిగా ఎనుముల బాలకృష్ణ, ఎన్నికైనారు.

## పశ్చిమగోదావరి జిల్లాలో

రైతుల సమస్యలు పరిష్కరించాలని కోరుతూ ఆంధ్రప్రదేశ్ రైతు సంఘం జిల్లా కమిటీ ఆధ్వర్యంలో ఏలూరు సోమవారం కలెక్టరేట్ వద్ద ధర్నా నిర్వహించారు. ధర్నా నుద్దేశించి రైతు సంఘం జిల్లా కార్యదర్శి బి.బలరాం మాట్లాడారు. రైతన్నల ప్రభుత్వమని చెప్పుకుంటున్న రాష్ట్ర ప్రభుత్వం రైతు వ్యతిరేక చర్యలకు పాల్పడతోందని విమర్శించారు. ఆత్మహత్యలు చేసుకున్న రైతుల అన్ని కుటుంబాలకు నష్టపరిహారం చెల్లించాలని, అన్ని ప్రాంతాల్లో మంచి నీటికి కటకట ఏర్పడుతోందని తగు చర్యలు తీసుకోవాలని, ఎం.నాగులాపల్లి హెల్డ్ ఓవర్ భూములకు పట్టాలు ఇవ్వాలని, సి.ఎ.డి. భూములు సాగు చేస్తున్న పేద రైతులకు పట్టాలు, వ్యవసాయానికి 10 గంటలు కరెంటుకు ప్రత్యేక చర్యలు తీసుకోవాలని నినాదాలు చేశారు.

ధర్నా అనంతరం జిల్లా కలెక్టరు శ్రీ సంజయ్‌జాజుకు మెమోరాండం సమర్పించారు. కార్యక్రమంలో రైతు నాయకులు తూంపాటి రాఘవేంద్రరావు, వడ్లపట్ల సుబ్బారావు, జి.శివబసివరెడ్డి తదితరులు పాల్గొన్నారు. సమస్యలు ప్రభుత్వం దృష్టికి తీసుకు వెళతానని కలెక్టరు రైతు నాయకులకు హామీ ఇచ్చారు.

## ఖమ్మం జిల్లాలో

రాష్ట్ర రైతు సంఘం ఇచ్చిన పిలుపుతో భాగంగా ఖమ్మం జిల్లాలో అనేక మండల కేంద్రాల్లో ప్రదర్శనలు, ధర్నాలు జరిగాయి. పెనుబల్లి, కల్లూరు, కూనవరం, భద్రాచలం, చర్ల, దమ్మపేట, కారేనల్లి, గార్ల, కామేపల్లి, ఖమ్మం రూరల్ తదితర మండలాల్లో రైతులు పాల్గొని సమస్యలను అధికార్లకు విన్నవించుకున్నారు. కరువు పనులు కల్పించాలని, కరువు మండలాలు గుర్తించాలని పంటలను మద్దతు ధరలకు కొనుగోలు చేయాలని విజ్ఞప్తి చేసారు.

## మిర్చి ధర పెంచి, కొనుగోలు చేయాలి :

మిర్చికి ధర పెంచి, ప్రభుత్వ సంస్థలైన నాఫెడ్, మార్క్‌ఫెడ్





మిర్చిధరపై మెమోరాండం

ద్వారా కొనుగోలు చేయాలని, మధ్య దళారీల బెడదను అరికట్టాలని కోరుతూ, ఆంధ్రప్రదేశ్ రైతు సంఘం ఆధ్వర్యంలో ఖమ్మం జిల్లా కలెక్టర్‌కు మెమోరాండం అందించారు.

ఖమ్మం జిల్లాలో ప్రధాన వాణిజ్య పంట అయిన మిర్చికి గత సంవత్సరం ఇదే సీజన్‌లో క్వింటా మిర్చి రు. 3500/- ల ధర పలికింది. రానురాను మిర్చి ధర రు. 2500/- లకు పడిపోతే ప్రభుత్వ మార్క్‌ఫెడ్ రంగంలో దింపి క్వింటాకు రు. 2700/-ల చొప్పున కొనుగోలు చేసింది. దీనిలో కూడా వ్యవసాయ మార్కెట్ నియంత్రణ లేక అసలైన రైతులకు అవకాశం లేక కొంత మంది దళారీలు మార్కెఫెడ్‌ను ఉపయోగించుకొని లాభపడ్డారు. చివరిలో రైతులు అమ్ముకోలేని పరిస్థితి ఏర్పడింది. ఈ సంవత్సరం ముందుగానే ధరలు పడిపోయాయి. క్వింటాల్ మిర్చి రు. 1800ల నుండి రు.2400 లకు కొనుగోలు చేస్తున్నారు. ఈ సంవత్సరం తెగుళ్ళు విపరీత పెట్టుబడితో ఎకరాకి రు. 25000ల నుండి రు. 30000 ల దాకా ఖర్చు అయినాయి. మిర్చి ధర తగ్గే సరికి రైతులు దిక్కుతోచని స్థితిలో ఉన్నారు.

**డిమాండ్లు :**

1. మిర్చిని మద్దతు ధర రు. 3000/-లు ప్రకటించి నాఫెడ్, మార్కెఫెడ్ ద్వారా వెంటనే కొనుగోలు చేయించాలి. జిల్లాలో నెం. 1 గా ఉన్న తేజా, వింజనంపాడు రకాలను 'ఎ' గ్రేడుగా తీసుకొని కొనుగోలు చేయాలి. 2. జిల్లాలో ఖమ్మం, మధిర, బోనకల్, చర్ల, భద్రాచలం, కారేపల్లి, బూర్గంపాడులో కొనుగోలు కేంద్రాలు తెరవాలి. 3. జిల్లాలో రెవెన్యూ గ్రామ కార్యదర్శి మండల విస్తరణ అధికారులతో గ్రామాలలో సర్వే చేసి రైతులకు అమ్ముకొనేందుకు కూపన్లు ఇవ్వాలి. 4. మార్కెట్లో ఏ రోజు ఏ మండలంలో రైతులకు కూపన్లు ద్వారా అమ్ముకొనేందుకు అర్డర్స్ రిలీజ్ చేసి కూపన్ల తేదీని నిర్ణయించాలి. మార్కెట్‌లో రద్దీని తగ్గించాలి.

ఈ కార్యక్రమంలో రైతు సంఘం జిల్లా కార్యదర్శి సామినేని రామారావు, రైతు నాయకులు రాయల వెంకటేశ్వర్లు, మండెపూడి చంద్రశేఖర రావు తదితరులు పాల్గొన్నారు.

**విత్తనోత్పత్తి రైతుల సదస్సు :**

పత్తి విత్తనోత్పత్తి రైతుల సంఘం ఆధ్వర్యంలో రైతుల సదస్సు మార్చి 20న కర్నూలులో జరిగింది. సదస్సుకు సంఘం అధ్యక్షు టి. వినోద్ బాబు అధ్యక్షత వహించారు. వివిధ ప్రాంతాల నుండి రైతులు పాల్గొన్నారు.



సదస్సులో రైతు సంఘం రాష్ట్ర కార్యదర్శి సారంపల్లి మల్లారెడ్డి మాట్లాడుతూ ఇటీవల పత్తి విత్తన రైతులు జరిపి ఆందోళన విజయవంతమైందని, అందుకే సంఘాలు పెట్టుకొని సమస్యలు పరిష్కరించుకోవాలని పిలుపునిచ్చారు. పత్తి విత్తనోత్పత్తి రైతులకు గిట్టుబాటు ధరలు కల్పించాలని రెండు నెలలపాటు జరిపిన ఆందోళన సమ్మెలకు ప్రభుత్వం సక్రమంగా స్పందించలేదని సారంపల్లి మల్లారెడ్డి ఆరోపించారు. సీడ్ కంపెనీ నిర్వాహకులు పత్తి విత్తనోత్పత్తి రైతులను నిలువునా దోచుకుంటోందన్నారు. వ్యవసాయ శాఖ జె.డి. హనుమంతరావు మాట్లాడుతూ పత్తి ఉత్పత్తి రైతులు మధ్యవర్తుల ప్రమేయం లేకుండా నేరుగా కంపెనీ వారితో ఒప్పందం కుదుర్చుకోవాలని జె.డి. సూచించారు. రాబోయే ఖరీఫ్ సీజన్‌లో పత్తి విత్తనోత్పత్తి రైతులందరికీ బ్యాంకు రుణ సహాయం అందించే విధంగా తగిన ప్రణాళికలు రూపొందిస్తామని ఆయన హామీ ఇచ్చారు.

సదస్సులో రైతు సంఘం నాయకులు టి నర్సింహయ్య జిల్లా కార్యదర్శి టి. రామకృష్ణ, మహబూబ్‌నగర్ జిల్లా కార్యదర్శి వనగంటి ఈశ్వర్, శ్రీ కృష్ణదేవరాయ రైతు సంఘం అధ్యక్షుడు వెంకటరెడ్డి జనవికాస్ సొసైటీ అధ్యక్షుడు బి.ఎన్.చెట్టి, పత్తివిత్తనోత్పత్తి దారుల సంఘం కార్యదర్శి గిడ్డారెడ్డి, వ్యవసాయ సంఘం జిల్లా కార్యదర్శి బాలహుసేని, రైతు సంఘం నాయకులు జి.ఎన్. శేషయ్య, పాల్గొన్నారు

## ఫీల్డు లేబర్ కో-ఆపరేటీవ్ సొసైటీ రైతులకి రుణ సౌకర్యం కల్పించాలి.

### రాజోలు డివిజన్ రైతు సదస్సు డిమాండ్




తూర్పుగోదావరి జిల్లా సఖినేటిపల్లి, మలికిపురం, రాజోలు మండలాలో అనేక సంవత్సరాలుగా సాగు చేసుకుంటున్న ఫీల్డు లేబర్ కో-ఆపరేటివ్ సొసైటీల సభ్యులైన వేలాది మంది దళిత రైతులకు సహకార, వాణిజ్య బ్యాంకు ద్వారా రుణ సౌకర్యం కల్పించాలని మార్చి 16న వడ్డిధర్మారావు అధ్యక్షతన అంతర్వేదిపాలెంలో జరిగిన రాజోలు డివిజన్ సదస్సు ప్రభుత్వాన్ని డిమాండ్ చేసింది. ప్రపంచ బ్యాంకు ఆదేశాలతో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు అమలు చేస్తుతున్న వ్యవసాయ విధానాలవల్లే సన్న,చిన్నకారు రైతులు దివాలా తీసి, ఆత్మహత్యలకు కారణమని ఆంధ్రప్రదేశ్ రైతు నాయకులు వంగల సుబ్బారావు వై.ఎస్.వి.సత్యనారాయణ (కొండబాబు)లు సదస్సులో మాట్లాడుతూ పేర్కొన్నారు. రైతులంతా సంఘటితమైతేనే సమస్యలు పరిష్కారమవుతాయని తెలిపారు.

# పెంపుడు కుక్కలు - సంరక్షణ

పుస్తక సమీక్ష

కుక్కలకు, మనుషులకు అవినాభావ సంబంధం ఉంది. కుక్కల్లా మనుషులు మొరుగుతున్నారని ఇటీవల ఓ పెద్దాయన నోరుపారేసుకొని అభాసుపాలయ్యాడు. కుక్కలు అత్యంత విశ్వాసనీయమైన జంతువులని ఘంటాపథంగా చెప్పుకోవచ్చు.

ప్రపంచవ్యాప్తంగా ఉన్న పెంపుడు జంతువుల్లో అత్యంత విశ్వాసపాత్రమైన, అత్యధిక మేధాశక్తికలిగిన జంతువు కుక్క. ఇటీవల కాలంలో కుక్కలను ఆదరించి పోషించడం పెరుగుతుంది. . పెంపుడు కుక్కలను ఒక్కొక్కరు ఒక్కో అవసరం కోసం పెంచుకుంటున్నారు. సరదా కోసం, స్టేటస్ కోసం, వేటకోసం, పశుసంపద రక్షణ కోసం, కాపలా కోసం....ఇలా రకాలుగా పెంచుకుంటున్నారు. పోలీసులు దొంగలను పట్టుకోవడానికి పెంచుతున్నారు. ఇటీవలకాలంలో పట్టణ ప్రాంతాల్లోనే కాకుండా గ్రామీణప్రాంతాల్లోనూ జాతికుక్కల పెంపకం వేగంగా విస్తరిస్తోంది. దీనిని దృష్టిలో ఉంచుకొని పెంపుడు కుక్కల ఆరోగ్యం, ఆహారం, పునరుత్పత్తి, యాజమాన్య పద్ధతులు...ఇత్యాధి అంశాలపై అవగాహన కల్పించాలనే ఉద్దేశంతో ఈ పుస్తకం రూపొందినట్లు రచయితలు తొలిపలుకుల్లో తెలిపారు. కుక్కల ద్వారా మనుషులకు సంక్రమించే రేబిస్‌వ్యాధి, జెనిటిక్ వ్యాధులపట్ల అప్రమత్తత, వ్యాధి నిరోధక, నివారణా చర్యలు కూడా వివరించడం రచయితల ఉద్దేశం. పశువైద్యంలో రెండు దశాబ్దాల అనుభవంగల రచయితలు డాక్టర్ సి.రమేష్, డాక్టర్ సికె రావు, అవార్డు గ్రహీత డాక్టర్ కస్సారెడ్డి సూటిగా సులభగ్రహ్యంగా ఈ పుస్తక రచన చేశారు.

ప్రపంచవ్యాపితంగా సుమారు 500కు పైగా కుక్క జాతులను గుర్తించారు. రక్షణ కోసం, వేటకోసం, తోడుగా ఉండడానికి రకరకాల జాతులు ప్రసిద్ధి చెందాయి. కుక్కల జాతుల ఎన్నిక, పిల్లల ట్రెయినింగ్, కుక్కల పెంపకంలో యాజమాన్య పద్ధతులు, మెలకువలు సచిత్రంగా వివరించారు. కుక్కల ఆహారం, వ్యవహారాలు, ఆరోగ్య పరిరక్షణ, పునరుత్పత్తి, వ్యాధులు- నివారణ, డాగ్‌షోలు, కుక్కల బీమా వగైరా విషయాలను సుబోధకంగా పరిచయం చేశారు. పెంపుడు కుక్కపిల్లలు లభ్యమయ్యే అడ్రస్‌లు, వ్యాధుల మందులలిస్టులు జత చేశారు. కుక్కలకు సంబంధించిన వివిధ వెబ్‌సైట్‌ల వివరాలు అందజేశారు. పెంపుడు కుక్కల యజమానులకు తరచూ ఎదురయ్యే సమస్యలు-సమాధానాలు ఈ పుస్తకం ద్వారా తెలియపరిచారు. 35 శాతం అమెరికా గృహాల్లో 6.80 కోట్ల కుక్కలను పెంచుతున్నారు. అమెరికా కల్చరే ప్రామాణికంగా సాగుతున్న కాలమిది. ఇటీవల కాలంలో మనరాష్ట్రంలోనూ మధ్య తరగతి ప్రజలు కుక్కల పెంపకం పట్ల ఆసక్తి కనబరుస్తున్నారు. కుక్కల పెంపకంలోని మెళకువలన్నీ ఈ పుస్తకం ద్వారా లభ్యమవుతాయి. పెద్ద,చిన్నజాతి కుక్కలైన డాబర్‌మెన్, ఆస్ట్రేలియన్, జర్మన్ షెపర్డ్, ప్రామేరియాన్, పుడిత్‌తోపాటు నాటుజాతి కుక్కల వివరణ కోసం 1,2 పేజీలు కేటాయిస్తే సమగ్రంగా ఉండేది. గ్రామాల్లోని నాటుజాతి కుక్కలు, గొర్రెల మందలకాపు కుక్కలు, గిరిజన సంచారజాతుల వేట కుక్కలు దాదాపు ఏడువేల సంవత్సరాల నుంచి ప్రశస్తంలో ఉన్నాయి. జంతుశాస్త్రవేత్తలు మనజాతి కుక్కలపై జరుపుతున్న పరిశీలనలు, ఫలితాల గురించి సమాచారాన్ని పాఠకులకు అందించి, తదుపరి ముద్రణలో ఈ మన్తకాన్ని పరిపుష్టం చేస్తారని ఆశిద్దాం.

**కలర్ కార్టూన్ చిత్రాలతో పెంపకాల సమాచారం (టీకాలు, డివర్మింగ్ వైగారా టేబుల్స్)తో 119 పేజీలున్న ఈ పుస్తకం వెల రూ.75లు.**

చూడచక్కని మల్టీకలర్ ప్రింట్, బ్యాక్ చిత్రాలతో ప్రచురణకర్తలు పుస్తకాన్ని తీర్చిదిద్దారు. ఈ పుస్తకం లభ్యమయ్యే ప్రదేశాలు శ్రీమతి జి.సరిత, సి-102, పూజితా అపార్ట్‌మెంట్, హైదరాబాద్ రోడ్డు, నల్గొండ. సెల్‌నెం: 9440810856 మరియు కెనైన్ క్లినిక్, కొరిటిపాల్ లైబ్రరీ దగ్గర, గుంటూరు. ఫోన్ నెం: 2236718, సెల్‌నెం: 9848182433.

సమీక్ష :భార్గవ

## రచయితలకు పుస్తక ప్రచురణ కర్తలకు విజ్ఞప్తి

ఇటీవల కాలంలో వ్యవసాయ, వ్యవసాయ అనుబంధ రంగాలకు సంబంధించిన వివిధ పుస్తకాలు ప్రచురించబడుతున్నాయి. ఈ ప్రచురణలను రైతాంగం దృష్టికి తీసుకెళ్లాలనే ధ్యేయంతో **మన రైతువాణి** పుస్తక సమీక్ష శీర్షికను నిర్వహిస్తోంది. పుస్తక సమీక్ష నిమిత్తం ప్రచురణలను పంపించవచ్చు. సమీక్ష కోసం రెండు కాపీలను పంపించాలి. సమీక్షార్థం అని స్పష్టంగా వ్రాయాలి. మీ ప్రచురణలను క్రింది అడ్రసుకు పంపించాలని మనవి.

ఎడిటర్, మన రైతువాణి మాసపత్రిక
1-1-9/10, జవహర్‌నగర్, ఆర్.టి.సి. క్రాస్ రోడ్స్,
హైదరాబాద్-20. ఫోన్ :27646580

# రాష్ట్రంలో 2004 సంవత్సరంలో ఆత్మహత్య చేసుకున్న రైతుల వివరాలు

మార్చి సంచిక తరువాయి

| క్ర.సం. | పేరు | వయస్సు | గ్రామం | మండలం | జిల్లా | తేది |
|---|---|---|---|---|---|---|
| 959 | సంజి పున్నయ్య | 65 | ఇంకొల్లు | - | ప్రకాశం | 25-08-2004 |
| 957 | కాసా వెంకటేశ్వర్లు | 22 | మిన్నెకల్లుకు | సంతమాగులూరు | " | " |
| 958 | గొత్తుల సుబ్బారావు | - | మన్నేటికోట | ఉలవపాడు | " | " |
| 959 | కాళ్ళకంటి సుధాకర్‌రెడ్డి | 32 | గుమ్మడిదల | జిన్నారం | మెదక్ | " |
| 960 | మద్దెల పెద్ద మానయ్య | 52 | కూచన్‌పల్లి | మెదక్ | " | " |
| 961 | సాయప్ప | 35 | - | మద్దూరు | మ॥ నగర్ | " |
| 962 | సురభి యాదగిరి | 45 | జిన్‌కుంట | బల్మూరు | " | " |
| 963 | ఎదుళ్ళ వెంకటరెడ్డి | 35 | చిట్టంపహడ్ | నాంపల్లి | నల్గొండ | " |
| 964 | గ్యార చంద్రయ్య | 32 | క్రిష్టరామన్‌పల్లి | చింతపల్లి | " | " |
| 965 | మెగావత్ సహరిసింగ్ | 45 | కాల్వ తండా | దిలావర్‌పూర్ | ఆదిలాబాద్ | " |
| 966 | రామచంద్రారెడ్డి | 45 | తూపల్లి | గాండ్లపెంట | అనంతపురం | " |
| 967 | ఒదనకంటి నారాయణ | 45 | గొల్లపల్లి | దౌల్తాబాద్ | మెదక్ | 26-08-2004 |
| 968 | మోదాల వెంకటేశ్వర్లు | 38 | తరేగూడెం | సూర్యాపేట | నల్గొండ | " |
| 969 | కుర్వ సత్యన్న | 27 | ఖానాపూర్ | ఆత్మకూర్ | మ॥ నగర్ | " |
| 970 | గొల్ల కందిగోపాల్ | 28 | కొప్పునూరు | వీపనగండ్ల | " | " |
| 971 | నలుగూరి వీరయ్య | 40 | జాజిరెడ్డిగూడెం | అర్వపల్లి | నల్గొండ | 27-08-2004 |
| 972 | కత్రెడ్డి అయ్యవార్లు | 70 | అదవికొలవు | నిడమర్రు | ప॥గోదావరి | " |
| 973 | కొత్తాన్ లక్ష్మయ్య | 25 | వరదరాజ్‌పూర్ | జగదేవ్‌పూర్ | మెదక్ | " |
| 974 | నక్కల బాల సర్సారెడ్డి | 60 | ఆవునూర్ | ముస్తాబాద్ | కరీంనగర్ | " |
| 975 | గంగవరపు చిన్నారెడ్డి | 52 | తాళ్లూరు | కనిగిరి | ప్రకాశం | " |
| 976 | బేతపూడి వీరయ్య | 55 | చెరువు కొమ్ముపాలెం | నందిగామ | కృష్ణా | " |
| 977 | బాలం శేఖర్ | 31 | అంబట్‌పల్లి | - | మ॥ నగర్ | " |
| 978 | సోమనబోయిన కేతమ్మ | 52 | అయ్యగారిపల్లి | కురవి | వరంగల్ | " |
| 979 | యాదవరెడ్డి | 32 | రాకంచర్ల | పూడూరు | రంగారెడ్డి | 28-08-2004 |
| 980 | లింగాల రాజేందర్‌రావు | 33 | పాతగూడూరు | వెల్లటూరు | కరీంనగర్ | " |
| 981 | ఆరే భూం మధు | 32 | జంగారియి | చిన్నశంకరంపేట | మెదక్ | " |
| 982 | తిరుమల గోపాల రెడ్డి | 25 | హత్నూర్ | న్యాల్‌కల్ | మెదక్ | " |
| 983 | బోయ పరమేష్ | 32 | పేరూరు | రామగిరి | అనంతపురం | " |
| 984 | వారదప్ప | | కుర్లపల్లి | కనగానపల్లి | అనంతపురం | " |
| 985 | ఏల్చూరి హైమావతి | 45 | చెన్నుపల్లి | బల్లికురవ | ప్రకాశం | " |
| 986 | పెద్దిరెడ్డి | 42 | ఎస్ నాగులవరం | గోస్పాడు | కర్నూలు | " |
| 987 | కట్టెకొల్ల పర్వతాలు | 35 | ద్వారకాపేట్ | చిట్యాల | వరంగల్ | " |
| 988 | పిట్టల వెంకటేష్ | 29 | కంచనపల్లి | రఘునాధపల్లి | వరంగల్ | " |
| 989 | కానుగంటి చెన్నయ్య | 25 | దొడ్డలోనిపల్లి | మ.నగర్ | మ.నగర్ | 29-08-2004 |
| 990 | కుర్వ రాములు | 31 | ఇద్రంపల్లి | దేవరకద్ర | మ.నగర్ | " |
| 991 | చాకలి నారాయణ | 45 | చీమల్‌దరి | మోమిన్‌పేట్ | రంగారెడ్డి | " |
| 992 | కుర్మ సాయిలు | 34 | బాబీపేట్ | కల్హేర్ | మెదక్ | " |
| 993 | నల్లమలపు వీరారెడ్డి | 50 | శాంతినగర్ | ఖాజీపేట్ | కడప | " |
| 994 | వర్రా శ్రీనివాస రెడ్డి | 38 | నడికుడి | దాచేపల్లి | గుంటూరు | " |
| 995 | పసెద్దుల మాదన్న | 45 | రొళ్లపాడు | తుగ్గలి | కర్నూలు | " |
| 996 | కనకంటి రంగారెడ్డి | 55 | కేశాపురం | కొత్తచెరువు | అనంతపురం | " |
| 997 | నరసింహులు | 28 | అరగిద్ద | గట్టు | మ.నగర్ | " |
| 998 | నాగేశ్వర రావు | 30 | గార్గేయపురం | గార్గేయపురం | కర్నూలు | " |
| 999 | భైరమోని రాములు | 32 | గాంధీపాలెం | బాలసాగర్ | మ.నగర్ | " |

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1000 | వడ్డెర మల్లయ్య | 42 | పెనిమిల్ల | ఉప్పునూతల | మ.నగర్ | " |
| 1001 | వడ్డె భీమయ్య | 31 | రాంరెడ్డిపల్లి | కుల్కచర్ల | రంగారెడ్డి | " |
| 1002 | సి శివయ్య | 28 | పోతుగల్ | షాబాద్ | రంగారెడ్డి | " |
| 1003 | ముత్తవ్వ( మహిళ) | 45 | వట్టిమల్ల | కొనరావుపేట | కరీంనగర్ | 30-08-2004 |
| 1004 | రాజగంగు ( మహిళ ) | 45 | రాఘవపేట | మల్లాపూర్ | కరీంనగర్ | " |
| 1005 | విలాసాగర్ కొండయ్య | 45 | కమ్మర్‌ఖాన్‌పేట్ | | కరీంనగర్ | " |
| 1006 | శ్రీనివాసరావు | 23 | సత్యన్నారాయణపురం | పల్నాడు | గుంటూరు | " |
| 1007 | బొల్లా శేషగిరి రావు | 35 | కొత్తపాలెం | మాచవరం | గుంటూరు | " |
| 1008 | ఈదా బ్రహ్మానందరెడ్డి | 40 | ఇరికేపల్లి | దాచేపల్లి | గుంటూరు | " |
| 1009 | బాలవీరా రెడ్డి | 65 | ఆర్ తుమ్మలపల్లి | పులివెందుల | కడప | " |
| 1010 | ఆంజనేయులు | 28 | కోటకదిరి | దేవరకద్ర | మ.నగర్ | " |
| 1011 | వెంకన్న | 27 | చెన్నూరు | చెన్నూరు | వరంగల్ | " |
| 1012 | చిన్న లక్ష్మన్న | 38 | గోరంట్ల | కొడుమూరు | కర్నూలు | " |
| 1013 | బింగి రాజయ్య | 35 | రేకులపల్లి | కరీంనగర్ | కరీంనగర్ | " |
| 1014 | సిరిపురం రామయ్య | 55 | నర్సాపూర్ | మర్పల్లి | రంగారెడ్డి | " |
| 1015 | సింగన్న | | జెక్కిరెడ్డిపల్లి | కంబదూరు | అనంతపురం | 31-08-2004 |
| 1016 | బి నారాయణస్వామి | 45 | ఇల్లూరు | గార్లదెన్ని | అనంతపురం | " |
| 1017 | బోయ ఎల్లప్ప | | నీలూరు | పామిడి | అనంతపురం | " |
| 1018 | నాగమల్ల చంద్రశేఖర్ | 30 | మాణిక్యాలపూర్ | భీమదేవరపల్లి | కరీంనగర్ | " |
| 1019 | తౌటం శంకరయ్య | | కొలనూర్ | ఓదెల | కరీంనగర్ | " |
| 1020 | షేక్ హుస్సేన్ | 28 | కొత్తపేట | కేతెపల్లి | నల్గొండ | " |
| 1021 | తిగుళ్ల సాయిలు | 45 | జల్దిపల్లి | లింగంపేట్ | నిజామాబాద్ | " |
| 1022 | పుల్లన్న | 55 | పెద్దయమ్మనూరు | ఉయ్యాలవాడ | కర్నూలు | " |
| 1023 | చంటి జంగమ్మ | 35 | కుర్మిద్ద | కల్వకుర్తి | మ.నగర్ | " |
| 1024 | సారదుర్గయ్య | 48 | సంజీవన్‌రావు | నారాయణఖేడ్ | మెదక్ | " |
| 1025 | పాలేటి రవీంద్రబాబు | 35 | నిడమానూరు | నాగులుప్పలపాడు | ప్రకాశం | 01-09-2004 |
| 1026 | బైరెడ్డి పాపిరెడ్డి | | మానేపల్లి | పుల్లలచెరువు | ప్రకాశం | " |
| 1027 | రమణమ్మ | 30 | చింతల అగ్రహారం | పెద్ద దోర్నాల | ప్రకాశం | " |
| 1028 | లింగోతు దేవోజీ | 48 | ఉత్తర తండా | మహబూబాబాద్ | వరంగల్ | " |
| 1029 | బాసిడి శంకర్‌రావు | 35 | మహ్మద్ గౌస్‌పల్లి | ములుగు | " | " |
| 1030 | గద్దమీద మలియ్య (బాబు) | 35 | చంద్రయ్యపల్లి | దుగ్గొండి | " | " |
| 1031 | రాజయ్య | 60 | చెందోళి | గొల్లపల్లి | కరీంనగర్ | " |
| 1032 | మెరుగు రాజయ్య | 54 | రంగాపూర్ | హుజూరాబాద్ | " | " |
| 1033 | నాగేశ్వరమ్మ | 45 | బుక్కాపురం | వెల్దుర్తి | కర్నూలు | " |
| 1034 | తాయన్న | 45 | కోగిల తోట | హోళగుంద | " | " |
| 1035 | కప్పెర కృష్ణయ్య | 44 | ఉర్కొండపేట | మిడ్జిల్ | మ॥నగర్ | " |
| 1036 | నర్సయ్య | 40 | తక్కళ్ళపాడు | శాలిగౌరారం | నల్గొండ | " |
| 1037 | కోటమయ్య | 35 | ఎల్లుట్ల | పుట్లూరు | అనంతపురం | " |
| 1038 | చిన్నచోటు | - | నూయలోలం | దిలావర్‌పూర్ | ఆదిలాబాద్ | 02-09-2004 |
| 1039 | భువనకుర్తి నర్సింహులు | 48 | పాపిరెడ్డిగూడ | కేశంపేట | మ॥నగర్ | " |
| 1040 | చింతకింద హన్మంతు | 38 | దుద్యాల | బొంరాస్‌పేట | " | " |
| 1041 | కుర్వకూడూరు మల్లయ్య | 35 | నేరెళ్లపల్లి | తిమ్మాజిపేట | " | " |
| 1042 | నాగిశెట్టి సాంబశివరావు | 51 | అమృతలూరు | - | గుంటూరు | " |
| 1043 | లిల్యాల నాగయ్య | 66 | బాజీపూర్ | తిమ్మాజీపేట | మ॥నగర్ | " |
| 1044 | బూక్యా రామ్‌లానాయక్ | 45 | కల్లుబావితండా | గాండ్లపెంట | అనంతపురం | " |
| 1045 | లాడెపు సంపత్ | 28 | రంగపేట | మానకొండూర్ | కరీంనగర్ | " |
| 1046 | బోల్నేడు రామకృష్ణ | 29 | వేపకుంపల్లి | కారంపూడి | గుంటూరు | 03-09-2004 |
| 1047 | కురుబ దానా నాగన్న | 55 | కుర్లపల్లి | కళ్యాణదుర్గం | అనంతపురం | " |
| 1048 | కుదుదల సత్యనారాయణ | 26 | ఖాన్‌పాయిపేట | మంథని | కరీంనగర్ | " |

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1049 | కాసిదేట సారయ్య | 26 | నాగేపల్లి | మంథని | " | " |
| 1050 | దేవులపల్లి రమేష్ | 28 | - | నంగునూరు | మెదక్ | " |
| 1051 | మీసం వెంకటి | 32 | లిల్లీపూర్ | చిన్నకోడూరు | " | " |
| 1052 | మంగలి గోపాల్ | 40 | - | కొండాపూర్ | " | " |
| 1053 | బోమ బాబన్న | 45 | ఇటిక్యాల | - | మ॥నగర్ | " |
| 1054 | దాసరి వెంకన్న | 40 | కట్టకొమ్మగూడెం | చిలుకూరు | నల్గొండ | " |
| 1055 | కూర హన్మంతు | 55 | విలాసాగర్ | బోయినపల్లి | కరీంనగర్ | 03-09-2004 |
| 1056 | తిమ్మలరెడ్డి కాస్యరెడ్డి | 45 | రెడ్డిపాలెం | హన్మకొండ | " | " |
| 1057 | మాదిరెడ్డి భాస్కర్‌రెడ్డి | 24 | టేకులగూడెం | హన్మకొండ | " | " |
| 1058 | బోవల అంజనేయులు | 25 | తప్పెట్లమొర్సు | గట్టు | మ॥నగర్ | 04-09-2004 |
| 1059 | చిత్తూరు తిరుపతయ్య | 38 | లిష్టగుర్తి | వైరా | ఖమ్మం | " |
| 1060 | వేముల కనకయ్య | 45 | శ్రీరాములపల్లి | - | కరీంనగర్ | " |
| 1061 | వైకుంఠం | 50 | తీగలగుట్టపల్లి | - | " | " |
| 1062 | తిమ్మారెడ్డి | 54 | వెంకటగిరి | కోడమూరు | కర్నూలు | " |
| 1063 | సోమన్న | 42 | దేవనబండ | పత్తికొండ | " | " |
| 1064 | నర్సింహులు | 55 | దిల్సాంపల్లి | మారుమూల | రంగారెడ్డి | " |
| 1065 | రాములమ్మ | 40 | " | " | " | " |
| 1066 | అజ్మీరా రాజు | 30 | బావుసింగ్‌పల్లి | వెంకటాపురం | వరంగల్ | " |
| 1067 | నడ్డి శంకరయ్య | 30 | పులి మామిడి కుసం | అనుముల | నల్గొండ | " |
| 1068 | వరిశె వెంకటేశ్వరరావు | 30 | ప్రొద్దుటూరు | విజయవాడ | కృష్ణా | " |
| 1069 | షేక్ నర్సింలు | 38 | పాములపర్తి | వర్గల్ | మెదక్ | 05-09-2004 |
| 1070 | రంగు బిక్షపతి | 30 | నెంటూరు | " | " | " |
| 1071 | మూడావత్ రవి | 25 | దూప్‌సింగ్ తండా | మెదక్ | " | " |
| 1072 | పాటి ఈశ్వరరావు | - | లింగాల | మండవల్లి | కృష్ణా | " |
| 1073 | కొప్పుల లక్ష్మయ్య | 40 | మహబూబ్‌పేట | యాదిగిరిగుట్ట | నల్గొండ | " |
| 1074 | దూశెట్టి పోశెట్టి | 55 | సిరిపురం | రామన్నపేట | " | " |
| 1075 | అప్పం రంగయ్య | 42 | తిడుగు | జఫర్‌గఢ్ | వరంగల్ | " |
| 1076 | కొయ్యడ నర్సయ్య | 24 | కాకర్లపల్లి | రేగొండ | " | " |
| 1077 | దొంతరనేని వెంకట్రాజం | 40 | పోతారం(ఎస్) | హుస్నాబాద్ | కరీంనగర్ | " |
| 1078 | దుద్దిళ్ళ చంద్రమౌళి | 43 | రుద్రారం | " | " | " |
| 1079 | వెంకటమ్మ (మహిళ) | 50 | పర్ల | కల్లూరు | కర్నూలు | " |
| 1080 | ఆర్.ఇ.శ్రీరాములు | 50 | కృష్ణగిరి చిట్యాల | - | - | " |
| 1081 | కందు నారాయణ | 30 | దండేపల్లి | | ఆదిలాబాద్ | " |
| 1082 | నాలి రమణయ్య | 44 | పాపినేని పల్లి | లద్దపాడు | ప్రకాశం | " |
| 1083 | కిల్లాడ అచ్చయ్య నాయుడు | | బోగాపురం | రాంబిల్లి | విశాఖ | " |
| 1084 | అరివు | 30 | రూంతండా | పిట్లం | నిజామాబాద్ | " |
| 1085 | కాశబోయిన రామచంద్రం | 19 | గజ్వేల్ | గజ్వేల్ | మెదక్ | " |
| 1086 | దేవుని రాజయ్య | 25 | ఆకునూరు | చేర్యాల | వరంగల్ | 06-09-2004 |
| 1087 | దేవయ్య | 30 | చీకోడు | ముస్తాబాద్ | కరీంనగర్ | " |
| 1088 | మంత్రి నారాయణరావు | 30 | కశింకోట | కశింకోట | విశాఖ | " |
| 1089 | బత్తుల సుబ్బయ్య | | గుడ్డిమల్లం | ఏర్పేడు | చిత్తూరు | " |
| 1090 | ముస్కు యాదయ్య | 35 | యాచారం | యాచారం | రంగారెడ్డి | " |
| 1091 | పేరా సూర్యమోహన్‌రెడ్డి | 32 | గుళ్లదుర్తి | కోవెలకుంట్ల | కర్నూలు | 07-09-2004 |
| 1092 | కోమిని బాయి | 35 | సైదాపూర్‌తండా | కొండాపూర్ | మె దక్ | " |
| 1093 | సోమగారి రాములు | 55 | శభాస్‌పల్లి | శివ్వంపేట్ | మెదక్ | " |
| 1094 | తంగళ్లపల్లి రాజవ్వ | 38 | ధర్మారం | కోనరావుపేట | కరీంనగర్ | " |
| 1095 | లగడ చిత్తప్ప | 65 | దిన్నేహట్టి | గుడిబండ | అనంతపురం | " |
| 1096 | కె రామన్ | 32 | నాగరాళ్ల | పెబ్బేరు | మహబూబ్‌నగర్ | " |

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1097 | నరసింహమూర్తి | 40 | బొమ్మిరెడ్డిపల్లి | రొద్దం | అనంతపురం | ॥ |
| 1098 | ఈరుతి బాలు(నర్సయ్య) | 50 | రామకృష్ణాపూర్ | కొడియ్యాల | కరీంనగర్ | 08-09-2004 |
| 1099 | కల్లెడ రమేష్ | 25 | కట్కాపూర్ | రాయికల్ | కరీంనగర్ | ॥ |
| 1100 | సామల కోటమ్మ | 40 | శిరిగిరిపాడు | వెల్దుర్తి | గుంటూరు | ॥ |
| 1101 | చిత్తూరు గోవిందరావు | 39 | లక్ష్మీపురం | బోనకల్ | ఖమ్మం | ॥ |
| 1102 | బావండ్ల మల్లయ్య | 46 | రఘునాథపురం | రాజాపేట | నల్లగొండ | ॥ |
| 1103 | చిలుక రాజయ్య | 35 | పల్లెకుంట | హల్వర్ | కరీంనగర్ | ॥ |
| 1104 | ఆవుల మల్లయ్య | 50 | అంకుషాపురం | చిట్యాల | వరంగల్ | ॥ |
| 1105 | పవార్ శ్రీరాం( శ్రావణ్) | 52 | జామిడి | ఇచ్చోడ | ఆదిలాబాద్ | ॥ |
| 1106 | మద్దికుంట రాజయ్య | 55 | మార్కల్ | సదాశివనగర్ | నిజామాబాద్ | ॥ |
| 1107 | అందె వెంకటేశ్వర్లు | 40 | బ్రహ్మణేశ్వరం | దుత్తలూరు | నెల్లూరు | ॥ |
| 1108 | మానేని శివయ్య | 32 | నాగలూరు | ధర్మవరం | అనంతపురం | ॥ |
| 1109 | నల్లబోతు వెంకటయ్య | | పానగల్ | నల్లగొండ | నల్లగొండ | 9-09-20004 |
| 1110 | అబరవేన రాజయ్య | 34 | కిష్టంపేట్ | కాల్వనారాయణపూర్ | కరీంనగర్ | ॥ |
| 1111 | గంట మోహన్ రెడ్డి | 62 | మొలంగూర్ | శంకరపట్నం | కరీంనగర్ | ॥ |
| 1112 | మల్లారపు మైసయ్య | 55 | నాగులపల్లి | జూలపల్లి | కరీంనగర్ | ॥ |
| 1113 | మేడిబోయిన వెంకటేశ్వరావు | 42 | దుక్కిరాల | పెదవేగి | ప.గోదావరి | ॥ |
| 1114 | కొర్రపాటి జగన్మోహనరావు | 50 | తూర్పుపాలెం | కొండాపురం | నెల్లూరు | ॥ |
| 1115 | విపారపట్నం పేరయ్య | 65 | కర్లకుంట | రొంపిచర్ల | గుంటూరు | ॥ |
| 1116 | పాపరబోయిన నర్సింహులు | 36 | అన్నారం | మచ్చారెడ్డి | నిజామాబాద్ | ॥ |
| 1117 | కొండపల్లి యాదయ్య | 40 | లక్కారం | చౌటుప్పల్ | నల్లగొండ | ॥ |
| 1118 | వెన్నపూస నారాయణ రెడ్డి | 45 | మాయలూరు | ఉయ్యాలవాడ | కర్నూలు | 10-09-2004 |
| 1119 | పెద్ద పుల్లయ్య | 28 | బోయినపల్లి | వెల్దుర్తి | కర్నూలు | ॥ |
| 1120 | గోత బాల్‌రెడ్డి | 30 | దిమ్మగుడి | పెద్దవడుగూరు | అనంతపురం | ॥ |
| 1121 | పుల్లారెడ్డి | 40 | మున్ననూర్ | గోపాల్‌పేట | మ.నగర్ | ॥ |
| 1122 | ఎరుకలి పోచయ్య | 50 | రాందాస్‌గూడ | కాడిపల్లి | మెదక్ | ॥ |
| 1123 | పాయిరి రవి | 26 | చిద్నేపల్లి | కాటారం | కరీంనగర్ | ॥ |
| 1124 | పుల్లయ్య | 35 | కొత్తకోట | డోన్ | కర్నూలు | ॥ |
| 1125 | లింగోతు ఈర్య | 32 | కొత్తరాంతండా | గీసుకొండ | వరంగల్ | ॥ |
| 1126 | దండా సుబ్బారావు | | బొబ్బేపల్లి | మార్టూరు | ప్రకాశం | 11-09-2004 |
| 1127 | వర్కోలు దుర్గయ్య | 45 | మేడిపల్లి | చిన్నకోడూరు | మెదక్ | ॥ |
| 1128 | చింగేపల్లి సంగారెడ్డి | 30 | పుల్‌కుర్తి | మనూరు | మెదక్ | ॥ |
| 1129 | హోరియా | | వెలిమలతండా | ఆర్.సి పురం | మెదక్ | ॥ |
| 1130 | లక్ష్మీనర్సయ్య | 37 | రామక్కపేట | దుబ్బాక | మెదక్ | ॥ |
| 1131 | కోలుపురి మణెమ్మ | 30 | బద్దెనపల్లి | సిరిసిల్ల | కరీంనగర్ | ॥ |
| 1132 | బాసుల ఎర్రయ్య | 35 | పెద్దంపేట | మహదేవపురం | కరీంనగర్ | ॥ |
| 1133 | దూదేకుల ఖాసింపీరా | 26 | జంతూలూరు | బుక్కరాయసముద్రం | అనంతపురం | ॥ |
| 1134 | రెడ్డిబోయిన కనకయ్య | 26 | జల్వంతపూర్ | దుబ్బాక | మెదక్ | 12-09-2004 |
| 1135 | రెడ్డి తిరుమలయ్య | 38 | చల్మెడ | రాయంపేట | మెదక్ | ॥ |
| 1136 | రంగనాథ్ | 35 | గంగులాయిపాళ్యా | మడకశిర | అనంతపురం | ॥ |
| 1137 | కొండి శ్రీనివాసరావు | 32 | గొకనకొండ | వినుకొండ | గుంటూరు | ॥ |
| 1138 | బేరే నారాయణ | | ఎలుకర్తి | అనేగల్ | అనంతపురం | ॥ |
| 1139 | చింతం మాధవరెడ్డి | 55 | పోరండ్ల | తిమ్మాపూర్ | కరీంనగర్ | ॥ |
| 1140 | కమ్మరి మోహన్ | 35 | అంబకంటి | కుంటాల | ఆదిలాబాద్ | 13-09-2004 |
| 1141 | భూమన్న | | మెట్‌పల్లి | మక్లూర్ | నిజామబాద్ | ॥ |
| 1142 | చిన్న జంగయ్య | 48 | ఇర్విన్ | మాడ్గుల | మ.నగర్ | ॥ |
| 1143 | పబ్బె కృష్ణయ్య | 45 | చేగూర్ | కొత్తూర్ | మ.నగర్ | ॥ |
| 1144 | కంది దాసు | 25 | పడకల్ | వెల్దటూర్ | కరీంనగర్ | ॥ |
| 1145 | వేగుంట నాగరత్నమ్మ | 52 | వేపకుంట | చిన్నఅవుటపల్లి | కృష్ణా | ॥ |

నిర్ణయించినట్లు తెలిపారు. అలాగే సీడ్ విలేజ్ ద్వారా రైతులకు మేలురకపు,అధికోత్పత్తి విత్తనాలను అందిస్తామని చెప్పారు. విత్తన తనిఖీ కేంద్రాలను జవాబుదారులుగా చేస్తామని పేర్కొన్నారు.

### చెరువుల అభివృద్ధికి నిధులు

దేశంలో సాగునీటి వనరుల అభివృద్ధిలో భాగంగా సేద్యంలో ప్రత్యక్షంగా సంబంధం వున్న వనరులు అంటే చెరువులు, కుంటల మరమ్మతు, పరిరక్షణకు రు.300 కోట్ల రూపాయలను జాతీయ పథకాన్ని కేంద్ర ప్రభుత్వం ఆమోదించింది. ఇందులో కేంద్రం 225 కోట్లు, రాష్ట్రాలు రు.75 కోట్లను వాటాగా భరిస్తాయి. 7 నుండి 10 ఏండ్ల లో పూర్తయ్యే పథకం క్రింద ఈ నిధులను ఖర్చు చేస్తారు. దేశంలో మొత్తం 50 లక్షల చెరువులు వున్నాయి.

### పెరిగిన బయెటెక్ పంటల విస్తీర్ణం

ప్రపంచంలో బయెటెక్ పంటల విస్తీర్ణం గణనీయంగా పెరిగింది. 2004లో సుమారు 20 కోట్ల ఎకరాల్లో ఈ పంటలు వేసినట్లు గణాంకాలు తెలుపుతున్నాయి. గత ఏడాదితో పోలిస్తే దాదాపు 20 శాతం పెరిగినట్లు ఈ అంశంపై పరిశోధన చేసిన ఒక నివేదిక తెలుపుతోంది. 17 దేశాల్లో 82.5 లక్షల మంది ఈ పంటలు పండించారని తెలిపింది. అమెరికాలో బయోటెక్ పంటల విస్తీర్ణం అధికంగా వుందని, ఇటీవల కాలంలో అభివృద్ధి చెందుతున్న దేశాలలో ఈ పంటల విస్తీర్ణం గణనీయంగా పెరుగుతోందని పేర్కొంది. అభివృద్ధి చెందిన దేశాల్లో 13 శాతం వృద్ధి రేటు వుండగా, అభివృద్ధి చెందుతున్న దేశాల్లో 35 శాతం వృద్ధి కనపడుతోంది.

### పొగాకు వివరాలు

| సంవత్సరం | ఉత్పత్తి | వచ్చిన | సగటు |
|---|---|---|---|
| - | లక్ష్యం | ఉత్పత్తి | ధర |
| - | (మి.కే.) | - | - |
| 1995 | 66.24 | 74.15 | 25.62 |
| 1996 | 74.90 | 90.11 | 33.03 |
| 1997 | 84.06 | 111.41 | 40.00 |
| 1998 | 110.39 | 130.69 | 40.12 |
| 1999 | 99.29 | 147.18 | 34.85 |
| 2000 | 101.61 | 131.63 | 32.16 |
| 2002 | 98.921 | 20.05 | 33.22 |
| 2003 | 102.30 | 127.56 | 34.83 |
| 2004 | 110.46 | 147.89 | 34.91 |

### మహారాష్ట్రలో చక్కెర ఉత్పత్తి

దేశంలో చక్కెర ఉత్పత్తి చేసే అగ్రగామి రాష్ట్రాల్లో ఒకటైన మహారాష్ట్ర 205-06లో తిరిగి పుంజుకోనుంది. 2000-01లో అత్యధికంగా 67.05 లక్షల టన్నుల చక్కెర ఉత్పత్తి అయింది. ఆ ఏడాది మిల్లులు 576.49 లక్షల టన్నుల చెరుకు ఆడాయి. అయితే 2003-04లో 290.77 లక్షల టన్నుల చెరుకు ఆడి, 31.75 లక్షల టన్నుల చెక్కెర ఉత్పత్తి చేసింది. 2004-05లో మరింత తగ్గింది. 23 లక్షల టన్నుల చక్కెర మాత్రమే ఉత్పత్తి అయింది. అయితే ఈ సీజన్‌లో దాదాపు 320 ల.టన్నుల చెరకు ఆడి, 40 లక్షల టన్నుల చక్కెర ఉత్పత్తి కావచ్చని అంచనా వేస్తున్నారు.

### చింతపండు కొనుగోలు

రాష్ట్రంలోని అటవీ ప్రాంతాల్లోని సేకరించిన చింతపండును గిరిజన సహకార సంస్థ(జిసిసి) ద్వారా కొనుగోలు చేయాలని ముఖ్యమంత్రి అధికార్లను ఆదేశించారు. మార్కెటింగ్ వసతుల కోసం 3 కోట్ల రూపాయలను విడుదల చేస్తున్నట్లు ప్రకటించారు. కేజీకి 6 రూపాయల చొప్పున మద్దతు ధర చెల్లించాలని చెప్పారు. ఏజెన్సీ ప్రాంతాల్లో గోదాములు, ఫ్లాట్‌ఫారాలు, తూకం స్కేళ్లు అందుబాటులో వుంచాలని, జిల్లా కలెక్టర్లు ఇందుకు సహకరించాలని చెప్పారు.

### ప్రాజెక్టుల నాణ్యత పర్యవేక్షణ అధికారి

రాష్ట్రంలోని భారీ, మధ్యతరహా ప్రాజెక్టుల పనుల నాణ్యతను పర్యవేక్షించడానికి రాష్ట్ర ప్రభుత్వం ఒక అధికారిని నియమించింది. నీటిపారుదల శాఖ మాజీ చీఫ్ ఇంజనీర్, నేషనల్ అకాడమీ ఆఫ్ కన్‌స్ట్రక్షన్ అదనపు డైరక్టర్ జనరల్ టి ఎస్ ప్రకాశరావు గారిని సాగునీటి ప్రాజెక్టుల ఎక్స్‌అఫిషియో కమిషనర్‌గా నియమిస్తు ఉత్తర్వులు జారీ చేసింది.

### ప్రాజెక్టుల భూసేకరణ కమిటీ

సాగునీటి ప్రాజెక్టుల కోసం భూసేకరణ, నష్టపరిహారం చెల్లింపు, కోర్టు కేసులు తదితర అంశాలపై అధ్యయనం చేసేందుకు ముగ్గురు సభ్యులతో ప్రభుత్వం ఒక కమిటీని నియమించింది. ఈ కమిటీ భూసేకరణ విధానాన్ని సమీక్షిస్తుంది. కమిటీ ఛైర్మన్‌గా ఆర్థిక శాఖ ముఖ్యకార్యదర్శి, నీటిపారుదల శాఖ కార్యదర్శి మెంబర్ కన్వీనర్‌గాను, న్యాయశాఖ కార్యదర్శి సభ్యుడిగా వుంటారు.

### చెరువుల మరమ్మతులకు నిధులు

రాష్ట్రంలోని చెరువుల మరమ్మతుకు చిన్నతరహా నీటిపారుదల శాఖ 120 కోట్ల రూపాయలను విడుదల చేసింది. ఇందులో 60 కోట్ల నగదు, 60 కోట్ల విలువ చేసే బియ్యం కేటాయించారు. పది లక్షల రూపాయల కంటె తక్కువ విలువ గల పనిని మంజూరు చేసే అధికారం జిల్లా కలెక్టర్‌కు ఇచ్చారు. కో ఆర్డినేటర్‌గా సూపరింటెండెంట్ ఇంజనీర్ వ్యవహరిస్తారు. పంచాయితీరాజ్ శాఖ పరిధిలోని చెరువులను కూడా మరమ్మతులు చేయనున్నారు. ఇందుకోసం ఒక్కో చెరువుకు రెండు లక్షల వ్యయం చేస్తారు.

### నీటివనరుల అభివృద్ధి పైలట్ ప్రాజెక్టు

నీటి వనరులను అభివృద్ధి చేసే ప్రత్యేక పథకం క్రింద 100 కోట్ల రూపాయలను కేటాయించి గత ఏడాది కేంద్ర ప్రభుత్వం ప్రకటించిన పైలట్ ప్రాజెక్టు ఇపుడు అమల్లోకి వచ్చింది. నీటిపారుదల సౌకర్యం తక్కువగా వుండి, కరువుతో అల్లాడుతున్న జిల్లాల్లో నీటివనరులను అభివృద్ధి చేసే దృష్టితో రాష్ట్రంలోని అనంతపురం, మహబూబ్‌నగర్ జిల్లాను మొదట ప్రతిపాదించి, తర్వాత రంగారెడ్డి, మెదక్, కడపలను చేర్చారు. ఈ ప్రాజెక్టు పనులను అమలు చేయడానికి 10 కోట్ల రూపాయలు విడుదల అయ్యాయని నీటిపారుదల శాఖ ముఖ్యకార్యదర్శి తక్కర్ చెప్పారు.

### నాబార్డు పంట రుణాలు

2005-06 ఆర్థిక సంవత్సరానికి నాబార్డు రుణ ప్రణాళికను ఖరారు చేసింది. ఈసారి పంట రుణాల క్రింద దాదాపు 15వేల కోట్లను పంపిణీ చేయడానికి సంసిద్ధత వ్యక్తం చేసింది. ప్రాధాన్యతా రంగాలకు రు.29,422 కోట్లను కేటాయించారు. ఒక్క వ్యవసాయ రంగానికే 18,683 కోట్లను అందిస్తారు. గత సంవత్సరంతో పోలిస్తే పంటరుణాలను 37 శాతం పెంచామని తెలిపారు. కేటాయింపులు క్రింది విధంగా వున్నాయి

| రంగం | కేటాయింపు(రు.కోట్లలో) |
|---|---|
| పంటరుణాలు | 15,078 |
| చిన్ననీటిపారుదల | 773 |
| భూమి అభివృద్ధి | 196 |
| ఆధునిక పరికరాలు | 731 |
| హార్టికల్చర్ | 310 |
| పట్టుపరిశ్రమ | 85 |
| మేకలు, గొర్రెలు | 124 |
| మత్స్య పరిశ్రమ | 271 |




## విత్తన కొనుగోళ్లకు 'వ్యాట్' నుండి విముక్తి

విత్తన కొనుగోళ్లలో రైతులు ప్రతి సంవత్సరం 'వ్యాట్' క్రింద చెల్లించే నాలుగు శాతం పన్నును కేంద్ర ప్రభుత్వం రద్దుచేసింది. ఈ నిర్ణయం వలన రైతులకు ఏటా 60 కోట్ల రూపాయలు ఆదా అవుతుంది. పన్నును రద్దు చేయాలని రాష్ట్ర మంత్రివర్గం చర్చించి, కేంద్రంపై ఒత్తిడి తెచ్చిన మీదట ఈ నిర్ణయం చేసింది. ఈ మేరకు ఉత్తర్వులు కూడా జారీ చేసింది.

## మిర్చి ఎగుమతి సంస్థ

రాష్ట్రం నుండి మిర్చి ఎగుమతులను పెంపొందించడానికి గుంటూరు కేంద్రంగా ఎగుమతి సంస్థ ఏర్పాటు చేస్తారు. అ అగ్రి ఎక్స్‌పోర్ట్ ఫర్ చిల్లీస్‌ను 20.32 కోట్లతో నెలకొల్పుతారు. ఈ ఖర్చును రాష్ట్రం, కేంద్రం, ప్రయివేటు సంస్థలు భరిస్తాయి. రాష్ట్రవాటి 5.72 కోట్ల రూపాయలు, కేంద్రం వాటా 2.69 కోట్లు సమకూరుస్తుండగా, ప్రయివేటు సంస్థలు 11.90 కోట్లు రూపాయలు భరిస్తున్నాయి. ఇది ఈ ఏడాది నుండి 2009 వరకు పనిచేస్తుంది. సరుకు నాణ్యత, ప్రమాణాలు, రంగు తదితర అంశాలపై దృష్టి పెడుతుంది.

## విద్యుత్ కనెక్షన్స్- సరఫరా

వ్యవసాయ విద్యుత్ కనెక్షన్స్ కోసం దరఖాస్తు చేసుకునే దరఖాస్తుదారుల్లో సీనియారిటీ ప్రాతిపదికన 50 వేల కనెక్షన్స్ ఇవ్వాలని ముఖ్యమంత్రి విద్యుత్ అధికారులను ఆదేశించారు. అలాగే పంటలు ఎండిపోకుండా 7 గంటల పాటు నిరాటకంగా విద్యుత్ సరఫరా చేయాలని విద్యుత్ సమీక్షా సమావేశంలో అధికారులకు చెప్పారు. తాత్కాల్ పథకం క్రింద డిపాజిట్ కట్టిన వారందరికి కనెక్షన్స్ ఇవ్వాలని అన్నారు. కనెక్షన్స్ జారీ విషయంలో పారదర్శకత కోసం విద్యుత్ సెక్షన్ కార్యాలయాలు, రెవిన్యూ కార్యాలయాల్లోను, సబ్‌స్టేషన్ల పరిధిలోను రైతుల జాబితాలను ప్రదర్శించాలని సూచించారు.

## రైతుల ఆత్మహత్యలు

కాంగ్రెస్ ప్రభుత్వం అధికారంలోకి వచ్చినప్పటినుండి మార్చి 10 వరకు రాష్ట్రంలో 1395 మంది ఆత్మహత్య చేసుకున్నట్లు అధికార్లకు అభ్యర్ధనలు అందాయి. ( ఈ సంఖ్య అంతకంటె ఎక్కువగానే వుంది) ఇందులో 756 ఆత్మహత్యలు మాత్రమే వ్యవసాయ సంబంధిత సమస్యల వల్ల జరిగాయని, ఇందులో 645 కేసులకు పరిహారాన్ని అందించామని ప్రభుత్వం ప్రకటిం చింది. ఇంకా 639 ఆత్మహత్యలు నష్టపరిహారానికి అర్హత లేనివిగా వరిగణించారు. ఆత్మహత్యలుగా ప్రభుత్వం గుర్తించిన వాటిలో మహబూబ్ నగర్ జిల్లాలో ఎక్కువగా వున్నాయి.

## అడుగంటుతున్న భూగర్భ జలాలు

రాష్ట్రంలోని 18 జిల్లాల్లోని 167 మండలాల్లో భూగర్భ జలాలు ఎన్నడూ లేనంతగా దిగజారాయి. మొత్తం 612 మండలాల్లో నీటి నిల్వలు తగ్గినప్పటికి 167 మండలాలు ప్రమాదస్థాయిలో వున్నాయని భూగర్భజల శాఖ ప్రకటించింది. రాష్ట్రంలో గత ఏడాది 7156 బోరింగ్ పంపులు ఎండిపోగా, ఈ ఏడాది 13,899 బోర్లు ఎండిపోయాయి. భూగర్భజలాలు విషయంలో రెడ్ ఎలర్ట్‌గా ప్రకటించిన మండలాలు జిల్లాల వారీగా క్రింది విధంగా వున్నాయి. అనంతపూర్-28, కడప-17, చిత్తూరు-17, కర్నూలు-5, మహబూబ్‌నగర్-18, మెదక్-17, నిజామాబాద్-10, రంగారెడ్డి-5, కరీంనగర్-5, వరంగల్-5, నల్లగొండ-4, ఆదిలాబాద్-4, ఖమ్మం-2, పశ్చిమ గోదావరి-7, తూర్పుగోదావరి-4, కృష్ణా-6, గుంటూరు-1, ప్రకాశం12. మొత్తం 167.

## విత్తన ప్లాంటులకు నిధులు

మూతపడిన తొమ్మిది విత్తన కంపెనీలను పునరుద్ధరించేందుకు 5 కోట్ల రూపాయలను విడుదల చేస్తున్నట్లు వ్యవసాయ శాఖామంత్రి శాసనసభలో తెలిపారు. గుర్తింపు పొందిన కంపెనీల నుండి విత్తనాలను రైతులకు సరఫరా చేయాలని ప్రభుత్వం

## మద్దతు ధరలపై కేంద్రానికి రాష్ట్రం సిఫారసు

వచ్చే ఆర్థిక సంవత్సరం (2005-06) లో వివిధ పంటలకు కనీస మద్దతు ధరలను సిఫారసు చేస్తూ రాష్ట్ర ప్రభుత్వం కేంద్రానికి లేఖ రాసింది. గత ఏడాది కన్నా పంటల పెట్టుబడి వ్యయం పెరిగిందని,గిట్టుబాటు కావాలంటే ధరలు పెంచాలని సూచించింది. దాదాపు అన్ని పంటలకు ఇప్పుడున్న ధరల కన్నా అదనంగా ప్రతిపాదించింది. ఈ విషయాన్ని వ్యవసాయశాఖామంత్రి శాసనసభలో తెలిపారు.

| పంట - | 2004-05 లో సిఫారసు చేసిన ధర | నిర్ణయించింది | 2005-06 సిఫారసు |
|---|---|---|---|
| వరి (గ్రేడు - ఎ) | 680 | 590 | 705 |
| వరి (సాధారణ) | 645 | 560 | 675 |
| జొన్న | 800 | 515 | 900 |
| సజ్జ | 706 | 515 | 800 |
| మొక్కజొన్న | 538 | 525 | 650 |
| రాగి | 764 | 515 | 850 |
| కందులు | 1784 | 1390 | 2000 |
| పెసలు | 1700 | 1410 | 1900 |
| మినుములు | 1859 | 1410 | 1950 |
| వేరుశనగ | 2268 | 1500 | 2400 |
| పొద్దుతిరుగుడు విత్తనం | 2035 | 1340 | 2200 |
| నువ్వులు | 1500 | 1500 | 2200 |
| సోయాబీన్ (నల్లవి) | 900 | 900 | 2200 |
| సోయాబీన్ (పసుపుపచ్చని) | 1000 | 1000 | 2200 |
| పత్తి (ఎఫ్-14/జె-34/హెచ్-7) | 2700 | 1760 | 2800 |
| పత్తి (ఎఫ్-4/ఎం.సి.యు-5) | 2847 | 1960 | 3000 |

# తెలుసుకో రైతన్నా..

## హద్దులు - ఎల్లలు ఏర్పాటు

ప్రతి రెవిన్యూ గ్రామానికి భూమి పటం గీచి వుంటుంది. గ్రామంలోని ప్రతి సర్వే నంబరుకు, భూమి పటాలు, మ్యాపులు వుంటాయి. ప్రతి ఒక్క సర్వే నంబరులో వున్న భూమి విస్తీర్ణంలో తేడా చాలా వుంటుంది. సాధారణంగా 5 ఎకరాలు, అంతకు మించి విస్తరించి వుంటుంది. మెట్ట భూముల్లోను, తెలంగాణాలోని అన్ని ప్రాంతాల్లోను సర్వే నంబరు ఇంకా పెద్దగా వుండవచ్చును. కొన్ని సార్లు తెలంగాణా ప్రాంతములో పెద్ద విస్తీర్ణాల లోని సర్వేకాని ( కొలతలు వేయని, హద్దులు గుర్తించని) భూములు ఒక సర్వే నంబరులో చేరి వుండవచ్చును.

ఆంధ్ర, రాయలసీమ జిల్లాల్లోని అన్ని భూములకు విశ్వసనీయమైన భూమి రికార్డులు, పటాలు వున్నాయి. తెలంగాణాలో భూమి రికార్డులు, మ్యాపులు అంతగా, నిర్దిష్టంగా లేవు. ఒక్కొక్కసారి వాస్తవ పరిస్థితిలో ఎంతో తేడాగా వుండవచ్చును.

1. భూమి సరిహద్దు గుర్తింపు ఈక్రింది సందర్భాలలో అవసరమవుతుంది.
- భూముల గుర్తింపు
- కొనడం లేదా అమ్మడం
- భూముల విభజన
- మార్పిడి లేదా పట్టా బదలి
- భూమి తగాదాలు
- ప్రభుత్వ భూములపై దురాక్రమణ
- సరిహద్దు తగాదాలు
- కొలతల్లో పొరపాట్లు
- భూమి రికార్డుల్లో పొరపాట్లు

**భూమి సరిహద్దుల ఏర్పాటుకై దరఖాస్తు చేయడం ఎలా?**

సరిహద్దు సర్వే గుర్తింపు అనేది చట్టరీత్యా విద్యుక్తమైన ఒక నియమబద్ధమైన పద్ధతి. ఏదో వాడుక పద్ధతిలో, భూమిని కొలతలు వేయడం మాత్రమే కాదు. సరిహద్దుల గుర్తింపునకై స్థానిక రెవెన్యూ అధికారి గారికి ధరఖాస్తు చేయాలి. ఆ దరఖాస్తునందు మీకు సరిహద్దు గుర్తింపు కావలసిన సర్వే నెంబరు, రిజిష్టరు ఐన సబ్ డివిజన్ నెంబరు ఇవ్వాలి. ఈ వివరాలు గ్రామ కార్యదర్శి వారి వద్ద ఉంటాయి.

2. సదరు భూమిపైన మీకు ప్రమేయం, హక్కులు ఉన్నట్లు ప్రామాణికమైన పత్రాలు దాఖలు చేయాలి.
- రికార్డ్ ఆఫ్ రైట్స్ (ఆర్.ఒ.ఆర్)
- పట్టాదారు పాసు పుస్తకం
- ధృవీకరించిన ' పహనీ' లేదా ' అడంగలు' కాపీ గ్రామ లెక్కల నుండి
- రిజిష్టరైన క్రయ దస్తావేజు

(వి.ఏ.ఓ/గ్రామ కార్యదర్శి వద్ద అడంగల్ వంటి ప్రామాణిక పత్రాలు లభిస్తాయి.

3. ఒక సబ్ డివిజన్ గుర్తింపు, సరిహద్దులు స్థిరము చేయటానికి రుసుము రూ. 110/- చలానా ద్వారా కట్టవలెను. సమీపంలోని సబ్‌ట్రెజరీ కార్యాలయంలో చలానా కట్టాలి.

| | | |
|---|---|---|
| ఎం.హెచ్ | 0029 | భూమి శిస్తు |
| ఎస్.హెచ్ | 106 | సర్వే సెటిల్‌మెంట్ వ్యవహారలెక్కలలో ఖాతా |
| ఎస్.హెచ్ | (01) | సర్వే భూమి రికార్డుల. సంబంధమైన . వ్యవహారాలలో ఆదాయం ఖాతా |

- ఈ ధరఖాస్తును జతపరిచిన కాగితాలు, చలానా రశీదులతో సహా తెల్లకాగితం మీద సంబంధిత మండల రెవెన్యూ అధికారి గారికి వ్రాయాలి. అప్పుడు మండల రెవెన్యూ అధికారి ఈ పనిని మండల సర్వేయర్‌కు అప్పగిస్తారు తర్వాత సర్వేయర్ ధరఖాస్తుదారునికి నోటీసు ఇచ్చి, ఆస్తులన్ని సందర్శించి దరఖాస్తుదారు సమక్షంలో సరిహద్దును ఏర్పాటు చేస్తారు.
- కొన్ని ప్రత్యేకమైన కేసులలో ఎ.డి. స్వయంగా పొలం వద్దకి వచ్చి పర్యవేక్షించాలని వ్రాత పూర్వకంగా కూడా కోరవచ్చును. ☆

## రైతుల నుండి ముక్కుపిండి వసూలు చేస్తారు...

### మరి ఆ ' పెద్దవాళ్ల ' నుండి?....




రైతు బ్యాంకుకు అప్పుపడితే అధికార్లు ఊళ్లోకి వచ్చి, ఇంటి పైబడి, జప్తు చేసి మరీ బకాయిలు వసూలు చేసుకుపోతాయి. పంటలు లేవు. ఈ ఒక్కసారికి వదిలిపెట్టండి. వచ్చే సంవత్సరం మొత్తం బకాయి చెల్లిస్తామన్నా వినకుండా అధికారగణం ఇళ్లు గుల్లచేస్తారు. ఇది భరించలేని రైతులు ఆత్మహత్యలు పాల్పడిన ఘటనలు కోకొల్లలు. ఇదీ ప్రభుత్వాల వైఖరి.

నేడు బడా పెట్టుబడిదారులు బ్యాంకులకు కట్టవలసిన సొమ్మెంతో తెలుసా. అక్షరాలా రు.96,084 కోట్లు.(2004 మార్చి నాటికి). ఇది కేవలం అసలు మాత్రమే.అప్పు తీసుకున్న నాటినుండి వడ్డీతో లెక్కకడితే దాదాపు 3 లక్షల కోట్లు అవుతుంది. 1997 మార్చినాటికి 47,30( కోట్ల రూపాయలు 2004 నాటికి 96వేల కోట్లకు పెరిగింది. ఎగవేత దారుల్లో కోటి రూపాయలకు పైగా అప్పుతీసుకున్న వాళ్లు 13,022 మంది వున్నారు. బ్యాంకులకు రావాల్సిన ఈ బకాయిలు మొత్తం బ్యాంకు ఆస్తుల్లో 20 శాతం వున్నాయని అధికారులు చెపుతున్నారు.

దేశంలో అత్యధికంగా మొండి బకాయిలు పేరుకుపోయిన రాష్ట్రాల్లో మహారాష్ట్రది మొదటి స్థానం. అక్కడి నుండి సుమారు 37,396 కోట్ల రూపాయలను ఈ 'పెద్దవాళ్లు కట్టాల్సివుంది. రెండవస్థానం ఢిల్లీ, మూడవస్థానం తమిళనాడు. నాల్గవ స్థానంలో మనదే. మన రాష్ట్రం నుండి 1117 మంది ఎగవేతదారులు దాదాపు 6,542 కోట్ల రూపాయలు బ్యాంకులకు కట్టాల్సి వుంది. వాళ్లపై కేసులు వున్నాయి. కానీ ఎలాంటి చర్యలూ లేవు. వారి జోలికి వెళ్లరు. ప్రభుత్వం వారిపై ఎందుకు కొరడా ఝుళిపించదు?

రైతుకు రుణం కావాలంటే బ్యాంకుల చుట్టూ కాళ్లరిగేలా తిరగాలి. చీవాట్లు, ఛీదరింపులతో ఎట్టకేలకు అప్పు ఇస్తారు. ఇంకొన్ని సందర్భాల్లో ఆందోళన చేస్తే గానీ అప్పుపుట్టదు. కానీ ఈ బడా పెద్దోళ్లను సాదరంగా ఆహ్వానించి అప్పులిస్తారు. సకల మర్యాదలు చేస్తారు.ఇదేమని అడిగితే రైతులు అప్పులు కట్టరు. అందుకే రుణాలివ్వాలంటే భయమని అధికారులంటారు ఆశ్చర్యకరమైన విషయమేమంటే రుణాలుగా తీసుకున్న ప్రతి రూపాయిలో వ్యవసాయ రంగం 71 పైసలు చెల్లిస్తుంటే ఈ కుబేరులు మాత్రం అర్ధరూపాయి కూడా చెల్లించడం లేదు.

ఇప్పటికైనా ప్రభుత్వం వెంటనే కదిలి ఈ మొండి బకాయిలను ముక్కుపిండి వసూలు చేయాలి. కట్టనివారిపై క్రిమినల్ కేసులు పెట్టాలి. కఠినంగా శిక్షించాలి. సంక్షోభంలో వున్న రైతుకు ఆసరాగా వుండి, సకాలంలో అప్పులివ్వాలి. ☆

Printed & Published by B.TULASIDAS on behalf of A.P.Rytu Sangham, 1-1-9/10, Jawaharnagar, Musheerabad, Hyderabad-20
at Prajasakti Printing Press, RTC 'x' Roads, HYDERABAD.20. Editor. B.TULASIDAS

# రాష్ట్రంలో రబీ పంటల సాగు విస్తీర్ణం వివరాలు

| పంట | రబీ సాధారణ విస్తీర్ణం | ప్రణాళిక నిర్ణయించిన విస్తీర్ణం | మార్చి 16 2004 నాటికి వేసినది | 16.03.05 నాటికి వేసినది | సాధారణ విస్తీర్ణంలో శాతం | ప్రణాళిక విస్తీర్ణంలో శాతం |
|---|---|---|---|---|---|---|
| వరి | 10.76 | 8.00 | 8.08 | 8.42 | 78% | 105% |
| గోధుమ | 0.13 | 0.12 | 0.12 | 0.09 | 67% | 72% |
| జొన్న | 3.65 | 5.00 | 4.46 | 3.11 | 85% | 62% |
| సజ్జ | 0.10 | 0.20 | 0.12 | 0.06 | 60% | 31% |
| మొక్కజొన్న | 1.11 | 2.80 | 2.10 | 1.58 | 142% | 56% |
| రాగులు | 0.13 | 0.20 | 0.10 | 0.07 | 54% | 35% |
| ఇతరములు | 0.02 | 0.02 | 0.00 | 0.34 | 17% | 0% |
| **మొత్తం ముతక ధాన్యాలు** | **5.01** | **8.22** | **6.79** | **4.82** | **96%** | 59% |
| కందులు | 0.06 | 0.05 | 0.13 | 0.11 | 167% | 216% |
| శనగలు | 2.92 | 5.00 | 4.54 | 3.59 | 123% | 72% |
| పెసలు | 1.45 | 2.80 | 2.42 | 0.97 | 67% | 35% |
| మినుము | 4.57 | 4.60 | 3.68 | 3.14 | 69% | 68% |
| ఉలవలు | 0.70 | 0.90 | 0.82 | 0.64 | 91% | 71% |
| ఇతర పప్పుధాన్యాలు | **0.16** | **0.20** | 0.29 | 0.26 | 160% | 130% |
| **మొత్తం పప్పుధాన్యాలు** | **9.87** | **13.55** | **11.89** | **8.70** | **88%** | 64% |
| **మొత్తం ఆహార ధాన్యాలు** | **25.77** | **29.89** | **26.89** | **22.03** | **86%** | 74% |
| వేరుశనగ | 2.47 | 3.25 | 2.97 | 2.62 | 106% | 81% |
| నువ్వులు | 0.42 | 0.60 | 0.50 | 0.32 | 76% | 53% |
| పొద్దుతిరుగుడు | 2.21 | 4.00 | 3.83 | 3.73 | 169% | 93% |
| కుసుమ | 0.17 | 0.20 | 0.17 | 0.17 | 101% | 86% |
| ఇతర నూనెగింజలు | 0.32 | 0.23 | 0.41 | 0.33 | 60% | 450% |
| **నూనె గింజలు** | **5.57** | **8.28** | **7.89** | **7.17** | **129%** | 87% |
| పొగాకు | 1.07 | 1.35 | 1.36 | 1.21 | 114% | 90% |
| మిరప | 0.53 | 0.55 | 0.70 | 0.58 | 108% | 105% |
| పత్తి | 0.08 | - | 0.06 | 0.03 | 38% | - |
| ధనియాలు | - | - | 0.36 | 0.21 | - | - |
| ఉల్లిగడ్డలు | 0.13 | 0.14 | 0.14 | 0.12 | 90% | 86% |
| **మొత్తం మెట్టపంటలు** | **22.40** | **32.21** | **29.32** | **22.94** | **102%** | 71% |
| **మొత్తం సాగు విస్తీర్ణం** | **33.16** | **40.21** | **37.40** | **31.36** | **95%** | 78% |

**ఆధారం :** డైరెక్టరేట్ ఆఫ్ అగ్రికల్చర్ .

( అంకెలు ప్రాథమికమైనవి.)

మనము ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KLVA106M224 |
| పుస్తకం పేరు | రైతువాణి |
| తారీఖు | 07 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | mary |
| పేజీలు విడదీసినది | mary |
| స్కాన్ చేసినది | Navya |
| పరీక్ష చేసినది | THASIN |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |